వెంకటశ్రీనివాసాచార్యులు, కిళాంబి

వారసత్వము

రాజమండ్రి, 1922

Record no. 572

Veṅkaṭaśrīnivāsācāryulu, Kiḷāmbi

Vārasatvamu

Rājamaṇḍri, 1922

Record no. 572

## Bibliographic Record Target

వెంకటశ్రీనివాసాచార్యులు, కిళాంబి.

వారసత్వము / కిళాంబి వెంకటశ్రీనివాసాచార్యులు గారిచే రచియిఁపఁబడియె.- 1. కూర్పు.- రాజమండ్రి : శ్రీ విద్యానిలయ ముద్రాక్షరశాల, 1922.

xv, 176 p, port. ;19 cm.

Record no. 572

Veṅkaṭaśrīnivāsācāryulu, Kiḷāmbi.

Vārasatvamu / Kiḷāmbi Veṅkaṭaśrīnivāsācāryulu gāricē raciyim̐pam̐baḍiye.- 1. kūrpu.- Rājamaṇḍri : Śrī Vidyānilaya Mudrākṣaraśāla, 1922.

xv, 176 p, port. ;19 cm.

Record no. 572



K. V. Srinivasacharyulu, B. A.





# వారసత్వము.

ఇది

చెన్నపురిరాజధానికి వర్తించెడు మితాక్షరన్యాయముప్రకారము
వారసత్వపుక్రమమును వెల్లడిచేయునది.

కిళాంబి వెంకటశ్రీనివాసాచార్యులు బి. ఏ.
ఫస్టుగ్రేడుప్లీడరుగారిచే
రచియింపఁబడెను.






మొదటికూర్పు 1000 ప్రతులు.

డి. వి. రమణారావుగారిచే

శ్రీ విద్యానిలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడెను.

1922

 [వెల రు 2—0—0

చందాదారులకు రు 1—0—0 మాత్రము.

# PREFACE.

As already pointed out in the preface to the first book of the series viz., "The Ryot and the Land," knowledge of Law is at least as essential to man as any of its other branches. Its importance and utility to the public is increasing day by day with the progress of civilization. If knowledge is power, then legal knowledge is moral courage which is one of the chief ingredients of power; so it is unnecessary to dwell much upon its advantages here in this book again.

Hindu Law of Inheritance occupies a very prominent place in the history of legal literature in India and the selection of Mitakshara law from it for this series is entirely in accordance with the requirements of its readers.

The plan adopted here is the same as that indicated in the preface to the first book and the aim throughout has been to combine simplicity of treatment with completeness in all the legal principles and the rulings thereon properly arranged, classified and brought up to date in such a manner as will enable the readers of all classes to have a permanent grasp of the law. So, the readers only must judge how far the author has achieved this.

It is not out of place for the author to express here his great obligation to the learned works of Pandit Rajkumar Sarvadhikari, Sir Guru Das Benerjee, Sir E. J. Trevelyan, John D. Mayne revised by Justice Coutts Trotter, H. S. Gour. Ramakristna, and D. F. Mulla and others, to which he has made frequent reference.

Rajahmundry,<br>15th Nov. 1922. } K. V. S.

# అవతారిక.

తెలుగున్యాయశాస్త్రగ్రంథమాలయొక్క ప్రథమగ్రంథమగు ‘రయితు–భూమి’ యొక్క యవతారికలో చెప్పబడినటుల మనుజునికి న్యాయశాస్త్రజ్ఞాన మధమపక్షము మరియితరశాస్త్రజ్ఞానమునంతయైన ముఖ్యమైయున్నది. జనులకు దానియవసరమును ప్రయోజనమును, నాగరికత యభివృద్ధియైనకొలది హెచ్చుచున్నయది. జ్ఞానమేబలమను సామెతనిజమైనయెడల యట్టిజ్ఞానమున కొకశాఖగానుండిన న్యాయశాస్త్రజ్ఞానము, బలమున కొకహేతువుగా జేరియుండిన నీతివలనగలిగెడు ధైర్యమునకటకు సందియములేదు. గానదాని ప్రయోజనముల విషయమై తిరిగి యీగ్రంథములో నిచట విస్తరించి వ్రాయనవసరములేదు.

వారసత్వమును హిందూన్యాయశాస్త్రము మనదేశమందలి ధర్మశాస్త్రచారిత్రమునందు ప్రాముఖ్యతనువహించియున్నది. అందులో నీగ్రంథమాలయొక్క చదువరులకు కేవలము వర్తించునదియు కావలసినదియు నగుమితాక్షరన్యాయము ప్రాధాన్యమైన వారసత్వమునే యీగ్రంథవిషయముగా నెంచబడెను.

మొదటిగ్రంథముయొక్క యవతారికలో సూచింపబడిన పద్ధతులే యీగ్రంథములోగూడ నవలంభింపబడెను. ఈగ్రంథమంతటిలోను ముఖ్యోద్దేశమే మాచదువరులెట్టితరగతివారైనను వారికిన్యాయశాస్త్రజ్ఞానము సులభముగాను ఖాయముగాను పట్టుబడులాగున నేటివరకు సమయములలోగలయావత్తు న్యాయశాస్త్ర సూత్రములను వానిపై యాయాసందర్భములలో గల తీర్పులను చక్కగా విభజించి తరగతివారిగానుంచి నేర్పఱచి సంపూర్ణత్వముతో స్పష్టతను మిళితముజేసి ప్రస్తావించువిధమును యీగ్రంథములో నవలంబించుటయే

మై యున్నది. గాన గ్రంథకర్త దాని నెంతవరకు నెఱవేర్చగలిగెనో చదువరులే నిర్ణయించవలయును.

ఈసందర్భములో పండితరాజకుమార సర్వాధికారి, సర్ గురుదాసుబెనర్జి, సర్ ఇ. జె. ట్రెవిలియన్, జె. డి. మెయిన్, జస్టిసు కూట్సుట్రాటర్, హెచ్. యస్. గవర్, రామకృష్ణ, డి. యఫ్ ముల్లా మొదలగు గొప్పవిద్వాంసుల పాండిత్యముతో గూడిన గ్రంథములజదివి వానినుండి ప్రామాణ్యములను లెత్తి కొనగలిగినందులకు వాని యెడల గల కృతజ్ఞత నీగ్రంథకర్త వెల్లడిజేయుట కిదియే యుచితమైన స్థానమై యున్నది.

రాజమండ్రి
15 నవంబరు 1922 } కిడాంబి వెంకటశ్రీనివాసాచార్యులు.

---

## సంకేతాక్షరములు.

## Abbreviations

మనహిందూదేశములోగల మదరాసు, బొంబాయి, కలకత్తా అలహాబాదు, పాట్నా హైకోర్టుల తీర్మానములను మరియితర కోర్టుల తీర్పులను యెప్పటికప్పుడు గవర్నమెంటువారి వలనను ప్రైవేటుసంఘములవారి వలనను ప్రజల యుపయోగమునిమిత్తము వార్తాపత్రికల వలెనే (journals) ప్రచురము కాబడుచుండును. వానిలో గవర్నమెంటువారు ప్రచురించునవి ప్రతిహైకోర్టుయొక్క తీర్పులలోను ముఖ్యములైనవి యెంచబడి ప్రత్యేకము సంవత్సరమున కొకపుస్తకమగులాగున ప్రతిమాసమున సంపుటములుగా నాంగ్లేయభాషను



ప్రచురము కాబడుచుండును. వీనినే ఇండియన్ లారిపోర్టు లందురు. ప్రతిహైకోర్టుయొక్క తీర్మానములను యేటేట సంవత్సరమున కొక పుస్తకముగా ప్రచురింప నారంభించినది మొదలు నేటివరకు నైన పుస్తకములకు వరుసనెంబరు లుండును. ఏదైన నొకవిషయము నీపుస్తకములనుండి కనుగొనుటకు సంకేతాక్షరములవలన తెలియనగును.

ఉ: 25 మ. 678 = ఇండియన్ లారిపోర్టులలో మదరాసు హైకోర్టువారి 25 నెంబరు పుస్తకములో 678 నెంబరు పుటలో యట్టివిషయ మున్నదని యభిప్రాయము.

మ = మదరాసు

బొం = బొంబాయి

క = కలకత్తా

అ = అలహాబాదు

ఈయిండియన్ లారిపోర్టులు ప్రచురమగుచుండుటకు పూర్వము ఆయాహైకోర్టుల తీర్పులు వేరువేరు హైకోర్టు రిపోర్టులుగా ప్రచురింపబడుచుండెడివి. వానికి సంకేతాక్షరము లెవ్వియన:—మదరాసు హైకోర్టు రిపోర్టు = మ. హై. కో. రి = మ. హై. కో = మ. హై. రి. ఉ: 2మ. హై. రి 196 = 2 వ నెంబరు మదరాసుహైకోర్టు రిపోర్టులో 196 వ పుటయందావిషయ ముండునని యభిప్రాయము. ఇటులనే యితరహైకోర్టులకు నూహించునది.

ఇవిగాక ప్రతిరాజధానిలోను యనేక ప్రైవేటుసంఘములు తేర్పడి వారికి ముఖ్యములనితోచు తీర్పులను జేర్చి యటులనే పుస్తకములుగా వేరువేరు పేర్లతో ప్రచురించుచున్నారు. అట్టివాని కీదిగువ నుదహరించిన సంకేతాక్షరము లుపయోగింపబడును.

మ. ల. జ = మదరాసు లాజర్నలు (The Madras law journal)

మ. వీ. నో = మదరాసు వీక్లీనోట్సు (The Madras Weekly notes)

మ. లా. టై = మదరాసు లాటైమ్సు (The Madras law times)

లా. వీ = లా వీక్లీ (Law weekly)

ఇం. కే = ఇండియన్ కేసులు (Indian Cases)

మొదలగునవి. తదితరంబు లూహ్యంబులు.

ఇతర సంకేతాక్షరములు.

ప్రి. కౌ = ప్రివికౌన్సిలు తీర్పు (Privy Council) అనగా మనదేశములోని హైకోర్టుతీర్పులపైనిఅప్పీళ్లు సీమదేశములోనున్న ప్రివికౌన్సిలు వారిచే తీర్మానింపబడును. అట్టి అప్పీలుతీర్పులను ప్రివికౌన్సిలు తీర్పు లందురు.

పూర్వము ప్రచురముకాబడిన యట్టి తీర్పులను మూర్సుఇండియన్ అప్పీళ్లనియు (Moores Indian Appeals = మూ.ఇ.అ) ఇప్పుడు ప్రచురము కాబడు యట్టి తీర్పులను ఇండియన్ అప్పీళ్లనియు (Indian Appeals = ఇ. అ) వాడబడుచున్నయవి. పూర్తిబెంచి (Full Bench = పూ. బెం) యనగా నొకహైకోర్టులో గద్దైనవిషయమును గురించి తీర్మానించుటలో సందేహము గలిగినపుడు అధమపక్షము ముగ్గురుజడ్జీలచే నలంకరింపబడిన కోర్టువారిని నియమించుదురు. అట్టి కోర్టువారిచే పరిష్కరింపబడిన దానిని పూర్తిబెంచి తీర్పులందురు.

ఇటులనే యితరసంకేతాక్షరములను గూడ గ్రహించునది.

హిందూన్యాయశాస్త్రము. 

సారసత్వము.

# విషయసూచిక.

## CONTENTS.

## రెండవయధ్యాయము.







## మూడవయధ్యాయము.

ఆరవయధ్యాయము.



సప్తమాధ్యాయము.







---

# హిందూ న్యాయశాస్త్రము.

# వారసత్వము.

## మొదటి యధ్యాయము.

---

### హిందూ న్యాయశాస్త్రస్వరూపము.

---

ప్రస్తుతము మనదేశమునందు దమలులోనున్న హిందూధర్మశాస్త్రమునకు (Hindu law) మూలాధారములు. (Sources)

1. శ్రుతులు 2. స్మృతులు 3. పురాణములు 4. వ్యాఖ్యానములు (Commentaries) 5. నిబంధనసంగ్రహములు (Digests) 6. ఆచారములు (Customs) 7. చట్టనిర్మాణసంఘమువారి శాసనములు (Legislative enactments) 8. న్యాయాధికారుల తీర్మానములు (Judicial decisions) ముఖ్యములైయున్నవి. అనగా యీవిధి మన పూర్వులగు ఆర్యులకాలములో శ్రుతులు—స్మృతులు—పురాణములును కొంతకాలము గడచినతర్వాత యుత్పత్తిస్థితిగతుల ననుసరించి కాలానుసారముగా పూర్వులచే చేయబడిన నిబంధనములు దరిమిలాను సంగ్రహములు వ్యాఖ్యానములును, మరికొంతకాలమునకు క్రమక్రమముగా వాడుకలోనికివచ్చిన యాచారములును, యిటీవల కాలభేదములవలన జనసంఘములో గలుగుమార్పుల కనుగుణ్యముగాను యవసరముల కనుకూలముగాను చట్టనిర్మాణసంఘమువారిచే నిర్మింపబడిన శాసనములును, న్యాయాధికారుల తీర్మానములును, గలసి యిప్పటి హిందూన్యాయశాస్త్ర మమలుజరుగుచున్నదని చెప్పవచ్చును గాని

యిది నేరములను సంబంధించిన చట్టమువలె (Penal code) యొక క్రమమయినవరుస ననుసరించిన నిబంధనలతోఁగూడిన చట్టముగా నుండుటలేదు. దానియుత్పత్తియొక్క చరిత్రకాలమును పూర్వకాలము మధ్యకాలము నవీనకాలమునని మూఁడుభాగములుగా విభాగింపనగును ఈచరిత్రవిషయములో పూర్వకాలమనగా యాదినుండి సుమారు పదిలేకపండ్రెండువందల సంవత్సరములకిత్రమువరకుననియు మధ్యకాలమనగా పది—పండ్రెండువందల సంవత్సరముల క్రితమునుంచి రెండు మూడువందలసంవత్సరముల క్రితమువరకుననియు, నవీనకాలమనగా రెండుమూఁడువందలసంవత్సరముల క్రితమునుంచి నేటివరకు అనగా బ్రిటిషురాజ్యపరిపాలన కాలమని యభిప్రాయము. దీనిఁబట్టి పూర్వకాలమునందు శ్రుతులుస్మృతులు పురాణములును మధ్యకాలమునందు వ్యాఖ్యానములు: సంగ్రహములు నిబంధనలు కొన్ని ఆచారములు నవరణలు మొదలగునవియు నవీనకాలములో కొన్నిఆచారములును చట్టనిర్మాణసంఘమువారి శాసనములును న్యాయాధికారుల తీర్పులును కొన్ని నవరణలును పుట్టియున్నవి. ఇవియన్నియుఁజేరి యిప్పటి హిందూన్యాయశాస్త్రమయినది. హిందూన్యాయశాస్త్రమునకు ముఖ్యాధారము శ్రుతులనియు, తరువాత స్మృతులనియు, ప్రాముఖ్యతలో పురాణములు యీరెండిటికి మధ్యగాని యీరెండిటికి తర్వాతగాని వచ్చుననియు యీమూడిటితరువాత స్మృతులకయిని పూర్వులచే చేయబడిన వ్యాఖ్యానములును టీకలును (Commentaries) వీటిదరిమిలాను నిబంధనలు (Digests) వచ్చుననియు అలహాబాదుహైకోర్టువారు నుడివిరి. (౨ అ 253—284) గనుక వీటిని వరుసగాఁకొంచెము విమర్శించిచూతము.

శ్రుతులు.

శ్రుతులు—అనగా వినికివల్లవ్యక్తములయినవి వేదములని యభిప్రాయము. అపౌరుషేయసంబంధములనియు దేవునిముఖతా పురాతనఋషులకును వారిముఖతా ప్రజలకును తెలియపర్చబడినవనియు నమ్మి హిందువులు వానిని మిగుల పవిత్రమయిన జ్ఞానాధారములుగా గణింతురు. వ్రాతయన నెట్టిదోతెలియని పూర్వలోకులకు చెప్పఁడము మూలముగా ననేకతరములనుండి యవివచ్చుచూ యిప్పుడువ్రాతమూలమయిన గ్రంధములుగా తయారై యచ్చునఁగూడనున్నవి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము నని వేదములు నాలుగువిధములు. అందులో ఋగ్వేదము మొదటపుట్టినది అనగా యిప్పటికి మూఁడువేలసంవత్సరముల పయిగా నగునని చెప్పుదురు. యజుర్వేదము సామవేదము దరిమిలాను సుమారు రెండువందల సంవత్సరములయినతరువాతను, అధర్వణవేదము యాఖరున యనగా యజుర్వేదము సామవేదము పుట్టినతర్వాత సుమారు రెండువందల సంవత్సరములకును పుట్టినవని చెప్పుదురు. యజుర్వేదము కృష్ణయజుర్వేదమనియు శుక్లయజుర్వేదమనియు రెండువిధములు. కృష్ణయజుర్వేదమనగా కొంచెమువివరముగా వ్యాఖ్యానములతోఁ గూడినదైయుండునది. శుక్లయజుర్వేదమునకు అట్టివివరములులేక శుభ్రమయినధ్యాన శ్లోకములు. (Hymns) లేక కీర్తనలతో నిండియుండును. వేదముల తరువాత బ్రాహ్మణములని కేవలము కర్మకాండకు సంబంధించిన మంత్రములును, యుపనిషత్తులని కేవలము నాత్మవిషయమై తెలియజేయు వేదాంతవచనములును పుట్టినవని చెప్పుదురు. వేదములు కేవలము ఇంద్ర-యగ్ని-యమ వరుణ మొదలగుదేవతలను ప్రార్థించుటకును వారినితృప్తిపొందించుటకుగాను ఆహుతులు-బలులు మొదలగువానిని చేయువిధములను దెలుపుటకును యేర్పడినమంత్రగానములతోఁ గూడినవిగాన వానిలో న్యాయశాస్త్రములుగాని దేశచట్టములుగాని ప్రత్యేకముగా నున్నవని చెప్పుటకు వీలులేదుగాని వానివల్ల యిప్పటి జనసంఘములోఁగల యాచారములు—పద్ధతులు మతముల కట్టు

బాటులు మొదలగు యంశములు వెల్లడియగుచుండుటచే వానినిబట్టి ముఖ్యమయిన న్యాయశాస్త్రసూత్రములను మనము సులభముగా నూహింపవచ్చును మరియు వానివలన నాకాలములో గొప్పపట్టణములు నగరములు యుండినట్లును యప్పటిరాజులు మిగులనైశ్వర్యముతో తులతూగుచు దేశము బహునాగరికతను గలిగియుండినట్లును తెలియవచ్చుచున్నది. వేదములవల్ల తెలియుసంగతులు యింకను యనేకములున్నను ప్రస్తుతవిషయమున కంతవివరముగా వ్రాయనవసరము లేదు.

### స్మృతులు.

స్మృతులు అనుమాటకు జ్ఞాపకముంచుకొనబడినవి యని యర్థము. అనగా ఆదిని స్మృతులనునవి వేదములను తెలుసుకొనిన పురాతనఋషులవాక్కులచే చెప్పబడి యటులనే ప్రజలలో యన్నోన్నతరములనుండి పెద్దలు చెప్పడముమూలముగా జ్ఞాపకముంచుకొనబడిన శాస్త్రములని యర్థము. ఇవి హిందూన్యాయశాస్త్రమునకు ముఖ్యమయిన మూలాధారములుగా నున్నవి. ఇవి ధర్మసూత్రములనియు ధర్మశాస్త్రములనియు రెండువిధములు.

### స్మృతులు—ధర్మసూత్రములు.

ధర్మసూత్రములు వచనకావ్యములుగాను, ధర్మశాస్త్రములు పద్యకావ్యములుగాను నున్నవి. ధర్మసూత్రములనునవి వేదములయొక్క సర్వసంగ్రహనిఘంటువు (Vedic Encyclopoedias) అని చెప్పవచ్చును. అవి వేదములలోగల యంశములను వేర్వేరుతరగతుల క్రింద విభజనచేసి వేరువేరుతరగతులకు వేర్వేరుపేర్లతో ముఖ్యమయిన యంశములను జాబితాలుగా కనబడుచున్నవి. ఇట్లు యింటియజమానులు చేయవలసినవిధులు, రాజులు చేయవలసినవిధులు—న్యాయపరిపాలనపద్ధతులు—వారసత్వపు చట్టములు మొదలగునవి ధర్మసూత్రములలో ముఖ్యమయినవిషయములుగా గానిపించును. ఇట్టిసూత్రములలో ముఖ్యమయినది యాంధ్రదేశములో బుట్టిన యాపస్తంభసూత్రము. ఇది యజుర్వేదశాఖకు సంబంధించినది. బౌద్ధాయనసూత్రము, హిరణ్యకేశిసూత్రముగూడా యజుర్వేదశాఖకే సంబంధించినది. గౌతమసూత్రము—సామవేదశాఖకును, వశిష్టసూత్రము—ఋగ్వేదశాఖకును సంబంధించినవి. హారీతసూత్రము—కృష్ణయజుర్వేదశాఖకు సంబంధించినది. ఈసూత్రములుపుట్టి కొంచెమెచ్చుతగ్గుగా 2500 సంవత్సరములగునని చెప్పెదరు. వానిలో ఆపస్తంభసూత్రముకంటె బౌద్ధాయనసూత్రమును, బౌద్ధాయనసూత్రముకంటె గౌతమసూత్రమును, గౌతమసూత్రముకంటె హారితసూత్రమును వరుసగా సుమారు నూరేసి సంవత్సరములు ముందుపుట్టినవని చెప్పెదరు. విష్ణు—యమ—కాశ్యపశంఖ సూత్రములుగూడ గలవు.



### స్మృతులు—ధర్మశాస్త్రములు.

స్మృతులలో మనుస్మృతి యాదిని పుట్టినదందురు. అది మిగుల పురాతనమైనదగుటచేతను న్యాయశాస్త్రమునకది మిగుల యాధారముగా నుండుటచేతను దానిని ప్రజలు మిగుల పూజింతురు. ఇది పుట్టి రెండువేల యేనూరు సంవత్సరములుపైగా కావచ్చును. మను ధర్మశాస్త్రము యొకరివల్ల చెప్పబడినట్లు కనుపించదు మనువు బ్రహ్మకుపుట్టి బ్రహ్మవల్లనే యీచట్టమును తెలుసుకొని పదిమందిఋషులకు చెప్పినట్టును అందులో భృగుమహాఋషి మిగతాఋషులకు తిరిగి చెప్పినట్టును యీస్మృతివల్ల తెలియవచ్చుచున్నది. ఏదియెటులుండినను యీధర్మశాస్త్రము యాకాలమందుండు ప్రజల యాచారములు కట్టుబాటులు మొదలగువిషయములను తెలుపుచుగాని కలియుగములో యిప్పటికాలమునకు కేవలము యది వర్తించదుగాని దానినుండి న్యాయశాస్త్రపరిశీలనయందు దానశక్తిగలవారు నేర్చుకొనవలసిన యంశ

ములనేకములు గలవు. మనుస్మృతికి భృగుసంహితము నారదము బృహస్పతీయము ఆంగీరసము యని నాలుగుపాఠాంతరములు గలవు. ఇట్టి ధర్మశాస్త్రములలో మనుస్మృతితరువాత చాలా కాలమునకుపుట్టి ముఖ్యముగా వాడుకలోనున్న యాజ్ఞవల్క్యస్మృతి, నారదస్మృతి పరాశరస్మృతి యును దాదాపుగా పదునైదువందల సంవత్సరములకు లోపువియై యుండును. ఇంకను యనేకస్మృతులుగలవు.* అందులో శంఖ, శంఖలిఖిత, లిఖిత, వ్యాస, వృద్ధశాతాతప యమ ప్రజాపతి దేవల, దక్ష, అత్రి, ఆంగీరస స్మృతులు సుమారు యేడు యెనిమిదివందలసంవత్సరములలోపున పుట్టియుండును. మనుస్మృతికాలమునకే మన దేశములో జాతిభేదములుయున్నట్టు కనిపించును గాని యాకాలములోనవి యంతగా పట్టింపుతో యున్నట్టు కనుపించదు. దరిమిలాను బ్రాహ్మణమతము వ్యాపించినకొలది యామతాభివృద్ధికొరకు తగిన కొన్ని కట్టుబాటులలో దరిమిలాస్మృతులు కొన్ని చేయబడినట్టున్నూ అటులనే యిటీవల వైష్ణవమతాభివృద్ధికొరకు యామతానుగుణ్యముగా కొన్నిస్మృతులు చేయబడినట్టున్నూ గనబడుచున్నది.

### పురాణములు.

హిందూన్యాయశాస్త్రమునకు యాధారములుగా నెన్నబడుటలో ప్రాముఖ్యతయుండదు మహాభారతము, కలిక విష్ణు, ఆదిత్య మొదలుగాగల పురాణములు శ్రుతులకున్నూ స్మృతులకును మధ్యగాని యీరెండింటితరువాతగాని వచ్చునని యలహాబాదు హైకోర్టువారనిరి. 9 అ 253—(289).

### వ్యాఖ్యానములు, నిబంధనలు.
### (Commentaries & Digests)

పురాతనస్మృతులపై వ్యాఖ్యానములు వెలువడుట యిప్పటికి సుమారు వెయ్యిసంవత్సరములక్రితం ప్రారంభమై క్రమేణా యనేక వ్యాఖ్యానములు బయలువడియుండెను.



### మనుస్మృతివ్యాఖ్యానము.

అందులో మనుస్మృతిమీద మేధాతిథివ్యాఖ్యానము మిగుల ప్రాచీనమైనదని చెప్పవచ్చును. కల్లూకభట్టునివ్యాఖ్యానము మిగుల ప్రశస్తమయినదని సర్ విలియము జోన్సుదొరగారు వక్కాణించిరి. మనుస్మృతిపై వ్యాఖ్యానములింకను కలవు. వానిలో ముఖ్యముయినవి ధార్ణిధరుడు గోవిందరాజు వరూచి శ్రీకరుల వ్యాఖ్యానములయి యున్నవి గాని యివి యంతగా యుపయోగపడుటలేదు.

### పరాశరస్మృతి.

పరాశరమాధవీయమనునది మాధవాచార్యులచే చేయబడిన పరాశరస్మృతిమీద వ్యాఖ్యానమై యున్నది.

### యాజ్ఞవల్క్యస్మృతి వ్యాఖ్యానములు.

వ్యాఖ్యానములన్నిటిలోను యాజ్ఞవల్క్యస్మృతిపై విజ్ఞానేశ్వరుడుచేసిన విజ్ఞానేశ్వరీయము లేక మితాక్షరము యను వ్యాఖ్యానము మన హిందూదేశమందంతటను మిక్కిలి యుపయోగపడునదియు వ్యాపకముగలదియు గొప్పప్రమాణముగా నెంచబడునదియు నై యుండెను. ఇతడు సుమారు ఎనిమిదివందల సంవత్సరములక్రిందట నున్నట్టు కనుపించును. ఇతడు దక్కను దేశమందలి కళ్యాణదేశవాసిగా నుండెను. కాన మితాక్షరము ప్రథమములో దక్షిణహిందూస్థానమునందుబుట్టి క్రమేణా గంగానదీతీరమువరకు వ్యాపించియుండెను. ఇప్పుడీవ్యాఖ్యానము వంగదేశమను బంగాళారాజధానియందును బొంబాయియందును తప్ప మిగతాహిందూదేశమందంతటను యెక్కువయాధారముగాను ప్రమాణముగాను యుపయోగింపబడుచున్నది. ఈ వ్యాఖ్యానముమీద వ్యాఖ్యానములుగూడ గలవు. సుబోధిని యను విశ్వేశ్వరభట్టు చేసినవ్యాఖ్యానమును లక్ష్మివ్యాఖ్యానము లేక బా

లంభట్టుటీక యను లక్ష్మీదేవిచేసిన వ్యాఖ్యానమును మితాక్షరమునకు వ్యాఖ్యానములై యున్నవి.

యాజ్ఞవల్క్యస్మృతిమీద కొంకణదేశపురాజుగానుండిన అపరార్కుని వ్యాఖ్యానము కాశ్మీరదేశములో ప్రమాణముగా గైకొనంబడుచున్నది. ఈస్మృతిమీద విశ్వరూపుని వ్యాఖ్యానముగూడ నున్నదిగాని యది పోయినందున యంతగా వాడుకలో లేదు. ఈమధ్య మలబారుదేశమందొక ప్రతి దొరకి యది యిగ్లీషున తర్జుమా కాబడుచున్నట్లు తెలియవచ్చెను.

నిబంధనలు.

Digests

వ్యాఖ్యానములను నిబంధనలను పూర్వులు వేరువేరుగా నెంచక రెంటిని వ్యాఖ్యానములుగా నెన్నుచుండిరి గాని యీరెంటికి స్వల్ప భేదమున్నట్లు కనుపించును. కేవలము స్మృతులయొక్క టీకతాత్పర్యములుగలవి వ్యాఖ్యానములను యట్లుగాక స్మృతులయందలి సారాంశములను వరుసపెట్టి సూత్రములుగా వ్రాయబడిన చట్టములు నిబంధనలని (Digests) పిలువబడుచున్నవి. అయితే యీరెంటియందును గూడ గ్రంధకర్తలు వారివారి యభిప్రాయములు ప్రకారమప్పటికి వాడుకలోనున్న యాచారములను జేర్చుటకలదు.

జీమూతవాహనునిదాయభాగము.

జీమూతవాహనునిదాయభాగము మితాక్షరములోని వారసత్వము పంపకములకు సంబంధించినభాగములకు నిబంధనయని చెప్పవచ్చును. ఇదివంగదేశమనబడు యిప్పటి బంగాళాదేశమునకు వర్తించుచున్నయది. మితాక్షరమువలె దీనిమీదగూడ వ్యాఖ్యానములుగలవు అందులో శ్రీనాథాచార్యులవారి వ్యాఖ్యానము ముఖ్యమయినది.



శ్రీకృష్ణతర్కాలంకార, అచ్యుతచక్రవర్తి, మహేశ్వరులుగూడ వ్యాఖ్యానములను చేసిరి.

వ్యవహారమయూఖము.

నీలకంఠుని వ్యవహారమయూఖము వారసత్వము మొదలగు వానివిషయమై వ్యాఖ్యానములేక నిబంధనమైయున్నది. దీనిని బొంబాయి రాజదానిలో ముఖ్యమయిన ప్రమాణముగా వాడుచున్నారు.

వివాదచింతామణి, వ్యవహారచింతామణి, వివాదచంద్రిక.

వివాదరత్నాకరము.

ఈనాలుగుగ్రంధములును ప్రాముఖ్యతనుబట్టి వరుసగా మిధిల దేశమందు ప్రమాణములుగా గైకొనబడుచున్నవి. మొదటి రెండును వాచస్పతిమిశ్రులవారిచే చేయబడినవ్యాఖ్యానములై యున్నవి. వివాదచంద్రిక కరవీరునిచే చేయబడినది. వివాదరత్నాకరము ఛండేశ్వరఠాకూరినిచే చేయబడెను.

దాయవిభాగము, స్మృతిచంద్రిక—వ్యవహారనిర్ణయము, సరస్వతి విలాసము.

మరియును మాధవీయునిచే చేయబడిన దాయవిభాగమును దేవన్నభట్టునిచే చేయబడినస్మృతిచంద్రికయును-వరదరాజునిచే చేయబడిన వ్యవహారనిర్ణయమును వ్యాఖ్యానగ్రంధములు మూడింటిని చెన్నపురి రాజధానిలో కొన్ని విషయములలో ముఖ్యమయిన ప్రమాణములుగా నెంచుచున్నారు. ప్రతాపరుద్రదేవునిచే చేయబడిన సరస్వతీవిలాసమను గ్రంథమును వొరియాదేశమందును-చెన్నపురిరాజధానియందును గూడ ప్రమాణముగా వాడుచున్నారు.

దత్తచంద్రిక—దత్తమీమాంస.

రఘుమణిచే చేయాబడిన దత్తచంద్రికయు నందపండితునిచే చేయబడిన దత్తమీమాంసయు, దత్తతస్వీకారము విషయమైగల వచన

కావ్య గ్రంథములైయున్నవి. వర్తతవిషయములో నీరెండింటిని హిందూదేశమందంతటను మిగులప్రాముఖ్యతగల ప్రమాణములుగా నెంచుచున్నారు. ఇంకను ననేకగ్రంథములుగలవుగాని వానినిచట వివరముగా వ్రాయనవుసరము లేదు.

హిందూన్యాయశాస్త్రము మార్పులజెందుట.
భాషాంతరములు వానివల్ల అసలుశాస్త్రములో కొన్ని
మార్పులు కలుగవచ్చుననుటనుగురించి.

ఇంతవరకు శ్రుతులు-స్మృతులు పురాణములు వ్యాఖ్యానములు, నిబంధనలుకలసి ప్రజలను రక్షించుటకై సాధనమగు న్యాయశాస్త్రమయ్యెను. ప్రజలనేలువారు మారుచుండినను వారుస్వదేశీయులైనను యీదేశపుధర్మశాస్త్రములు మారుటలేదు. అనగా హిందువులతగవులు, హిందూన్యాయశాస్త్రప్రకారమును మహమ్మదీయుల తగవులు మహమ్మదీయన్యాయశాస్త్రప్రకారమును పరిష్కరింపబడుచుండెను గాని యొకదేశపుప్రజలతగవులు మరియొకదేశపుచట్టముల ప్రకారము పరిష్కరింపబడుటలేదు. అయితే కాలవ్యత్యాసమునుబట్టి యవసరమైన మార్పులు ప్రతిదేశచట్టములయందును గలుగవచ్చును అట్లుశ్రుతులు-స్మృతులలోగల యంశములు కొంతవరకు మార్పునుజెందియు యప్పటప్పటి గ్రంథకర్తలయభిప్రాయముల కనుగుణ్యముగా నూతనసంగతులు చేర్చబడియు వ్యాఖ్యానములును నిబంధనలును జేయుబడియున్నవి. మహమ్మదీయుల కాలములో నవాబులు మన హిందువులతగవులను పరిష్కరించుటలో ధర్మసందేహములు గలిగినపుడు మనన్యాయశాస్త్రములలోని సూత్రములకు అర్థముచెప్పి యట్టి సందేహముల దీర్చుటకు తగినపండితుల నియమించగా వారుతమయభిప్రాయానుసారముగా తీర్పులనిచ్చుటకుగాను స్మృతులను వ్యాఖ్యానములను తమయిష్టముప్రకారము వేరుఅర్థములనుజేసి పూర్వపున్యాయ



శాస్త్రములు కొంతవరకుమార్చిరి. దరిమిలాను బ్రిటిషుగవర్నమెంటువారి పరిపాలన ప్రారంభమయినతరువాతను గూడ పూర్వమువలెనే వారసత్వము—వివాహము—మతసంబంధము మొదలగువాని విషయములలో హిందువులతగవులు పరిష్కరించవలసివచ్చినప్పుడు వారి న్యాయశాస్త్రప్రకారమును మహమ్మదీయుల తగవులు పరిష్కరించవలసివచ్చినప్పుడు కురానుశాస్త్రప్రకారము అనగా మహమ్మదీయుల శాస్త్రప్రకారము పరిష్కరించవలయునని ప్రత్యేకముగానొక చట్టమునుగూడ యమలులోనికి తెచ్చిరి. అట్టిచట్టమీసరికిని కొన్ని మార్పులతో అమలునందున్నయది. ఇట్టిచట్టము అమలులోనికి వచ్చినవెంటనే ఇంగ్లీషున్యాయాధిపతులకు మనశాస్త్రములను నిజస్వరూపముతో నమ్మకమయిన పండితులచే ప్రచురింపజేసి వానిని వారిభాషలోనికి తర్జుమాచేయుట యవసరమనితోచి యట్లుకొన్నివ్యాఖ్యానములను నిబంధనలను తర్జుమాచేయించిరి. వారన్‌హేస్టింగ్సుప్రభువుగారు వివాదార్ణవసేతువను గ్రంథమును హాల్‌హెడ్డుదొరగారిచేయింగ్లీషున తర్జుమాచేయించిరి దానినే హాల్‌హెడ్డుకోడ్డందురు. (Halhed's code) విలియమ్‌జోన్సుదొరగారు జగన్నాథతర్కపంచాననయనువారిచే వివాదభంగార్ణవయను గ్రంథమును ప్రచురింపజేయగా దానిని కాల్‌బ్రుక్‌దొరగారు ఇంగ్లీషున తర్జుమాచేసిరి. దానికేజగన్నాథునినిబంధన (Jagannathas digest) యనిపేరు ఇటులనే జోన్సుదొరగారు మిథిలదేశపున్యాయవాదిగా నుండినసువర్ణత్రివేదియను వారిచే వివాదసారార్ణవమను మరియొకగ్రంథమును జేయించెను. తరువాత మదరాసుహైకోర్టులో ముఖ్యమయిన జడ్జీగారుగాయుండిన సర్ థామస్ స్ట్రేంజిదొరగారును సర్ విలియమ్‌మెక్నాటన్‌దొరగారును మిక్కిలి శ్రమపడి మనశాస్త్రములలోని ముఖ్యమయిన యంశములను పోగుజేసి కోర్టులకుపయోగించునటుల కొన్ని గ్రంథములను జేసిరి. సదరగ

లామదొరగారును — కాల్‌బ్రుక్కుదొరగారును కూడా మహిందూ ధర్మశాస్త్రమును నిరూపించుటకు మిగులపాటుపడిరి. ఇటువలెనే యనేక గ్రంథములు బయలుదేరెను. కాని యివి యిప్పుడంతగా యుపయోగపడుట లేదు. మెయినుదొరగారి హిందూలాగ్రంథము (Maynes, Hindulaw) ప్రథమమున 1878 సంవత్సరమున ప్రచురము కాబడి దరిమిలాను యనేకమార్పులనుబొంది యిప్పటికిని యొకప్రామాణ్య గ్రంథముగా యమలు జరుగుచుండెను. ట్రెవిలియన్, గవర్ సర్వాధికారి, భట్టాచారి, గోలాబుచంద్రశాస్త్రి రామకృష్ణ మొదలగువారిచే చేయబడిన గ్రంథములుకూడ గలవు.

### ఆచారములు.

#### ఆచారములు కొంతవరకు స్వతహాబుట్టినశాస్త్రమును మార్చ గలవనుటనుగురించి.

ధర్మశాస్త్రములు న్యాయపరిపాలనకు ముఖ్యసాధనముల య్యును కాలవ్యత్యాసములు మొదలుగాగల కారణములచే ప్రజలలో నొకొక్కజాతియందుగాని దేశములలో నొకొక్కప్రదేశమునందు గాని క్రమేణాయేర్పడు యాచారములు యమలుజరుగుచుండుటచే కొంతవరకు శాస్త్రమునందు మార్పులుగలుగుచున్నవని చెప్పవచ్చును. ఇట్టియాచారములు మిక్కిలి చిరకాలము యమలుజరిగి ప్రజలందరు వానిని చట్టములుగాగ్రహించి యంగీకరించినట్లగుపడుటచే ప్రభుత్వము వారు యనగా చట్టములనిర్మించు సంఘమువారు వానిని చట్టముగా యమలులోనికి తెచ్చెదరు. ఇట్లుకొంతకాలముయినగా చిరకాలము ప్రజలలో వాడుకలోయున్నయాచారములు ప్రభుత్వమువారిచే చట్టముగా యంగీకరించబడుటచే యట్టియాచారములే ధర్మశాస్త్రములగుచున్నవి. అట్టియాచారములుగూడ ధర్మశాస్త్రములగుటవలన యివి మునుపటిలోగల ధర్మశాస్త్రములకు వ్యతిరేకములుగాను యిప్పటి ధర్మ



శాస్త్రముల నతిక్రమించునవిగాను కానబడుచుండును కాని యివి ప్రజలయంగీకారమువలన యొకొక్కజనసంఘముచే యొకొక్క దేశమునందు చిరకాలమాచరింపబడుటచే యివి చట్టములంతప్రాముఖ్యతను వహించును గనుకనే యట్టియాచారములనుగూడ కోర్టువారు ధర్మశాస్త్రమువలె నంగీకరించుచున్నారు.

### ఆచారతరగతులు.

ఇప్పుడు కోర్టువారిచే నంగీకరింపబడు ఆచారములను నాలుగు విధములుగా విభజింపవచ్చును.

1. సర్వసాధారణముగా వివిధములగు జాతులుగలగొప్పజన సంఘమునందు వాడుకలోనున్న యాచారములు.

2. ప్రత్యేక మొకదేశమునందుమాత్రమే వాడుకలోనున్న యాచారములు.

3. ప్రత్యేకమొకజాతిప్రజలలోనే వాడుకలోనున్న యాచారములు అనగా కులాచారములు.

4 ప్రత్యేకము నొకొక్క కుటుంబమువారిలోనే వాడుక యందున్నయాచారములు; అనగా కుటుంబాచారములు.

ఇట్టియాచారములకుదాహరణములు— ఈగ్రంథముజదివినకొలది యనేకములు తెలియగలవు. సాధారణముగా జనసామాన్యమునకు వర్తించుధర్మశాస్త్రములనుసహా సవరణచేయగలసామర్థ్యమాచారములందుకలదు. అయితే యట్టియాచారములీదిగువ నదహరించిన లక్షణములనుగలవై యుండవలెను.

### ఆచారలక్షణములు.

1. అట్టియాచారములు చిరకాలమునుండి యొకరీతిగాను నడతెగకుండా, నాచరింపబడునవియై యుండవలెను. 3 మ. హై. రి 75 (ప్రి. కౌ)

అనగా నట్టియాచారములు పురాతనమైనవియై యుండవలెను. ఆచరణలో వానికి మధ్య యేవిధమయిన మార్పులుగాని ఆటంకములుగాని లేకుండ యెల్లప్పుడును నొకమోస్తరుగా కొనసాగుచుండవలయును.

2. అట్టియాచారములు నిర్దిష్టముగాను నిస్సంశయముగాను నాచరింపబడుచుండవలయును. 30. క. 590 (ప్రి. కౌ)

3. అట్టియాచారములను నాచరించుటలో నెంతమాత్రము కల్తులు లేకుండ ప్రజలందరియొప్పుదలమీద నెమ్మదిగా నాచరింపబడుచుండియుండవలెను. అనగా నట్టియాచారములుకలవని కొందరును లేవని మరికొందరును తగాయిదాలుపడుచూ యెంత కాలమునుండియుని యున్నట్టగుపడుచుండినను లాభము లేదు. 30. క. 590(603)

4. అట్టియాచారములు విధాయకముగాను బహిరంగముగాను హక్కుగాను నాచరింపబడుచుండవలయునుగాని రహస్యముగాగాని యెవరి యిష్టంవచ్చినట్టువారు అప్పటప్పటికి మంచితనముమీద యితరులయనుమతినిబడసిగాని దౌర్జన్యముమీదగాని యాచరింపబడినమాత్రమున నది ధర్మశాస్త్రమును సవరణచేయగలయాచారములు కానేరవు.

5. అట్టియాచారములు సబబుగాను న్యాయముగాను యుండవలయునుగాని ధర్మవిరుద్ధముగానుండరాదు. 3 ఇ. అ. 259

ఉదాహరణ—గ్రామస్థులందరు నొకనితాలూకు స్వంతచెరువులో చేపలుపట్టుకొను యాచారము. 9. క. 698 (704) ఇట్టియాచారములు సబబుగా లేవని కోర్టువారు త్రోసివేసిరి.

6. అట్టియాచారములు దుర్నీతికలవిగా యుండగూడదు.

ఉదాహరణములు—ఆడపిల్లలనమ్ముకొను యాచారము 32 మ. 185 భర్తయుండగా వానియనుమతిలేందే తిరిగిమరియొకని వివాహమాడుయాచారము 2 బొం. 14 జారత్వమువలన సొమ్ముసంపాదించు



టకు స్త్రీసంఘము యేర్పడుయాచారము 1 మ. 168 జారత్వమువలన సంతతికి వారసత్వపుహక్కు కలిగెడి యాచారము. 39 మ 136 మొదలగునట్టి యాచారములను కోర్టువారు యంగీకరించరు.

7. అట్టియాచారములు దేశహితముగాయుండవలెను. రాజనీతికి వ్యతిరేకముగా యుండకూడదు

ఉదాహరణము—మతసంబంధమయిన యుద్యోగమును అమ్ముకొనుయాచారము. 1 మ 235 (ప్రి కౌ) 42 క. 435 అటులనే వివాహమాడకూడదని యడ్డుపెట్టుయాచారములు కోర్టువారిచే నంగీకరింపబడవు.

8. అట్టియాచారములు సర్కారువారిచే యాచారములవిషయమై యేవిధమయిన మినహాయింపులు లేకుండా ప్రత్యేకము యమలులోనికి తేబడినచట్టములకు వ్యతిరేకముగానుండగూడదు.

ఉదాహరణములు—సహగమనము, నరబలి బానిసవర్తకము మొదలగునవి అటులనే లిమిటేషను అక్టు (Limitation Act) ప్రకారము కాలదోషముపట్టిన దావాను కాపాడుయాచారములంగీకరింపబడవు. ఏదయినాతగాయిదా పరిష్కరింపవలసినప్పుడు ధర్మశాస్త్రమును ప్రమాణముగా తీసికొనియెదరు. ధర్మశాస్త్రమును రద్దుచేయగల యాచారము లేమయినయున్న యెడల యట్టివానినినమ్ముకొనియుండువారు వానినిస్పష్టముగా కోర్టువారికి తెలియపర్చుటయేగాక నిస్సందేహముగా ఋజువుపర్చుకొనవలయును.

చట్టనిర్మాణసంఘమువారి శాసనములు.

Legislative enactments.

అవసరమునుబట్టి సర్కారువారిచే యప్పుడప్పుడు యమలులోనికి తేబడు చట్టములు మనహిందూన్యాయశాస్త్రమునందు కొన్నిమార్పులను గలుగజేయుచున్నవని చెప్పవచ్చును. యనగా యాదియందు

బుట్టిన హిందూన్యాయశాస్త్రము యిప్పటివరకును యీటులనేయుండక సర్కారువారి చట్టములవలన కొన్నిమార్పులను జెందినదని యభిప్రాయము. హిందూధర్మశాస్త్రముప్రకారము హిందువులను, కొరాను ప్రకారము మహమ్మదీయులను యేలుచుండవలయునని ఇంగ్లీషువారి ముఖ్యోద్దేశమయినను కాలవ్యత్యాసములనుబట్టి జనసంఘమునందు గలుగుచుండు మార్పులకును యభిప్రాయములకును యనుగుణ్యముగా కొన్నిమార్పుల జేయవలసివచ్చును. అట్టిమార్పులలో యొకప్పుడు కొన్ని ధర్మశాస్త్రమునకు కేవలము వ్యతిరేకముగాగూడ యుండవచ్చును. అసలు మనశాస్త్రప్రకారము కులముచెడినవానికి వారసత్వపుహక్కు నశించును. అనగా కుటుంబాస్తి వానికి సంక్రమించనేరదు. వానికేకాకుండా యతనిసంతతివారికిగూడ సదరాస్తియందు వారసత్వపుహక్కు గలుగనేరదు. అట్టిస్థితిలో క్రమముగా జనసంఘములో మతమునందుగల పట్టుదల తగ్గుటచేనైతేనేమి ధర్మశాస్త్రములోని యిట్టికట్టుబాటులు యిప్పటిస్థితినిబట్టి మిక్కిలియన్యాయముగాను కఠినముగాను యున్నదని బ్రిటిషుదొరతనమువారికి తోచుటచేతనయితేనేమి 1850 సంవత్సరములో కులముచెడినవానికిని వానిసంతతివారికిని వారియసలుకుటుంబముతాలూకు యాస్తియందు హక్కులు నశించకుండ యుండులాగున జనులు స్వేచ్ఛగా యితరమతముల నవలంబించుటకు తగినవీలును గలుగజేయుచు యొకచట్టము యమలులోనికి తేబడెను. (Freedom of Religion Act XXI of 1850) ఇటువలెనే 1856 సంవత్సరములో హిందూవితంతువులు పునర్వివాహమాడుటకు చట్టముప్రకారం యాక్షేపణలులేకుండా చేయుటకుగాను యొకచట్టము యమలులోనికి తేబడెను. హిందూవితంతు పునర్వివాహచట్టము (Hindn Widow's Remarriage Act XV of 1856), హిందూమతసంస్కరణపరాయణుల ప్రోత్సాహమువలన యమలులోనికి తేబడెను. దీనివలన



యిదివరలో హిందూధర్మశాస్త్రప్రకారము చెల్లని హిందూవితంతు పునర్వివాహములు లాప్రకారం చెల్లునటుల మార్పుకలిగెను.

మనుచట్టముప్రకారం పదునారుసంవత్సరములు దాటినవాడు మేజరగును. అనగా స్వయముగా వ్యవహారములను చక్కబెట్టుటకు తగిన వయస్సుగలవాడగును. దీనిని రద్దుచేయుచు 1875 సంవత్సరం 9 నెంబరు ఆక్టుఅనగా ఇండియన్ మేజారిటీ ఆక్టు (Indian majority Act) అమలులోనికి తేబడెను. దీనివలన సాధారణముగా పదునెనిమిది సంవత్సరములు దాటినగాని యెవరును మేజరుకానేరడు. అందులో కోర్టువారిచే యొకమయినరుకు గార్డియను నియమించబడినయెడల అట్టిమయినరు ఇరువదియొక్క సంవత్సరములవయస్సు దాటినగాని మేజరుకానేరడు. ఇటువలెనే ఆస్తి పరివర్తనచట్టము (Transfer of property Act) ను ఇండియన్ కాంట్రాక్టు ఆక్టు(Indian contract Act) శివిలు ప్రొశీజరుకోడ్డు (Civil Procedure Code) ను ఇండియన్ పీనల్ కోడ్డు (Indian Penal Code) మొదలగుచట్టములు యమలులోనికి తేబడుటచే హిందూధర్మశాస్త్రములో యనేకమార్పులు కలిగియున్నయవి.

### న్యాయాధికారుల తీర్మానములు.

Judicial decisions.

చట్టనిర్మాణసంఘమువారి శాసనములు (Legislative enactments) యాదినిబుట్టిన ప్రాచీన హిందూన్యాయశాస్త్రమునందు కొన్ని మార్పులు గలుగజేసినటులనే న్యాయాధికారుల తీర్మానములుకూడా యాశాస్త్రమునందు కొంతవఱకు మార్పులుగలిగించెనని చెప్పవచ్చును. వేరువేరు హైకోర్టువారు యొకయంశములోనే వేరువేరు యభిప్రాయములు పడుటవలన యాయాదేశములలో న్యాయశాస్త్రసాంప్రదాయములు వేరువేరుగాయుండుటకు గారణమయ్యెను. పూర్వము మన

ధర్మశాస్త్రములలోని గూఢార్థములను తెలియజేయుటకుగాను ప్రతి హైకోర్టులలోనూ పండితులు యేర్పడియుండిరి. ఇప్పుడట్టివారులేకయే వ్యవహారములు ఫయిసలగుచుండెను. కాలవ్యత్యాసమునుబట్టి మనస్థితిగతులు మారినటువలెనే న్యాయాధిపతుల తీర్మానములు పూర్వపుహిందూన్యాయశాస్త్రమునందు కొన్నిమార్పులు కలుగజేయుచున్నవి. అట్టిమార్పులకు మూడువిధములుగా యవకాశములు గలుగుచున్నవి.

1. పూర్వపుధర్మశాస్త్రములలో చెప్పబడని హాంశములవిషయమై యీకాలమునకు తగినటులను మనస్సాక్షికిన్యాయమని తోచినటులను నూతనసిద్ధాంతముల గల్పించుట.

2. పూర్వపువ్యాఖ్యానములలో ద్వంద్వార్థములనిచ్చు విషయములందును పరస్పరవిరుద్ధములుగానుండు విషయములందును గూఢార్థములను వెల్లడిచేయుట.

3. పూర్వపుశాస్త్రములలోగల కొన్ని పోలికసంబంధములను బట్టి యూహించి నూతనసిద్ధాంతముల నేర్పర్చుట.

ఇవియునుగాక పూర్వపుధర్మశాస్త్రములలో కేవలము యసందర్భము యన్యాయమని తోచినవిషయములను రద్దుచేసి దానిస్థానములో ప్రస్తుతప్రజనసంఘములో న్యాయమని యెన్నబడు రీతిని సవరణచేయుటకూడా గలదు. ఇందుకు యుదాహరణమేమన పూర్వపున్యాయశాస్త్రప్రకారం యొకడు మరియొకనికి బాకీపడి తీర్చకుండా చనిపోయినయెడల యటుల చనిపోయినవానికి యాస్తియుండినను లేకపోయినను వానియాస్తి వానిసంతతివానికి చెందినను చెందకపోయినను యాబాకీతీర్చుబాధ్యత వానిమూడుతరములవారిపై యుండెను. దీనికి కారణమేమన వకరికి రుణపడి గతించినవాడు జీవించియుండగా చేసిన పుణ్యాను యావత్తు రుణదాతకు చెందుననియు వాడు రుణదాతయింటిలో యొకబానిసగానో లేక పశువుగానో జన్మించుననియు గనుక వానిని రుణవిముక్తునిచేసి వానికి పుణ్యలోకమును గలిగించుబాధ్యత వానిసంతతివారిపై యుండుననియు శాస్త్రముకలదు. ఇప్పుడు యట్టిశాస్త్రము నిరపరాధులగు సంతతివారికి హాని కలుగజేయుననియెంచి ఋణముచేసినవానితాలూకుయాస్తి వానిసంతతివారికి చెందిననే సదరాస్తి సరిపోవునంతవరకు వానిఋణములు తీర్పవలసియుండునని సవరణచేయబడెను. న్యాయాధిపతుల తీర్మానములవలన పూర్వపుధర్మశాస్త్రమునందు గలిగిన యిట్టిసవరణలు యనేకములు గలవు.



## హిందూన్యాయశాస్త్రము—అమలు.

హిందూన్యాయశాస్త్రస్వరూప మిట్టిదో తెలుసుకొంటిమి. దానియమలు యెంతవరకు చెలాయించుచున్నదో తెలుసుకొనవలసియున్నది.

హిందూన్యాయశాస్త్ర మనునది బ్రిటిషుసామ్రాజ్యమునకు చెందియున్న హిందూదేశములోగల (British India) హిందువులకును దానిని చిరకాలమునుండి కులాచారముగా యాచరించెడి మరియితరులకును వర్తించును. అయితే ముందుచెప్పబోయెడు యీహిందూన్యాయ శాస్త్రసూత్రముల వలనగాని యితరచట్టముల వలనగాని యాచారముల వలనగాని యిది యితరులకును వర్తించవచ్చును. హిందువులు యనుపదమువలన హిందూమతస్థులేగాక సాధారణముగా హిందువులనివాడబడువారనిగూడా గ్రహించవలసియుండును. అనగా యిప్పటివరకును శాస్త్రయుక్తముగా హిందూమతము నాచరించువారును యటులనాచరించకపోయినను హిందువులనిపించుకొనువారును హిందూమతమునుండి కొన్నియితరమతములలో జేరి హిందూమతమును విడిచినను హిందూన్యాయశాస్త్ర మనే యాచరించువారునుగూడ యీసం

దర్భములో హిందువులుగా గణింపవచ్చునని యర్థము. ఇంగ్లాండు మొదలగు పశ్చిమదేశస్థుల సాంగత్యమువలనగాని వారివిద్య నభ్యసించి వారియాచారముల కలవాటుబడుటవలనగాని హిందూమతానుసారముగా యొకప్పుడు నడువలేకపోయినను క్రీస్తుమతములో గలియక హిందువులకు యుండవలసిన పెండ్లి పద్ధతులు యలవాటులు మొదలగుకొన్నిలక్షణములు గలిగి హిందువులుగా వాడబడువారికిగూడ హిందూన్యాయశాస్త్రము వర్తించునని యభిప్రాయము.

### కులము చెడినహిందువులు.

### Out caste Hindus.

హిందూమతస్థునకు ముఖ్యమయిన యానవాలు కులముగనుక కులము చెడినవానికి కుటుంబాస్తియందు హక్కునశించునని పురాతన శాస్త్రములవలన తెలియవచ్చుచున్నది. గాని సర్కారువారు 1850 సంవత్సరములో నె 21 రున కులముకుసంబంధించిన ప్రతిబంధకములను పోగొట్టుచట్టమును Cas e disalieitas removal act xxI of 1850 యనులోనికి తెచ్చిరి. అందువలన పూర్వశాస్త్రములవలన గలిగెడు ప్రతిబంధకములను రద్దుచేయబడెను. అనగా కులము చెడినవానికి యాస్తులయందు హక్కులు నశించవనియు కులముచెడినంతమాత్రమున చట్టమునకు సంబంధించినంతవరకు హిందువులు కాకపోరనియు స్పష్టమగుచున్నది.

### దాశీపుత్రులు.

### Illigitimate Children

పరస్త్రీ పురుషసాంగత్యమువలన గలిగెడిసంతతివారును హిందువులేగాన వారికిహిందూన్యాయశాస్త్రము వర్తించును. 18 క. 264 అటులనే తలిదండ్రులలో యొకరుహిందువు,యొకరు యన్యమతస్థులుగాయుండినను యట్టివారిసాంగత్యమువలన గలుగుసంతతివారు హిందూ



మతానుసారముగా పెంచబడి హిందువులుగా గణింపబడినయెడల వారికిగూడ హిందూన్యాయశాస్త్రము వర్తించును. మయినాబాయి ఎదిరి ఉటారాం 8 మూ. ఇ. అ 400. (420) లింగప్ప ఎదిరి పేసుదా సర 27. మ. 13. క్రైస్తవమతముపుచ్చుకొని హిందూమతమును వదలిన హిందువునకు హిందూలాప్రకారం తనకుహక్కులు నశించనేరవుగాని క్రయిస్తవమతమునకు విరుద్ధమయిన హక్కులుమాత్రము నశించును అనగాయొకహిందువు క్రీస్తుమతములోకలసినను తనక్రొత్త మతమునకు విరుద్ధముగాని హిందూన్యాయశాస్త్ర నిబంధనలకు లోబడినహక్కుబాధ్యతలనుబొందుటకు యర్హుడైయుండును. అబ్రహాంఎదిరి అబ్రహాం 9మూ. ఇ. అ. 196 (239—240 & 241) వీనినిబట్టి తేలిన యంశములు యేమన (1) శాస్త్రోక్తమయిన యాచారముల నాచరించు హిందువులకుమాత్రమేగాక యట్టియాచారములను విడిచినను వయికి కొన్ని హిందూపద్ధతులనుమాత్రము యవలంబించుచు హిందువులుగా నెన్నబడువారికిగూడ హిందూన్యాయశాస్త్రము వర్తించును (2) హిందూమతమునుండి మహమ్మదీయమతము క్రీస్తుమతము మొదలగుమతములలో కలయువారుగూడ వారు యవలంబించిన క్రొత్తమతమునకు విరుద్ధముగా నుండనంతవఱకు పూర్వపుచట్టములు, యాచారములు పద్ధతులనే నిలుపుకొనవచ్చును. అనగా తాము యవలంబించిన మతము క్రొత్తదియైనను దానికి విరుద్ధముగాయుండని పూర్వపుచట్టములను పద్ధతులను యాచరించుచుండవచ్చును. (3) ఎవరయిన మతసంబంధమయినశాస్త్రమునకు కొంచెమువిరుద్ధముగా నడచినంతమాత్రమున కేవలము హిందూన్యాయశాస్త్రము విసర్జించినట్లు యెంచగూడదు. బ్రహ్మమతము అనగా శ్రీరాజా రామమోహనరాయిగారిచే స్థాపింపబడిన మతము. దీనిప్రకారము కులవిచక్షణలేకుండా విగ్రహారాధన విసర్జించి దేవుడుయొకడేయని నమ్మినమతము. ఈమతము నవలంబిం

చినంతమాత్రమున హిందూమతమును గోల్పోరు యని ప్రీవీకవున్సిలు వారిచే తీర్మానింపబడెను. 31. క. 11. ప్రి. కౌ. ఆర్యసమాజమతము ప్రార్థనసమాజము మొదలగు హిందూమతసంస్కరణమతముల నవలంబించువారు హిందువులనుగానే గ్రహించవలెను.

హిందూమతమును యంగీకరించని జైనమతస్తులుకూడా హిందువులనియు వారికిగూడ హిందూన్యాయశాస్త్రము వర్తించుననియు తీర్మానింపబడెను. 1 అ. 688 ప్రి. కౌ. ఇటులనే పంజాబుదేశములోని సిక్కుమతస్థులు బెంగాలుదేశములోని కాయస్తులు బొంబాయి—మదరాసుప్రాంతములలోని లింగాయతులు హిందూమతమునకు భిన్నాభిప్రాయులయినను వారు హిందువులుగా నెంచబడి వారికి హిందూన్యాయశాస్త్రము వర్తించుచున్నది. ఆదిలో హిందువులుగాయుండి యిప్పుడుమహమ్మదీయుల మతములోకలిసినను వారసత్వమువిషయములో మాత్రము హిందూన్యాయశాస్త్రమునే యాచరించు తెగలుయనేకములుగలవు అందులో ఖోజాలు, కచ్చిమెమనులు, సున్నిబోరాలు, కొంతమంది దూదేకులవారు మొదలగువారిని యుదాహరణములుగా నెన్నవచ్చును అయితే మహమ్మదీయమతములో కలిసిన హిందువులవలె క్రీస్తుమతములోకలిసిన హిందువులు వారసత్వమువిషయములో గాని వివాహమువిషయములోగాని తమయిష్టమువచ్చినట్లు హిందూన్యాయశాస్త్రమును యాచరించుటకు వీలులేదు. ఏలయన 1865 సంవత్సరపు 10 ఆక్టుప్రకారం క్రీస్తుమతస్తులకు వారసత్వపుక్రమము వేరే యేర్పడినందున అందులకు వారుబద్ధులైయుండవలెను. హిందూమతమునుండి యితరమతములలోకలసినవారివలె యితరమతములనుండి హిందూమతములో కలియుటకు హిందూమతము యొప్పుకొనదు. గాని చిరకాలమునుండి హిందూమతమునవలంబించి హిందూమతా-



చారములకనుగుణ్యముగా సంచరించు యితరమతస్తులు క్రమక్రమముగా హిందూమతములో చేర్చుకొనబడి హిందువులుగా నెన్నబడువారికి గూడ హిందూన్యాయశాస్త్రము వర్తించుచున్నది.

### విదేశగమనము. న్యాయశాస్త్రము.

హిందూన్యాయశాస్త్రము యమలుజరుపుటలో యేమనుజునికి తరతరములనుండి వాని కుటుంబములో యెట్టిన్యాయమువర్తించుచున్నదో దానిప్రకారమే యమలుజరపవలెనుగాని యామనుజుడు ప్రస్తుతము కాపురమున్నదేశములో వర్తించున్యాయమును వర్తింపజేయగూడదు. ఆమనుజుడు యేదేశములో యున్నను యాదినుండి వాని కుటుంబమునకు వర్తించున్యాయమేవర్తించునని భావము. అనగా స్వదేశమువదలి విదేశగమనముచేసి యచటస్థిరపడినవారికి గూడ విదేశాగమనమునకు పూర్వమువారికి స్వదేశమందు వర్తించెడిన్యాయములే వర్తించునని యర్థము. ఏదయినయొక కుటుంబమునకుసంబంధించినంతవరకు స్వదేశమనగా యాదిలో వారిపూర్వులు నివసించెడి దేశమనియు దానిని నిరూపణము చేయుటలో వారికి ఇప్పటికినిగలజాతి, కులము భాష మొదలగువానిని ముఖ్యమయినసంబంధ చిహ్నములుగా గైకొనవచ్చుననియు నెరుంగవలయును. విదేశములో స్థిరపడిన కుటుంబములు వారివారి స్వదేశాచారములనుమాని జననవైవాహిక, మృతసంబంధములయిన కర్మలను చేయుటలో విదేశాచారములనవలంబించి విదేశీయులతో వివాహసంబంధములను జేయుచు సర్వవిధములావిదేశీయులతోకలసి యాదేశములకు వర్తించున్యాయశాస్త్రమునే నవలంబించి చిరకాలమునగా కొన్నితరములటులాచరించుచుండిననేవారు స్వదేశధర్మములను విడనాడి విదేశధర్మములను గైకొనినవారగుదురు గాని యంతవరకు వారికి స్వదేశధర్మములే వర్తించునటులయెంచవలసియుండును. ఇదివరలో హిందూన్యాయశాస్త్రమునకు మూలాధారము

లను శ్రుతులు స్మృతులు, వ్యాఖ్యానములు మొదలగువానివిషయమై చర్చించియుంటిమి. అందులో ప్రస్తుతము న్యాయశాస్త్రప్రమాణములుగా నెంచబడువానిని గూడ సూచించియుంటిమి. ఇప్పుడే దేశములో జనులు యెట్టి ప్రమాణములకు ప్రాముఖ్యత నిచ్చి కేవలము వారుధర్మశాస్త్రములుగా గైకొనుచున్నారో యీదిగువజాబితావలన స్పష్టము కాగలదు.

| దేశములు. | న్యాయశాస్త్రప్రమాణములు. |
|---|---|
| 1. చెన్నపురి రాజధాని | మితాక్షరము ముఖ్యము అయితే అది స్మృతిచంద్రిక—పరాశర మాధవీయము, వీరమిత్రోదయముల చే సవరణచేయబడి వాడబడుచున్నది. |
| 2. బంగాళా దేశము. | దాయభాగము ముఖ్యము అందులో స్పష్టముగా లేని యంశములలో మితాక్షరము లోటులను భర్తీ చేయుటకు వాడబడుచున్నది. |
| 3. ఆసాం దేశము | డిటో |
| 4 సంయుక్త రాష్ట్రము | మితాక్షరము. |
| 5. మధ్యపరగణాలు | డిటో |
| 6 మిథిల దేశము | మితాక్షరము. అందులో స్పష్టముగా లేనియంశములలో వివాదచింతామణి, వివాద రత్నాకరము లోటులను భర్తీ చేయుచున్నవి. |
| 7. పంజాబు దేశము. | చిరకాలము తరతరములనుండి యాచరింపబడుచుండిన యాచారములు ప్రధానములు యట్టివి లేని చోటులయందు మితాక్షరము ప్రధానమైయున్నది. |
| 8. బొంబాయి రాజధాని బీరారు-గుజరాతి మొదలగు పశ్చిమదేశతీరములు. | మయూఖములోని సవరణల ప్రకారం మితాక్షరము వాడబడుచున్నది. |



ఈజాబితాను బట్టి యాయాదేశములలో యాయాతరగతి ధర్మశాస్త్రములను ప్రమాణములుగా ప్రతిమనుజుడును గైకొనుట విధి యని యర్థముగాదు. ఏలయన హిందూన్యాయశాస్త్రము మనుష్యులకు సంబంధించినదిగాని దేశమునకు సంబంధించినది కాదు. అయినను దీనివలన యాయాప్రాంతములలో యెన్నోతరములనుండి నివసించుచు యాసరిహద్దులలో స్వదేశీయు లనుపించుకొనువారు వాడెడి ధర్మశాస్త్రప్రమాణములని యర్థము. పయిజాబితాలో యాయాదేశములలో ముఖ్యముగా వాడబడెడి ప్రమాణగ్రంథములుమాత్రము పేర్కొనబడెనుగాని యేదయిన యొకవిషయము యీగ్రంథములవలన స్పష్టపడనపుడు యితరగ్రంథములుకూడ కొంతవరకు ప్రమాణములుగా గైకొనబడుచున్నయవి.

ఉదాహరణములు. చెన్నపురిరాజధానిలో మితాక్షరము స్మృతిచంద్రిక వీరమిత్రోదయము పరాశరమాధవీయము తరువాత సుబోధిని సరస్వతీవిలాసము వ్యవహారనిర్ణయము వైద్యనాథదీక్షితీయముగూడ వాడబడుచున్నవి. బంగాళా ఆసాందేశములలో దాయభాగము తరువాత రఘునందనుని దాయతత్వము—శ్రీకృష్ణుని దాయక్రమ సంగ్రహము, దత్తచంద్రిక, దత్తమీమాంసముగూడ వాడబడుచున్నవి. సంయుక్తరాష్ట్రములు—మధ్యపరగణాలలో మితాక్షరము తరు

వాత వీరమిత్రోదయము సుబోధిని వైజయంతి వ్యవహారమాధవీయము కల్పతరు మొదలగు గ్రంథములు వాడబడుచున్నవి. మిథిలదేశములో మితాక్షరము, వివాదరత్నాకరము వివాదచింతామణి తరువాత వివాదచంద్రము కృత్యకల్పద్రుమము మదనపారిజాతము శ్రుతిసారము మొదలగునవి వాడబడుచున్నవి. గాని వీనిలో భిన్నాభిప్రాయములు వచ్చినప్పుడు మితాక్షరమే ప్రధానముగా వాడబడుచున్నది.

అటులనే మిగతాదేశములలో గూడ ప్రధానమయిన ప్రమాణగ్రంథముగా వాడబడునది యొకటుండి అందులోలేని విషయములలో యితరగ్రంథములు వాడబడుచున్నవి.

ప్రస్తుతము యీగ్రంథము యాంధ్రమునందుండుటవలన యాంధ్రదేశమునకే మాత్రమే యుపయోగించునుగాన యాప్రాంతములయందువర్తించు శాస్త్రమునకు మాత్రమెక్కువ ప్రాముఖ్యత యివ్వబడును.

---

# హిందూ న్యాయశాస్త్రము.

# వారసత్వము.

## రెండవ యధ్యాయము.

### వారసత్వపుపద్ధతులు—మొదటిభాగము.

### సమిష్టికుటుంబాస్తి సంక్రమణక్రమము.

వారసత్వమువిషయమై తెలియుటకు ముందుకొన్నిపదములకు యర్థము బాగుగా గ్రహించవలసియుండునుగాన వానిలోముఖ్యములయిన పదములను యర్థసహితముగా నిందువివరింపబడును.

### హిందూసమిష్టికుటుంబము.

### Joint Hindu Family

ఒకేమూలపురుషుని సంతతివారైయుండి సపిండబాంధవ్యముగలవారును దాయాదులును దత్తతస్వీకారమువలన కుటుంబములో చేర్పబడినవారును యట్టిపురుషులయొక్క తల్లులు, భార్యలు వితంతువులు వివాహముకాని కుమార్తెలునుకలసి యేకసముదాయముగా జీవించుచున్న హిందూకుటుంబము హిందూసమిష్టికుటుంబ మనబడును. దీనినిబట్టియే కారణముచేతనయినా యట్టికుటుంబమునుండి విడిపోయినవారు సమిష్టికుటుంబమువారు కానేరరు.

ఉదాహరణములు—ఒకకుటుంబమునుండి యితరకుటుంబమునకు దత్తతయయినపురుషులును వివాహమయిన స్త్రీలును జనకకుటుంబమునకు లనదగరు. అటులనేసదరు హిందూకుటుంబముతో గాని యాకుటుంబమునకుగల యాస్తితోగాని సంబంధమును విడనాడి లేక వదులుకొని వేరయియుండినవారును యాకుటుంబమునకు లుగా నెన్నబడెరు.

### హిందూసమిష్టి దాయాదికుటుంబము.

Hindu coparcenary దాయాదులు coparceners

సమిష్టికుటుంబమునకుగల యాస్తిని సమిష్టికుటుంబాస్తి యందు

రు. joint family property ఇట్టియాస్తియందు సమిష్టికుటుంబమెంబరులలో కొందరకుమాత్రమే పంచుకొనుహక్కు యుండవచ్చును. మిగతావారికి మనోవర్తిహక్కుమాత్రమే యుండవచ్చును. కుటుంబాస్తిని యనుభవించుటకును దానిని కుటుంబములోవారెవరునూ పాడుచేయకుండా యభ్యంతరముపెట్టి కాపాడుటకును దానిమీదరుణములు చేయుటకును యిష్టమువచ్చినప్పుడు పంచుకొనుటకును హక్కుగలిగిన హిందూసమిష్టికుటుంబమెంబరులుకలసిన యది హిందూదాయాది సమిష్టికుటుంబమనబడును. Hindu coparcenary అనగా నొక కుటుంబములో జీవించియున్న మూలపురుషుడు వాని అవిభక్తకుమారుడు మనుమడు మునిమనుమనివరకూ మూడుతరములు పురుషసంతతివారును యిట్టిమూలపురుషుని పూర్వులకు యిట్టిసంబంధముగల సమిష్టి దాయాదులును కలసినసమిష్టిదాయాదికుటుంబమగునని యర్థము.






ఈవంశవృక్షము దాఖలాపురుషులుగల సమిష్టికుటుంబమునకు కొంతయాస్తియున్నదనుకొందము సదరుకుటుంబములోని యందరూ జీవించియున్నయెడల వయిచయుదహరించినరీతిని కుటుంబాస్తియందు హక్కెవరికియుండును? కేశవునితర్వాత మూడుతరములువారివరకు యుండును. అనగా విష్ణు—మధుసూదన—దామోదరులవరకు యుండును గాని త్రివిక్రమునకును యతనిసంతతికిని వాసుదేవునికిని యిట్టిహక్కులుండవు. ఇట్టిస్థితిలో కేశవుడుమరణించిన సదరాస్తియందు త్రివిక్రమవాసుదేవులకే యిట్టిహక్కులు కలుగునుగాని వారిసంతానమునకు కలుగనేరవు. అప్పుడు నారాయణుడు గతించినయెడల వామన—శ్రీధరులకు కూడా హక్కులుండును. ఇట్టిస్థితిలోయనగా కేశవ, నారాయణులు గతించినతర్వాత కుటుంబాస్తిలో పాలుగొను హక్కుగలవారెవరు? మాధవుడు యతనికుమారుడు—మనుమడు మునిమనుమడును యనగా యతనితర్వాత మూడుతరములవరకుగల—పద్మనాభ, దామోదర, వాసుదేవులనే యతనిసంతతివారును గోవింద విష్ణు మధుసూధన, త్రివిక్రమ—వామన శ్రీధరులనే నారాయణ సంతతివారును యిట్టిహక్కులుగలవారగుదురుగాన వీరిలో నొకరి కొకరు దాయాదులగుదురు Coparcenars వీరలందరుకలసి దాయాదిసమిష్టికుటుంబమగును coparcenary గాని మాధవుని సంతతిలో పుండరీకాక్షుడును నారాయణుని సంతతిలో హృషీకేశవుడును యిట్టిహక్కుదారులు కానేరరుగనుక వారు యీకుటుంబములో నెవరికిని దాయాదులు Coparcenars కానేరరు. ఇపుడు మాధవుడు చనిపోయినయెడల పుండరీకాక్షుడును, గోవిందుడు చనిపోయినయెడల హృషీకేశుడును హక్కుదార్లగుదురుగనుక యపుడు దాయాదులగుదురు కాని మాధవుడు జీవించియుండగా పద్మనాభ దామోదర వాసుదేవులు గతించినతర్వాతమాధవుడు గతించినయెడల పుండరీకాక్షునకు కుటుం

బాస్తియందు హక్కులుగలుగనేరవు. అటులనే గోవిందుడు జీవించియుండగా మధుసూదన,త్రివిక్రమ వామనులు గతించి తర్వాత గోవిందుడు గతించినయెడల హృషీకేశునకు యట్టిహక్కులు గలుగనేరవు అప్పుడు పుండరీకాక్ష హృషీకేశులు శాస్త్రప్రకారము దాయాదులు Coparcenars కానేరరు. దీనినిబట్టి శాస్త్రప్రకారము దాయాది Coparcener యనుపదమునకు సమిష్టికుటుంబాస్తిని పొందియున్న మూలపురుషునికిగాని యందులోని వాటాకు హక్కుగలిగియుండిన పురుషునికిగాని మూడుతరములువరకూగల పురుషసంతానములోని వాడని యర్థము.

### పితురార్జితము.

### Ancestral property

ఒకనిపితురార్జితమనగా యతనితండ్రినుండిగాని తాత (తండ్రి తండ్రి) నుండిగాని ముత్తాత (తండ్రి తండ్రి తండ్రి) నుండిగాని వారసత్వాదఖలు పడిన యాస్తియును యట్టియాస్థివలన సంపాదింపబడిన యాస్తియును యనియర్థము. దీనినిబట్టి సమిష్టికుటుంబముగా నుండక వ్యష్టియయిన పినతండ్రులు మొదలగు దాయాదులనుండి వారసత్వాదఖలుపడిన యాస్థిపితురార్జితము కానేరదు. తండ్రి, తాత, ముత్తాతగాక యంతకుపైపురుషులనుండి సంక్రమించినయాస్తియును పితురార్జితము కానేరదు. అయితే యిటులయితరదాయాదులు వగైరాల నుండి వారసత్వా పొందినవారు వారియిష్టప్రకారము యట్టియాస్తిని వినియోగపఱచుకొనక మృతులయ్యేనేని వారిసంతతివారికి మూడు తరములవరకూ యదిపితురార్జితమగును. పితురార్జితమెప్పుడగునో యప్పుడే యట్టియాస్తిని స్వేచ్ఛగావినియోగించగల శక్తికి కొన్ని యభ్యంతరములుగలుగును. మాతామహుని (తల్లితండ్రి) నుండి వారసత్వా సంక్రమించినయాస్తి దౌహిత్రునికి పితురార్జితమగునని



మద్రాసుహైకోర్టునుండి ప్రీవీకౌన్సిలువారికి యప్పీలుకాబడినకేసులో తీర్మానింపబడెను. 25 మ. 678 క్రి. కా. 27 మ. 382. 1915 మ. వీ. నో. 838.

సమిష్టికుటుంబములో నొకరుగతించుటవలన మిగిలినవారికి సంక్రమించుయాస్తిగూడ పితురార్జితమగును, తండ్రి, తాత, ముత్తాత నుండి వారసత్వాగాక దానపట్టావలనగాని మరణశాసనమువలనగాని సంక్రమించినయాస్తి స్వార్జితముగా నుపయోగపర్చుకొనవచ్చుననే యుద్దేశమును యిచ్చినవారుస్పష్టముగా సదరుదస్తావేజులో కనుపరిచిననేతప్ప యదియును పితురార్జితమగునని మదరాసుహైకోర్టువారియభిప్రాయము. 24 మ. 429

మితాక్షరశాస్త్రముప్రకారము తల్లినుండి వారసత్వాసంక్రమించినయాస్తిగూడ పితురార్జితమగునని (యనగా యామెకొమారునితోపాటు కొమారుని కొమారునికి హక్కులుసంక్రమించునని) యున్నది (మితాక్షర మొదటియధ్యాయము.)

### సమిష్టికుటుంబాస్తి.

### JOINT FAMILY PROPERTY.

ఈదిగువ నుదహరించినవానిలో నేదైనను కావచ్చును.

1. సమిష్టికుటుంబమెంబర్లకు తమపయిన తండ్రి, తాత ముత్తాతలగు పురుషులరీత్యా మూడుతరములవారినుండి వారసత్వాదఖలు పడిన పితురార్జితము లేక పూర్వార్జితపుయాస్తి.

2. అట్టి సమిష్టిపితురార్జితపుయాస్తివలనగాని దానియాధారమువలనగాని సంపాదింపబడినయాస్తి.

3. సమిష్టికుటుంబమెంబరులు సమిష్టిగా సంపాదించినయాస్తి.

4. సమిష్టికుటుంబమెంబరులు వేరువేరుగా సంపాదించినను యటుల సంపాదించినయాస్తిని వారు కుటుంబాస్తినివృద్ధిచేయుతలంపుతో దానిని జేర్చినయెడల యదియును సమిష్టికుటుంబాస్తియగును.

## స్వార్జిత ఆస్తి.

### Self-acquired property.

ఈదిగువ నుదహరించినవానిలో యేదైనను కావచ్చును.

1. వంశములో తండ్రి—తాత—ముత్తాతలకు పయివారు యనగా యేకవంశక్రమమున మూడుతరములకు పైమూలపురుషునుండి వారసత్వేనా సంక్రమించిన యాస్తియును తనయొక్కయు తన తండ్రి, తాత, ముత్తాత మొదలుగాగల తనపూర్వులయొక్కయు యన్నదమ్ములు వారిసంతతివారగు దాయాదులనుండియు వారసత్వేనా సంక్రమించినయాస్తియు దూరజ్ఞాతులనుండియు తనకుటుంబములోని స్త్రీలు వారిరీత్యా కలిగినబంధువులనుండియు వారసత్వేనాపొందిన యాస్తియును యిటుల పొందినవారి స్వార్జితమగును. కాని యొక సమిష్టికుటుంబమెంబరును తనతల్లివలన గాని, మాతామహునివలనగాని వారసత్వేనా సంక్రమించినయాస్తి తనకును తనపురుషసంతానమునకును సంబంధించినంతవరకుమాత్రము స్వార్జితము కానేరదు.

2. దానపట్టా లేక మరణశాసనముపూర్వకముగా దఖలుపడినయాస్తి స్వార్జితమగును. కాని, కొన్నిసంగతిసందర్భములలో యటుల కాకపోవచ్చును. ఎటులన దస్తావేజు కుటుంబములో యొకరిపేరయున్నను యది కుటుంబముతరపున యొకరిపేర వ్రాయబడినది కావచ్చును. అది యిచ్చినవారియొక్కయు పుచ్చుకొనినవారియొక్కయు యుద్దేశమును పట్టియుండును. అట్టియుద్దేశ మాయాసందర్భములనుబట్టి గ్రహించవలసి యుండును. కుటుంబయజమాని యగు తండ్రి, తాత మొదలగువారెవరైనను సమిష్టికుటుంబమెంబర్లకు యేదయినయాస్తి యిచ్చినయెడల దానిని వారిస్వార్జితముగా నుపయోగించుకొనవచ్చుననేయంశము దస్తావేజువలన స్పష్టమైననేతప్ప యట్టియాస్తి పితురార్జితముగా భావింపబడును. 28 మ. 353—369.



3. ఒకరొక సమిష్టికుటుంబ మెంబరయ్యును ప్రత్యేకముపాటుపడి తనకుగల ధైర్యసాహసములవలనగాని నేర్పరితనమువలనగాని విద్యవలనగాని యితరులను సంతోషపరచి వారివలన బహుమానముగా బడసినయాస్తిని వేరుగానుంచుకొని తనస్వార్జితముగా యనుభవించవచ్చును. ఇటులనే తనభార్యవలనగాని యత్తవారు మొదలుగాగల భార్యయొక్క బంధువులనుండిగాని పొందిన వివాహకట్నములు బహుమానములు మొదలగు తదితరాస్తులు స్వార్జితముగా యనుభవించవచ్చును గాని సంపాదకుడు యట్టిఆస్తులను వేరుపరచి స్వార్జితముగా యనుభవించక కుటుంబరాశిని జేర్చునుద్దేశముతో కుటుంబాస్తులలో కలిపి యుమ్మడిగా చిరాకాలము యనుభవించినను కొంతకాలము యుమ్మడిగా యనుభవించినతర్వాత మరణించినను యట్టియాస్తిని స్వార్జితమనుటకు వీలుయుండదు. ఒకయాస్తి స్వార్జితమా, పితురార్జితమా యని నిర్ణయించుటకు సాధనమేమన దానిని సంపాదించుటకు సమిష్టిద్రవ్యమునుండి వ్రయముగాని సమిష్టికుటుంబమెంబరుల సమిష్టిప్రయాసముగాని కలిగినదా? యని ప్రశ్నించిన గలిగినదని జవాబువచ్చిన పితురార్జితమనియు, లేదు యని జవాబువచ్చిన స్వార్జితమనియు యూహించవలయును.

ఉదాహరణములు :—

1. పితురార్జితమసలే పొందని యొకగవర్నమెంటుయుద్యోగి తనయుద్యోగమువలన సంపాదించిన యాస్తిని స్వార్జితముగా వినియోగించుకొనవచ్చును. 28 మ—386.

2. ఒకసమిష్టికుటుంబముయొక్క యాస్తిని మరియొకరాక్రమించుకొని చిరకాలము భుక్తపరచుకొనుటచే సదరుకుటుంబమునకు దానియందుగల హక్కులు నశించియుండగా యాకుటుంబమువారు

సదరాస్తిని రాబట్టుకొనుటకు యెట్టిప్రయత్నము చేయకుండా నిరాశ చేసుకొనియుండిన స్థితిలో యా కుటుంబమెంబర్లలో నొకరు మిగతా వారికందరికిని యావ్యవహారములోని నిజస్థితిని దెలిపి వారియనుమతి మీద కేవలము తనసామర్థ్యమును స్వంతద్రవ్యమును వినియోగించి పోయినయాస్తిని తిరిగి రాబట్టుకొని తాను స్వాధీనముచేసికొనినయెడల యది యతని స్వార్జితమగునని మెయిన్‌దొరగారు తమహిందూలాలో వక్కాణించిరి.

3. మనదేశమునేలు చక్రవర్తిగారి యనుగ్రహమువలన నీయబడిన యాస్తినిపొందువారికది స్వార్జితమగును. ఒకజమీందారుడు గవర్నమెంటువారిపై తిరుగుబాటుచేయుటచే వానికిగల జమీందారీ లాగుకొనబడి తిరిగీ దానిలో కొంతభాగము వానికిని మిగతాభాగము యాకుటుంబములో మరియొకరికిని నియ్యబడినయెడల దానినిపొందిన వారికది స్వార్జితమగును. 29 క. 828 ప్రి. కౌ. అటులనే వేలము రీత్యాగాని యపరాధముగాగాని గవర్నమెంటువారికి చెందిన యొకయెస్టేటును తిరిగీ పూర్వపుయజమానునియొక్క సంతతివారికి గవర్నమెంటువారివలన నీయబడినయెడల యటుల దానిని పొందినవారికది స్వార్జితమగును. 29 మ. 437–(443)

4 వివాహకాలమందు పెండ్లికొమరునకు నియ్యబడుబహుమానములు యతనిస్వార్జితమగును. 12 కం ఏ. నో. 103.

5. ఒకడు నౌకరీవలనవచ్చు తనజీతములోనుండి భీమాకంపెనీకి (Insurance company) వాయిదాలప్రకారము సొమ్ము చెల్లించుచుండుటవలన సదరుకంపెనీవలన పొందెడిసొమ్ము యతనిస్వార్జితమగును. 29 మ. 121.

6. ధనసంపాదనకు మూలాధారమగు వృత్తినినేర్పెడు శాస్త్రవిద్య నభ్యసించుటకు సమిష్టికుటుంబధనము వ్యయపడినయెడల యట్టి



శాస్త్రవిద్యవలన సంపాదించుయాస్తి సంపాదకునకు స్వార్జితము కానేరదు. కాని ప్రారంభవిద్య కుటుంబవ్యయముమీద నభ్యసించి శాస్త్రవిద్య యితరసహాయమువలన నభ్యసించినయెడల యందుపై సంపాదన కాడబడిన యాస్తి సంపాదకునికి స్వార్జితమగును. 6 బొం. 225-40 మ. ల. జ. 3 7 ప్రి కౌ.

ఇటులనే యొకయాస్తి స్వార్జితమా పితురార్జితమా యనుయంశము యూహించవలసియున్నను. వీనివిషయమై యింకను యనేకములయిన యుదాహరణములు తీర్పులు గలవు. కాని, యవి ప్రస్తుతయంశమునకు సంబంధించవుగాన సమిష్టికుటుంబము వ్యష్టియగువిషయమున యాపదములనుగురించి వివరముగా దెలుపవలసియుండుచు గాన యీసందర్భమున కిది చాలునని యింతటితో ముగించనైనది.

## సంతతి.

## ISSUE.

ఒకనిసంతతియనగా యతనికుమారునికిని, కుమారుని కుమారునికిని, కుమారుని కుమారుని కుమారునికిని, వర్తించును. అనగా యతనికుమారులు మనుమలు మునిమనుమలకును వర్తించునని యర్థము. ఇందు కుమారశబ్దము యౌరసునకును దత్తునకును వర్తించును.

ధర్మశాస్త్రప్రమాణములు వేరువేరుదేశములలో వేరువేరుగా వాడబడుచున్నవని యిదివరలో తెలుసుకొనియుంటిమి. ఆయాదేశములయందలి ప్రజలచే విధిగా గైకొనబడు ప్రమాణగ్రంధములలో ప్రాధాన్యమయిన ధర్మశాస్త్రనామములతో న్యాయశాస్త్రతరగతులు యేర్పడియున్నవి. అట్టివి హిందూదేశమంతటిలోనూ మితాక్షరము దాయభాగము మయూఖము యను మూడుముఖ్యమయిన తరగతులు గలవని చెప్పవచ్చును. ఇతరవిషయములలోవలె వారసత్వపువిషయములో గూడ యీమూడుతరగతులు భేదించును. వానిలోగల భేద

ములను సందర్భానుసారముగా తెలుసుకొనుటకు యచటచట సూచింపబడినను మనయాంధ్రులకు మితాక్షరము ప్రధానమయిన ధర్మశాస్త్రప్రమాణముగాన దానిననుసరించిన వారసత్వపుపద్ధతులుమాత్రమే యిచట ముఖ్యముగా వివరింపబడును.

ఆస్తి చెందువిధములు.

ఒకనియాస్తి మరియొకనికి మూడువిధములుగా జెందును.

1. క్రయము—దానము—మరణశాసనము మొదలగు పరివర్తనల (Transfers) వలన యొకడు తనయాస్తిని మరియొకరికి చెందజేయుటవలనను.

2. ఒకసమిష్టికుటుంబములో యెవరైన చనిపోయినయెడల యాకుటుంబమునకుంగల యాస్తిలో వానికిగలహక్కు మిగతా సమిష్టికుటుంబ మెంబర్లకు సంక్రమించు మితాక్షరన్యాయమువలనను (By Mitakshara Law of Survivorship)

3. ప్రత్యేకము స్వంతయాస్తిని గలిగినమనుజుడు తనజీవితకాలములో దానిని యేవిధముగాను యెవరికిని చెందజేయక మరణించినయెడల పరస్పరసంబంధములనుబట్టి మరియొకరికి వారసత్వేనా సంక్రమించుటవలనను (By the law of Inheritance) యొకరియాస్తి మరియొకరికి చెందుచున్నది. అయితే యిందులో మొదటితరగతిపరివర్తనలవిషయమై వేరుగా యాస్తి పరివర్తనలచట్టము (Transfer of property Act) క్రింద వేరుగ్రంథములలో చర్చించవలసియున్నది. గాన ప్రస్తుతము దానివిషయమై యిచట చర్చించ నవసరము లేదు. గనుక యిచట 2-3 తరగతుల విషయమైమాత్రము విమర్శన చేయబడును.



సమిష్టికుటుంబాస్తి సంక్రమించుక్రమము.

The doctrine of survivorship

సమిష్టికుటుంబదాయాదులలో నొకరు యాకుటుంబయాస్తియందు హక్కుకలిగి పురుషసంతతిలేకుండా చనిపోయినయెడల వాని హక్కు యాకుటుంబములో యతనివలెనే కుటుంబాస్తియందుహక్కు కలిగిన మిగిలినసమిష్టిదాయాదులకు సంక్రమించునుగాని మామూలు వారసత్వపుక్రమప్రకారము భార్యా కుమార్తె మొదలగు యతనివారసులకు చెందదు. అయితే యతనికి పురుషసంతతి యున్నయెడల ముందు వారికి యతనిహక్కులు సంక్రమించునుగాని సమిష్టిదాయాదులకు సంక్రమించవు—పురుషసంతతి యనగా కుమారులు, మనుమలు మునిమనుమలు యని యిదివరలో తెలుసుకొనియుంటిమిగాన మునిమనుమల కుమారులకు సదరాస్తి సంక్రమించనేరదని యూహించవలసియుండును అనగా మొదటివానికి కుమారుడు లేనియెడల కుమారుని కుమారునికి(మనుమనికి) యతడు లేనియెడల కుమారునికుమారునికుమారునికి(మునిమనుమనికి)సంక్రమించును. అతనిమరణకాలమునకు వీరిలో నెవరును లేక మునిమనుమని కుమారుడు యున్నను ప్రయోజనము లేదు. ఏలయన మూడుతరములుపైవానికి చనిపోయినవాని హక్కులుసంక్రమించనేరవుగనుక యట్టిస్థితిలోయనగా పురుషసంతతిలేనప్పుడు వాని హక్కులు మిగిలినసమిష్టికుటుంబదాయాదుల హక్కులలో కలిసిపోవును అప్పుడుమిగిలినసమిష్టిదాయాదులు కుటుంబాస్తినిపంచుకొనవలయునన్న చనిపోయినవానిహక్కులను తలపెట్టవలసినయవసరమెంతమాత్రమును యుండదు. అతను యాకుటుంబములో నసలేపుట్టనటుల భావించి మిగిలినవారు యప్పటికిగల యావత్తుకుటుంబాస్తిని పంచుకొనవచ్చును ఈవిషయములో సమిష్టికుటుంబాస్తి యాకుటుంబమెంబర్లకు సంక్రమించువిధమునకు Law of Survivorship న్నూ, మామూలువారసత్వపు

పద్ధతికి Law of Inheritance ని, పురుషసంతతికి ముందు చెందవల యుననే యంశములో తప్ప మరియే యంశములోనూ యెంతమాత్రము పోలికయే లేదు. మామూలు వారసత్వము విషయములో చనిపోవు వానికి గల యాస్తికి హద్దు పరిమితి మొదలగు నిర్దిష్టమయిన గురుతు లుండును. సమిష్టికుటుంబ మెంబర్లలో కొందఱకు మాత్రము యీకు టుంబాస్తి యందు కొన్ని హక్కులే యుండును కాని ఫలానా యాస్తి యని గాని యందులో యింత యాస్తి యని గాని తనదని నిర్దిష్టముగా జెప్పుటకు యందులో యెవరికిని యవకాశము లేదు. సమిష్టికుటుంబాస్తి యందు యీకుటుంబ మెంబర్లలో నెవరికి యెట్టి హక్కు లుండునో యిదివరలో సమిష్టికుటుంబము సమిష్టికుటుంబాస్తి మొదలగు పదముల యర్థములను విమర్శన చేయుటలో తెలుసుకొని యుంటిమి. సమిష్టికుటుంబాస్తిని యీకుటుంబ మెంబర్లు పంచుకొనునపుడు యెవరికి యెంత వాటా యందు హక్కు లుండునో తెలియును. ఈవాటా హక్కు యనునది సమిష్టిగా యున్నంత కాలము హెచ్చును తగ్గును యుండును. అట్టి వాటా హక్కు యొక్క క్షయవృద్ధులు క్రమముగా కుటుంబము యొక్క వృద్ధిక్షయముల ననుసరించి యుండును. అందువలన యెప్పటి కప్పుడు యానిమిషమున పంపకము వున్నని యెంచిననే యానిమిషమున యింత వాటా యందు యొక మెంబరుకు హక్కు యుండునని చెప్ప వచ్చును. అంతవరకూ యీకుటుంబాస్తిని చక్కజేసి వ్యవహరించు టకును దానినెవరును పాడుచేయకుండా కాపాడుటకును మాత్రము హక్కులుంచవచ్చునే గాని యందులో యేమాత్రమయినను తనస్వంత యాస్తి వలె తనయిష్టము వచ్చినటుల వినియోగించుకొనుటకు వీలు యుండదు. ఎందుచేతననగా సమిష్టికుటుంబాస్తిలో ప్రతిరేణువునందును ప్రతిసమిష్టిదాయాదునికి హక్కులుండును. అట్టిస్థితిలో యొకదా యాది సమిష్టికుటుంబాస్తిలో యేభాగము తనదని తనయిష్టము వచ్చి



నటుల వినియోగించుకొనగలడు? అనగా కుటుంబము సమిష్టిగా యున్నంత కాలము యీకుటుంబమునకు గల యావదాస్తి కుటుంబము యొక్క సముదాయపు యాస్తి గాని యీకుటుంబములో ప్రత్యేకము యెవరిదిని కాదు. గాని సమిష్టిదాయాదులకు Coparceners పుట్టుకతోనే సద రాస్తిని యిష్టము వచ్చినప్పుడు పంచుకొనుటకు మాత్రము హక్కులు జనియించును. అట్లు పంచుకొను హక్కు సమిష్టిదాయాదులకును Coparceners వారి ప్రతినిధులకును representatives మాత్రము యుండును ఇచట యొకదాయాది యొక్క ప్రతినిధులనగా యాదా యాదికి బదులుగా యుండి కుటుంబవ్యవహారములు చక్కబెట్టుచు ప్రత్యేకము యతని వంశమును నిలువబెట్టువారు యనగా కుమారులు కుమారుల కుమారులు (మనుమలు) కుమారుల కుమారుల కుమారులు (మునిమనుమలు) యని భావము యనగా అతని పురుషసంతతి యని యర్థము పురుషసంతతికి తప్ప మరియెవరికిని తండ్రితో పంచుకొను సహజ హక్కులుండవు గాన సమిష్టికుటుంబాస్తిని సమిష్టిదాయాదులతో పంచు కొనుటకు తండ్రికి గల హక్కును యతని స్థానే యతని పురుషసం తతికి తప్ప మరియెవరికిని యుండదు. సమిష్టిదాయాదులకు సమిష్టి కుటుంబాస్తిని యిష్టము వచ్చినప్పుడు పంచుకొనుటకు మాత్రమే హక్కులుండును గనుకను, యట్టి హక్కులు లేని మరియెవరికిని దాని యందు యట్టి హక్కులు యుండవు గనుకను, పురుషసంతతి లేకుండా చని పోయిన సమిష్టిదాయాది యొక్క హక్కులు నశించుటచే మిగిలిన దాయాదుల హక్కులు హెచ్చును గనుక వారికి సంక్రమించునని చెప్పవలసి వచ్చును. ఇదియే సమిష్టి యాస్తి మిగిలిన దాయాదులకు సంక్రమించు ననుమితాక్షర న్యాయము The doctrine of survivorship దీని విషయములో ముఖ్యముగా యీ యంశములు గమనించవలయును.

## మొదటిది కుటుంబప్రాతినిధ్యత్వమను న్యాయము.

### The Doctrine of representation

ఒకకుటుంబములో యనేక యంతర్భాగములు లేక శాఖాకుటుంబము లుండవచ్చును. అనగా మూలపురుషుని యొకడేయైనను యతనినిబట్టి యేకకుటుంబమనిపించుకొనినను యతనికుమారులు మనుమలు మొదలగువారినిబట్టి చూచిన వారివారి శాఖాకుటుంబములెన్నియో కలసి మొత్తముమీద పెద్దకుటుంబమొకటి యగును. కనుక యాకుటుంబములో నెవరయిన చనిపోయినయెడల యతనిహక్కులు యతని పురుషసంతతివారికి మూడుతరములవరకును క్రమముగా సంక్రమించును.

ఉదాహరణము — కేశవుడను వానికి నారాయణ, మాధవ, గోవింద, విష్ణు యను నలుగురు కొమరులుగలరు.




కేశవుడు కాలముచేయునరికి వానికుమారులు నలుగురిలో నారాయణుడుమాత్రము జీవించియుండెను. మిగిలినముగ్గురు కుమారులు పోయిరిగాని మాధవునకు మధుసూధనుడను కుమారుడును, గోవిందునకు త్రివిక్రముడను మనుమడును, విష్ణునకు వామనుడను మునిమనుమడును మాత్రము జీవించియుండిరి. ఇట్టిస్థితిలో కేశవునకు వామనుడు మూడుతరముల వయివాడు గావున కేశవునిహక్కులు వామనునకు సంక్రమించవుగాని యవి నారాయణ, మధుసూధన, త్రివిక్రములకు సమముగా మూడువాటాలను సంక్రమించును. ఇట్లు సంక్రమించుపద్ధతికి కుటుంబప్రాతినిధ్యత్వమను న్యాయమని ( Doctrine of Represen tation) పేరు. దీనినిబట్టి కుటుంబములోని ప్రతిశాఖలోను మూడుతరములలోపువారు క్రమముగా యాయాశాఖల మూలపురుషులకు ప్రత్యామ్నాయప్రతినిధిగాయుండి వారిస్థానే యాయాశాఖలవారి హక్కులను నిలువబెట్టి కాపాడెదరుగాన యీన్యాయమునకు యీపేరు వచ్చెను.

### కుటుంబజనసంఖ్యాసంబంధమైన సంక్రమణన్యాయము.

### PFR CAPITA

### కుటుంబశాఖాసంఖ్యాసంబంధమైన సంక్రమణన్యాయము

### PER STIRPES

పైనయుదహరించిన కేశవుడు మరణించుకాలమునకు యతని కుమారులందరు గతించిరనుకొందము. అప్పటికి యతనికుమారులగు నారాయణునకు యొకకుమారుడును, మాధవునకు యిరువురు కుమారులును, గోవిందునకు ముగ్గురుకుమారులును, విష్ణునకు నలుగురు కుమారులును యుండిరనుకొందము. అట్టిస్థితిలో కుటుంబాస్తియందు కేశవునకుగల హక్కులు యతనిపదిమంది మనుమలకు సమానముగా సంక్రమించునా? లేనియెడల వారికి యెటుల సంక్రమించును? ఇట్టిస్థితిలో కేశవునియాస్తి వారికి సమానముగా సంక్రమించదు. కేశవుని హక్కులు నాలుగు సమవాటాలు చేయబడి యొకవాటా నారాయణు

నికుమారునికిని, యొకవాటా మాధవుని యిద్దరుకొమారులకును, యొకవాటా గోవిందుని ముగ్గురుపుత్రులకును, యొకవాటా విష్ణుని నలుగురుకొమారులకును చెందును. వారితండ్రులు జీవించియుండిన నెటుల సంక్రమించునో యటులనే వారు మరణించినను వారికుమారులకు నాలుగు సమవాటాలను సంక్రమించును. కేశవుని కుటుంబము నలుగురికుమారులవలన నాలుగుశాఖలుగావీడి నాలుగు నూతనకుటుంబములుగా యేర్పడినవి. ఇటులనే తిరిగి యీనాలుగుకుటుంబములు యనేక కుటుంబములుగా మారవచ్చును. కుటుంబాస్తి యిట్టి శాఖాకుటుంబముల ననుసరించి సంక్రమించుచుండును. కేశవునికుటుంబాస్తి మొదటినాలుగుశాఖలవారికి నాలుగు సమవాటాలుగా సంక్రమించును. అటుపిమ్మట విష్ణునిశాఖకు సంక్రమించిన నాలుగోవంతువాటా తిరిగి యతని నలుగురికుమారులశాఖలకు నాలుగువాటాలుగా సంక్రమించును. అనగా విష్ణునికుమారులలో ప్రతివానికి యసలు కేశవునికుటుంబాస్తిలో పదహారవవంతు వచ్చును. ఇటులనే గోవిందుని ముగ్గురుకుమారులలో ప్రతివానికి పన్నెండవవంతు వాటాయును మాధవుని యిద్దరుకుమారులకు చెరియొక యెనిమిదవవంతు వాటాయును, నారాయణుని కుమారుని కొకరికి నాలుగోవంతు వాటాయును సంక్రమించును. పయిన యుదహరించిన కుటుంబములో కేశవుడు మరణించునరికి యతని నలుగురుకుమారులు జీవించియుండి యతనియాస్తి వారినలుగురికి సంక్రమించినప్పుడు మనిషికి యొకసమవాటా వచ్చును గనుక యిటుల సంక్రమించు పద్ధతిని కుటుంబజనసంఖ్యా సంబంధమయిన సంక్రమణన్యాయమని (Percapita) పిలువవచ్చును. అట్లుగాక కేశవుడుండగా యతని నలుగురు కుమారులు గతించి కేశవుడు చనిపోవునరికి పైన



యుదహరించినరీతిగా నారాయణుని యొక్కకుమారుడును, మాధవుని యిద్దరుకుమారులును, గోవిందుని ముగ్గురుకుమారులును, విష్ణుని నలుగురుకుమారులును యున్నయెడల యతనియాస్తి యీమనుమలకు సంక్రమించునపుడు పయిన యుదహరించినరీతిని నాలుగుశాఖాకుటుంబములకు నాలుగుసమవాటాలుగా సంక్రమించును. కనుక యిటుల పదిమందిజనులుయుండగా జనసంఖ్యతో నిమిత్తములేకుండా శాఖాకుటుంబములసంఖ్యనుబట్టి సంక్రమించుచున్నదిగాన యిటులసంక్రమించు పద్ధతిని కుటుంబశాఖాసంఖ్యసంబంధమయిన సంక్రమణన్యాయమని Perstirpes పిలువవచ్చును. రెండవది సమిష్టికుటుంబములోని యాస్తిని పంచుకొనుటకు హక్కుకలిగిన యొకసమిష్టిదాయాది, పురుషసంతతి లేకుండా చనిపోయినయెడల యతనిహక్కులు యీకుటుంబములో యప్పటికిమిగిలిన దాయాదులందరకును మిగతాకుటుంబాస్తియందలి హక్కులతోపాటు సమముగా సంక్రమించునుగాని యతనిస్వంతవారసులకు సంక్రమించనేరవు. అతనిస్వంతవారసులనగా భార్యా, కుమార్తె కుమార్తెకుమారుడు, తల్లి మొదలగు స్త్రీవారసులేగాక యన్నదమ్ములు మొదలగు దగ్గరపురుషవారసులకు గూడా ప్రత్యేకము సంక్రమించవు.

ఉదాహరణము. ఒకసమిష్టిదాయాదికుటుంబములో కేశవ, నారాయణ, మాధవ, గోవిందయనువారలు నలుగురు సమిష్టిసోదరులుగలరు వారికి కొంతసమిష్టికుటుంబాస్తిగలదు. కేశవుడు ముందుగా కాలము చేసెను. అతనికిపురుషసంతతిగలదు తరువాత వరుసగా నారాయణ మాధవులు పురుషసంతతిలేకుండా కాలముచేసిరి. ఆటుపిమ్మట గోవిందుడు కాలముచేసెను. గోవిందునికి పురుషసంతతిగలదు. ఇట్టిస్థితిలో

సమిష్టికుటుంబాస్తి యెటుల సంక్రమించును? మామూలువారసత్వము క్రమప్రకారము పురుషసంతతిలేని నారాయణ మాధవుల హక్కులు దగ్గిరవారసులగు సోదరులలో మిగిలియున్న గోవిందునకు సంక్రమించవలసియుండును. కేశవుడు ముందు పోవుటవల్ల యతనిపురుషసంతతివారు గోవిందునికంటె దూరపువారసులగుటచే వారికిపితృస్వామ్యయాస్తి యెంతమాత్రము సంక్రమించకపోవును ఇప్పుడుయటులకాదు. ఇక్కడ కుటుంబము సమిష్టిగనుక పురుషసంతతిలేని నారాయణ మాధవుల దాయాదిహక్కులుగలసింది కుటుంబములో కలసిపోవునుగాని ప్రత్యేకము వారిదగ్గిర స్వంతవారసులకు చెందనేరవుగాని సమిష్టికుటుంబాస్తి సంక్రమణక్రమము Law of Survivorship ప్రకారము పురుషసంతతిలేక చనిపోయిన నారాయణ మాధవులదాయాదిహక్కులు యప్పటికి మిగిలియున్న సోదరునకును యనగా గోవిందునకునుయదివరలోనే చనిపోయిన మరియొకసోదరుని యనగా కేశవుని సంతతివారికిని సమభాగములుగా జెందును. దీనినిబట్టి మనమూహించవలసిన సాధారణ న్యాయమేమనగా యొకసమిష్టికుటుంబములో నెకరుపురుషసంతతిలేకుండా కాలముచేయుసరికి యతనికి జీవించియున్న కొంతమంది సోదరులును యదివరలోనే మృతిహొందినమరికొందరు సోదరులపురుషసంతతివారును యాకుటుంబములో మిగిలియుండగా యతనికిసమిష్టికుటుంబాస్తిలోగలదాయాదిహక్కులు Coparcenary rights మిగిలిన సోదరులకు జనసంఖ్యసంబంధమయిన సంక్రమణన్యాయప్రకారమును Percapita యప్పటికిగతించిన సోదరులయొక్క శాఖాకుటుంబముల సంఖ్యననుసరించి వారిసంతతివారికి శాఖాసంఖ్యాసంబంధమయిన సంక్రమణన్యాయప్రకారమును Perstirpes సమానవాటాలుగా సంక్రమించునని భావము 1 అ. 105.



మూడవది ఒకసమిష్టికుటుంబములోని యొకదాయాదికి యాసమిష్టికుటుంబముతోటూడ యాస్తియందు జాయింటుహక్కులుండుటయేగాక యతనికి వేరుగా స్వార్జితముబాపతులేక యితరస్వంతయాస్తియుండవచ్చును అట్టిస్థితిలో యతడుపురుషసంతతిలేక చనిపోయిన యెడల సమిష్టియాస్తియందు యతనికిగలహక్కులు పయిన యుదహరించినరీతిని సమిష్టికుటుంబాస్తిసంక్రమణక్రమము Law of survivorship ప్రకారము యాకుటుంబములో మిగిలినసమిష్టిదాయాదులకు సంక్రమించును. ఆతనిస్వంతయాస్తి మామూలువారసత్వపుక్రమము Law of inheritance ప్రకారము యతనిభార్యా కుమార్తెలు మొదలగు యతనిదగ్గిర స్వంతవారసులకు జెందును.

నాలగవది ఒకసమిష్టికుటుంబములో దాయాదులందరు క్రమముగా చనిపోయి చివరకు యొక్కరుమాత్రము మిగిలినయెడల సమిష్టికుటుంబాస్తియంతయు యతనికిసంక్రమించును. ఆయాస్తియందు హక్కులుగలవారు మరియెవరునూ లేరు గనుక చివరకుమిగిలినదాయాదికి యదిస్వంతయాస్తియగును. అనగా సదరాస్తియందు యతనికి సంపూర్ణమయిన హక్కులు జనియించును. అప్పుడుదానిని తనయిష్టము వచ్చినటులెల్ల వినియోగపర్చుకొనవచ్చును గనుక యిట్టిస్థితిలో యతను చనిపోయినయెడల యదితనస్వంతవారసులకు మామూలువారసత్వపుక్రమముప్రకారము చెందును.

అయిదవది. సమిష్టికుటుంబాస్తి సంక్రమించుక్రమము Law of survivorship యిదివరలో నుదహరించిన సమిష్టికుటుంబాస్తి సమిష్టిదాయాదులకు సంక్రమించుటయం[illegible]నేగాక మరికొన్నియితర సందర్భములలో గూడ స్వల్పభేదములతో వర్తించును.

ఉదాహరణములు —

భర్తతాలూకు యాస్తి భార్యలకు సంక్రమించునపుడు యతని యాస్తియందు యాతనివితంతువులందరకును వారియావజ్జీవము యనుభవించుటకుమాత్రము జాయింటుహక్కు లుండును. దరిమిలాను ఒకవితంతువు చనిపోయినయెడల యామెకు సదరాస్తియందుగల జాయింటుహక్కులు మిగతావితంతువు లందరకును సంక్రమించును. ఈవిధముననే యొక్కొక్కవితంతువు కాలముచేయునెడ యామెహక్కులు మిగిలినవారికి చెందుచుండును. ఇటుల భర్తయాస్తియంతయు చివరకు మిగిలినవితంతువుకు చేరి యామెకూడా కాలముచేసినతరువాత తిరిగి యిది యప్పటికి యున్నయనంతర వారసులకు జెందును.

2 పయివిధముననే తండ్రియాస్తి యతనికుమార్తెలకు సంక్రమించునపుడుకూడ వారికి యట్టియాస్తియందు వారియావజ్జీవము యనుభవించుటకు జాయింటుహక్కులుండును. దరిమిలాను యొక్కొక్కకుమార్తె చనిపోయినపుడెల్ల చనిపోయినవారిహక్కులు మిగిలిన కుమార్తెలకు చెందుచుండును. ఇటుల తండ్రియాస్తి యంతయు చివరకు మిగిలినకుమార్తెకు సంక్రమించి యామెకూడా కాలముచేసినతరువాత సదరాస్తియంతయు యప్పటికి యున్న యనంతరవారసులకు చేరును. ఈరెండువిషయములలోను యనగా వితంతువులు కుమార్తెలవిషయములలో తమకు యుమ్మడిగా సంక్రమించినయాస్తిని జాయింటుగా యనుభవించుటకు యిష్టములేనియెడల తాత్కాలికముగా సదరాస్తిని వారు పంచుకొని యెవరికివచ్చిన వాటా వారు వేరుగా యనుభవించవచ్చునుగాని యందులో యెవరైన కాలముచేసినయెడల యామె యనుభవించేవాటా మిగిలినవారందరకు జెందును.



3. ఒకనియాస్తి యాతనికుమార్తెల కొమరులకు యనగా దౌహిత్రులకు సంక్రమించునపుడు జనసంఖ్యాసంబంధమయిన సంక్రమణన్యాయము (Per Capita) ప్రకారము చెందును. ఒకని ప్రథమకుమార్తెకు నలుగురు కుమారులును, ద్వితీయకుమార్తెకు ముగ్గురుకుమారులును మూడవకుమార్తెకు యిద్దరుకుమారులును నాల్గవకుమార్తెకు యొకకుమారుడును మొత్తము యితనికి పదిమంది దౌహిత్రులు గలరు. అతనికి యింతకంటే ముఖ్యవారసులు లేరు. అతనికుమార్తెలు నలుగురును కాలముచేసినతరువాత యతనియాస్తి యీపదిమంది దౌహిత్రులకు పదిసమవాటాలను సంక్రమించునుగాని నలుగురుకుమార్తెలసంతతివారికి నాలుగుసమానవాటాలను జెందదు. అనగా దౌహిత్రులు పదిమంది వారిమాతామహునియాస్తిని జనసంఖ్యాసంబంధమయిన సంక్రమణన్యాయముప్రకారము (Per Capita) తీసుకొనవచ్చునుగాని శాఖాసంఖ్యాసంబంధమయిన సంక్రమణన్యాయప్రకారము (Per Stirpes) తీసుకొనగూడదు. ఇటుల యాయాస్తి దౌహిత్రులకు సంక్రమించినతరువాత సమిష్టిగానున్న యేకగర్భజనితులగు (ఒకతల్లికడుపున బుట్టినవారు అనగా యొకకుమార్తె కుమారులు) దౌహిత్రులకు వారిలోవారికి యాయాస్తి సంక్రమించవలసివచ్చినపుడు వారు సదరాస్తియందు జాయింటుహక్కులు గలవారు గనుక సమిష్టికుటుంబాస్తి సంక్రమణన్యాయముప్రకారము (Law of survi vor ship) వర్తించును. గాని యొకకుమార్తె కుమారులకును మరియొకకుమార్తెకుమారులకును యిట్టిసంబంధమేదియు యుండదు. అనగా యిచట ప్రథమకుమార్తె కుమారుల నలుగురిలోను పరస్పరము సమి

ష్టికుటుంబాస్తి సంక్రమణన్యాయము (Law of survivorship వర్తించవచ్చును గాని ప్రథమకుమార్తె కుమారులకును ద్వితీయకుమార్తె కుమారులకును లేక మరియేకుమార్తె కుమారులకును పరస్పరము యట్టిన్యాయము వర్తించదని భావము. 25 మ. 678. 27 మ. 382 (385)

---

# హిందూన్యాయశాస్త్రము.

# వారసత్వము.

---

## మూడవయధ్యాయము.

---

### వారసత్వపుపద్ధతులు—రెండవభాగము.

అంత్యకాలమునకు ప్రత్యేకము హక్కుదారుడుగానుండి యెవరికిని చెందజేయకుండ చనిపోయినవాని యాస్తి యప్పటికి యాతనికిగల యావశ్యకులలో మిక్కిలి ముఖ్యునికి చేరును. యెవరైనా యొక సమిష్టికుటుంబమునుండి వ్యష్టియై సమిష్టికుటుంబాస్తిని పంచుకొనగా తనకొకవాటావచ్చినప్పుడును తనకొకస్వార్జితపుయాస్తి వేరేయున్నప్పుడును సమిష్టికుటుంబములో మిగతాదాయాదులందరు గతించగా యాకుటుంబాస్తియంతయు తనకుసంక్రమించినప్పుడును తానొకయాస్తి ప్రత్యేకముగలవాడగును. ఇట్టివాడు తనజీవితకాలములో తనయాస్తిని యితరులకు మరణశాసన దానవిక్రయాదిరూపకమైన యన్యాక్రాంతము లేమియు జేయకచనిపోయినయెడల యపుడది యాతని యావశ్యకులకు జేరును. ఇటులజెందుపద్ధతికి వారసత్వమందురు. చనిపోయినవానియాస్తిని వారసత్వేనాపొందువారతని వారసులగుదురు. చనిపోయినవానికి ముఖ్యుడయిన వారసులెవరయినది నిర్ణయించుటలో యిదివరలో నుదహరించిన న్యాయశాస్త్రతరగతులు భేదించుచున్నవి. మితాక్షరన్యాయము కేవలము రక్తసంబంధసామీప్యమునను, Propin-

quity బట్టియు దాయభాగన్యాయము కేవలముమృతినొందినవానికి గాని వారిపూర్వులకుగాని వారసులవలనయందు పిండములు, తర్పణములు మొదలగు మతసంబంధమయిన యుత్తరక్రియలవలన కలిగెడులాభమును Religious benefit బట్టియు వారసులను నిర్ణయించుచున్నవి గనుక వారసులు మితాక్షరము ప్రకారము సపిండులు సమానోదకులు బంధువులుయని మూడుతరగతులుగాను దాయభాగముప్రకారము సపిండులు, సకుల్యులు, సమానోదకులు యను మూడుతరగతులుగాను విభజింపబడుచున్నారు. సపిండులనగా మితాక్షరముప్రకారము యొక శరీరముయొక్క రక్తసంబంధముగలవారనియు దాయభాగముప్రకారము యుత్తరక్రియలలో వేయబడు యేకపిండసంబంధముగల వారనియు యర్థము. వీరుమితాక్షరముప్రకారము చనిపోయినవానికి తండ్రిమొదలు పయిన యారుపురుషాంతరములవరకును కుమార్థు మొదలు దిగువ యారుపురుషాంతరములవరకును తల్లివంకనైదుతరముల వరకును వ్యాపించియున్నారు. అనగాచనిపోయినవానితో కలుపుకొని యేడుతరములవరకునుయని గ్రహించవలయును. గాని దాయభాగము ప్రకారము సపిండులనగా చనిపోయినవానితో నాలుగుతరములవరకు మాత్రమేయని యర్థము. ఆపయిమూడుతరములువారికిని అనగా అయిదులగాయతు యేడవతరమాఖరువరకు సకుల్యులందురు. ఈశబ్దము మితాక్షరమునందు కనుపించదు. అయితే ఈభేధములు పార్వణ శ్రార్థములు, తద్దినములు, తర్పణములు వగయిరాపితృకర్మలు చేయువాడు చనిపోయిన పితరులకు జేయుగలుగు పుణ్యప్రాప్తినిబట్టి కలిగెను అట్టికర్మలుచేయువారు వారిపైమూడుతరములవరకుగల స్త్రీపురుష పితరులకు పూర్ణపిండము Entire cake ల నంద జేయుగలరుగాన వారికి పరస్పరము సాపిండసంబంధముగలిగియుండుటచే వారుసపిండులనియు



యటుపైని మూడుతరములువరకుగల పితురులకు వారిభార్యలకును భిన్నపిండములను Fragments of acake మాత్రమంద జేయుగలరుగాన పరస్పరము యట్టిభిన్నపిండసంబంధముగల వారు సకుల్యులనియు యెనిమిదవతరము మొదలు పదునాలవతరమాఖరువరకుగల పితురులకు తర్పణోదకములు Libations of water మాత్రమంద జేయగలరుగాన పరస్పరము యట్టి తర్పణోదకసంబంధముగలవారు సమానోదకులనియు పిలువబడుచుండిరి. పూర్ణపిండ, భిన్నపిండ, తర్పణోదకములు లోనగుపితృకర్మల జేయువారికిని యీకర్మలఫలితము నొందువారికిని పరస్పరసంబంధముండుటయేగాక యట్టికర్మలు జేయుటలోగాని వానిఫలితముల బొందుటలోగాని పాలుగొనువారికి గూడ యట్టిపరస్పరసంబంధముండును.

ఉదాహరణము—తమ్ముడువేయు పిండము యన్నకుముట్టకపోవచ్చునుగాని యన్నవేయుపిండము యవరికిముట్టునో తమ్ముడువేయునది వారికే ముట్టును. గనుక యన్నదమ్ములు సపిండులయిరి. ఇటువలెనే దాయాదులందరు సపిండసంబంధులగుచున్నారు. ఈ కారణముచేత నే దాయభాగ న్యాయముప్రకారము కొంతమంది స్త్రీసంబంధులుగూడ సపిండులగుచున్నారు ఏలయన యొకరు పితృకర్మచేయుటలో తండ్రి, తాత, ముత్తాత మొదలగు తండ్రిగారి పూర్వులకేగాక తల్లి, తల్లిదండ్రి, తల్లితాత మొదలగు తల్లిగారి పూర్వులకు గూడ యాకర్మల ఫలితమునంద జేయును. అట్టి సందర్భములో మేనమామ, మేనల్లుడును పరస్పరము సపిండులగుచున్నారు. ఎందువల్లననగా వారిరువురువేయు పిండములు యొకరికే జేరుచున్నవి. అనగా మేనమామకు తండ్రియు, మేనల్లునికి మాతామహుడునగు యొకరికే వారిరువురు చేయు కర్మలఫలితము జేరుచున్నది

ఇటులనే స్త్రీలకీత్యాగలుగు ఇతర సపిండ బాంధవులను యూహింపనది. మితాక్షరన్యాయముప్రకారము యిట్టివారికి భిన్నగోత్రజసపిండులు లేక బంధువులనిపేరు. వీరుసపిండసమానోదకులెవరును లేనప్పుడు యాఖరున వారసులగుదురుగాని దాయభాగముప్రకారము సపిండులలోనే కొంతమంది భిన్నగోత్రజసపిండులు గూడ కలశియుండుటచే వారుగూడ సకుల్యసమానోదకులకు ముందే ముఖ్యవారసులగుచున్నారు. గనుక నిప్పుడు మితాక్షరముప్రకారము సపిండులను గోత్రజసపిండులు లేక సమానగోత్రజసపిండులు భిన్నగోత్రజసపిండులు లేక బంధువులనియు రెండుతరగతులుగా విభజింపవచ్చును. ఒకనిగోత్రజసపిండులు, లేక సమానగోత్రసపిండులనగా వానికి స్వగోత్రమైన తనకెగువనుదిగువను యేడుతరములలోపువారగుపురుషులును, తన భార్య, తల్లి, తండ్రికి పయిన యేడుగురు మూలపురుషులభార్యలును యని యర్థము. ఒకనిభిన్నగోత్రజసపిండులు లేక బంధువులనగా వానికి స్త్రీలకీత్యా సపిండసంబంధముగల యన్యగోత్రజులని యర్థము. బంధువులను, యాత్మబంధువులు, పితృబంధువులు, మాతృబంధువులని మూడు తరగతులుగా విభాగింపనగును. ఆత్మబంధువులనగా తనకుసంబంధించిన బంధువులు యనగా తనమేనత్త (తండ్రితోబుట్టువ) కుమారులు మేనమామకుమారులు పినతల్లికుమారులు మొదలగువారు పితృబంధువులనగా తండ్రికిసంబంధించిన బంధువులు అనగా తనతండ్రికి మేనత్తకుమారులు, మేనమామకుమారులు పినతల్లికుమారులు మొదలగువారు. మాతృబంధువులనగా తల్లికిసంబంధించిన బంధువులు. అనగా తనతల్లికి మేనత్తకుమారులు, మేనమామకుమారులు, పినతల్లికుమారులు మొదలగువారుయని యర్థము అయితే చనిపోయినవాని కెగువను దిగువను యైదుతరములు లోపుసంబంధముగల బంధువులకు మాత్రమే వారసత్వపుహక్కు యుండునని యొకసూత్రముగలదు దీనికి



యర్థము చేయుటలో వేరువేరుగ్రంథకర్తలు వేరువేరుయభిప్రాయములుగలవు. సపిండులు మొదలగు వారివిషయమై ముందు వారసత్వపుక్రమమున వివరముగా దెలుపబడునుగాని యీసందర్భములో నిచట ముఖ్యమైన వారసత్వపుపద్ధతులను మాత్రము తెలుసుకొనవలయును.

1. న్యాయశాస్త్రమొప్పినంతవరకు యెవ్వరైన వారసత్వపుక్రమమును మార్చలేరుగాని న్యాయశాస్త్రమునుమించి యెవరును వారసత్వపుక్రమమును మార్చుటకు వీలులేదు.

ఉదాహరణములు — ఒకడు తనయాస్తిని మరణశాసనమువల్ల యితరులకు చెందజేసి కొంతవరకు వారసత్వపుహక్కుకు భంగము కలుగజేయవచ్చును. అసలు వారసులైనవారుగల వారసత్వపుహక్కుకు వదులుకొనుటగాని మార్చుకొనుటగాని జరిగించడముమూలముగా యీ వారసత్వపుక్రమమునకు భంగము కలుగజేయవచ్చునుగాని యొకడు తనయాస్తిని న్యాయశాస్త్రములో చెప్పబడిన వారసత్వపుక్రమమునకు వ్యతిరేకముగా తనయిష్టమువచ్చిన క్రమముప్రకారము తాను యేర్పరచినవారసులలో నొకరితరువాత నొకరికి చెందవలయునని చేసిన యేర్పాటు శాస్త్రవిరుద్ధముగాన చెల్లనేరదు. 19 మ 501. అటులనే యిరువురుయున్నదమ్ములు తమకుగల యాస్తి యావత్తుతమలో యోరసకుమారులుగల వంశజులకుమాత్రము చెందుచుండవలెననియు తమ వంశములో నెవరును దత్తతచేసుకొని యాస్తిని పరులకు చెందజేయగూడదనియు ఖరారుచేసుకొనిరి. అట్టియేర్పాటు శాస్త్రసమ్మతమైన వారసత్వపుక్రమమునకు విరుద్ధముగా యున్నదిగాన చెల్లగూడదని సీమలోని ప్రీవీకౌన్సిలువారు దానిని రద్దుచేసిరి. 9 మ 499 (505) ప్రి. కౌ.

2. చనిపోయినవాని వారసు కేవలము తనకుగల వారసత్వపుహక్కులనుబట్టి వారసత్వమును బడయునుగాని మరియితరులద్వా

రా పొందవలసిన హక్కులనుబట్టి యీవారసత్వమును బడయజాలరు అనగా యొకడు చనిపోవునరికి యతనికిగల ముఖ్యవారసులకు యతని యాస్తి చెందునుగాని యంతకుముందే గతించినముఖ్యవారసుల వారసులకు జెందనేరదని యభిప్రాయము.

ఉదాహరణములు—

1. ముందు కుమారుడును తరువాత తండ్రియు చనిపోయిన యెడల తండ్రితాలూకుయాస్తి కుమారునిస్థానే కుమారుని కుమార్తెకు జెందనేరదు

2. ఒకనికి యిద్దరుకుమారులుగలరు. మొదటికుమారుడు ముందు చనిపోయెను. ఆతనికి భార్యమాత్రము గలదు. అటుపిమ్మట తండ్రి కాలముచేసెను. ఇట్టిస్థితిలో తండ్రితాలూకు యాస్తి రెండవకుమారునికి జెందునుగాని మొదటికుమారునిస్థానే యతనిభార్యకు యెంతమాత్రము జెందనేరదు. ఏలయన తండ్రికి కుమారుడు వారసుగాని కోడలువారసు గాదు గనుక తండ్రిపోవునరికియున్న కుమారునికి యతని యాస్తి జెందునుగాని యంతకుముందేగతించిన కుమారునిస్థానే కోడలుకు చెందనేరదు. అనగా యొకనికి యాస్తి వారసత్వేనా జెందవలెనన్న యతనే చనిపోయినవానికి ముఖ్యవారసు గావలెను గాని మరియొకరిద్వారా తనకు యట్టిహక్కులు గలుగనేరవు

భర్త కాలముచేయునరికి భార్య ముఖ్యవారసీయైన యెడల యాతనియాస్తి యామెకు చెందవలెను. లేనియెడల యసలే చెందక పోవలెను. కాని తరువాత చనిపోవువారికి తనభర్త బ్రతికియుండిన యెడల యాతను వారసుడైయుండుననే కారణమున యాతనిస్థానే తనకు యితరులయాస్తులు సంక్రమించనేరవు. 18 మ. 168 (170)

3. ఒకపురుషునికి వారసత్వేనా సంక్రమించిన యాస్తికతడు సర్వాధికారియగుటయే గాక దానికి సంబంధించినంతవరకతడాతని వంశ



మునకు మూలపురుషుడగుటచే యతడు చనిపోయినతరువాత సదరాస్తి యతనివారసులకు జెందునుగాని యతని పూర్వికుని వారసులకు జెందనేరదు. ఇచట పూర్వికుడనగా యొకయాస్తిని ప్రస్తుతము యనుభవించువానికి పూర్వము యనుభవించినవాడని యర్థము.

4. ఒకస్త్రీకి వారసత్వేనా సంక్రమించినయాస్తికి యామె సర్వాధికారి కానేరదు అనగా దానవిక్రయాది యన్యాక్రాంతముల జేయుటకు స్వతంత్రహక్కులు గలది కానేరదుగాన యామె చనిపోయినతరువాత సదరాస్తి తిరిగి యామెపూర్వికుని వారసులకు జెందునుగాని యామెవారసులకు చెందనేరదు. ఇచట యామెపూర్వికుని వారసులనగా యామెకు మునుముందు (పూర్వము) సదరాస్తిని పూర్ణమయిన హక్కులతో యనభవించినవారి వారసులని యర్థము. వీరినే యనంతరవారసులందురు ( Reversioners). అయితే స్త్రీయొక్క పూర్వికుని వారసులకు సంక్రమించడమనగా యాస్త్రీ చనిపోయిననిమిషముననే యామెపూర్వికుడుకూడా చనిపోయెననుకొనవలయును. అప్పటికతని ముఖ్యవారసు లెవరు జీవించియుందురో వారికి సదరాస్తి సంక్రమించునుగాని యాపూర్వికుడు నిజముగా గతించినకాలమునకుగల వారసులకు కాదు. అనగా మితిలేకుండా సర్వస్వాతంత్రము గలిగి సంపూర్ణమైనహక్కులతో యొకయాస్తిని యనుభవించువారు కాలముచేయగా మధ్యను సదరాస్తి స్త్రీవారసులకు సంక్రమించినపుడు వారిజీవితానంతరమువరకును దానిని యనుభవించుటకుమాత్రము వారికిగలహక్కులకు కొంతమితియుండును. అట్టిమితియన నెట్టిదియో ముందు తెలియునుగాన యిచట వేరే దెలుపనవసరము లేదు. మితిగల హక్కులతో యనుభవించువారు గతించునిమిషమువరకును వారిపూర్వికుడగు మితిలేనిహక్కులతో యనుభవించి చనిపోయినవాడు జీవించియున్నారనుకొనగా యప్పటికి యాపూర్వికునకుగల ముఖ్యవారసు

లకు నదరాస్తి సంక్రమించును. అందువలననే స్త్రీవారసులు జీవించి యుండగా యనంతరవారసుల నిర్ధారణచేయుట యసాధ్యమగును. ఏల యనగా స్త్రీవారసు కాలముచేయునరికి యామెపూర్వికుని పురుషవారసు లెవరుందురో తెలియదుగాన స్త్రీవారసు జీవించియుండగా యామె యనుభవించుయాస్తి చివరకు యెవరికిచెందునో నిర్ధారణకేయ వీలుండదు.

5. ఆస్తిగలవాడు చనిపోయినవెంటనే యాతనియాస్తి యప్పటికిగల యతనివారసునకు సంక్రమించునుగాని యప్పటికి గర్భములో యుండిననేతప్ప ముందుపుట్టబోవు వారసులకొరకు వారసత్వము నిలుపుకానేరదు. ఒకడు చనిపోవునరికి యతనిముఖ్యవారసు యుత్పత్తియై గర్భములో యుండినయెడల యావారసు జన్మించువరకు వారసత్వము యితరులకు సంక్రమించకుండా నిలచిపోవచ్చును. కాని యట్టిగర్భము పోయినను జీవముతో శిశువు పుట్టకపోయినను మొదట చనిపోయిన వానియాస్తి యాతనికి యప్పటికిగలవారసులకే సంక్రమించును. ఆశిశువుప్రాణముతో బుట్టి యొకక్షణము జీవించిచనిపోయినను యాశిశువు వారసులకు సంక్రమించును.

6. ఒకడుచనిపోవుటచే యాతనియాస్తి వారసత్వేనా యొక వారసునికి సంక్రమించినతరువాత యదితిరిగి మరియొకవారసునకు సంక్రమించడము మూలముగా మొదటిసంక్రమించినవారినుండితొలగి పోనేరదు. గాని యీదిగువనుదహరించిన రెండువిషయములలోనూ యటులతొలగిపోవచ్చును.

1. భర్తచనిపోయినవెంటనే యాతనియాస్తియతని సంతతువులకు సంక్రమించును తరువాత యతనికి యొకచిన్నవానిని దత్తత చేసినయెడల యతనియావదాస్తియు దత్తునికి సంక్రమించును. ఆతని భార్యలకదివరలో సంక్రమించినయాస్తి వారినుండి తొలగిపోవును.



2. ఒకడుచనిపోవునరికి యాతనికిగల వారసులలో ముఖ్యుడు పిండోత్పత్తియై గర్భములో యుండును ఆతడు జన్మించకపూర్వము చనిపోయినవాని యాస్తితాత్కాలికముగా యప్పటికిగల వారసులకు సంక్రమించునుగాని యాశిశువు జన్మించినవెంటనే యతడుదగ్గిర వారసు యగుటచేతను మరణము తటస్థించునాటికి యతడు పిండోత్పత్తియై గర్భములో నుండుటచేతను చనిపోయినవానియాస్తి వారసత్వేనా శిశువునకు సంక్రమించి యదివరలో శిశువుజన్మించకపూర్వము యెవరికి సంక్రమించునో యావారసులనుండి తొలగిపోవును

7. వారసత్వేనా ముందుసంక్రమించబోవు యాస్తి సందేహాస్పదమయినది గనుక దానిని దానవిక్రయాది యన్యాక్రాంతములు చేయుట న్యాయశాస్త్రసమ్మతముగామిచే యిట్టియన్యాక్రాంతములు చెల్లనేరవు. ముందువారసత్వేనా యొకనికి సంక్రమించునని యనుకొనినయాస్తి సంక్రమించకపోవచ్చును. వారసత్వము కలుగునాటికి యనగా యొకయాస్తియొక్క హక్కుదారుడు నశించునాటికి దగ్గిర వారసులెవరుందురో యపుడే చెప్పవచ్చును. గాని యంతకు పూర్వము నిశ్చయముగా నిర్ణయించిచెప్పుట యసాధ్యము. గనుక ముందురాబోవు వారసత్వపుయాస్తివిషయమై జరిగించుకొనిన ఖరారు యసలు వారసత్వేనా యట్టియాస్తి సంక్రమించినవారి హక్కులకు వ్యతిరేకముగా చెల్లనేరదు.

8 మితాక్షరప్రకారముయొక యాస్తి యిద్దరు వారసులకుగాని యిద్దరికంటె యెక్కువమంది వారసులగాని వారసత్వేనా సంక్రమించునపుడు దానియందు వారికి ప్రత్యేకపు హక్కులుండును. as tenants in common అనగా యాస్తి జాయింటుగానున్నను వారసులసంఖ్యనుబట్టి ప్రత్యేకము వారివారివాటాలయందు దానవిక్రయాధికారములతో సంపూర్ణమైన హక్కులు

గలిగియుందురు. దరిమిలానుయందులో నెవరైన నొకరు చనిపోయిన యెడల యతనివాటాయున్నది కుటుంబమువారివలెమిగతావారలకు చెందక వ్యష్టికుటుంబమువారివలె వారిస్వంతవారసులకు జెందును. గాని యీడిగువ నుదహరించిన విషయములలో మాత్రము సమిష్టిగా సంక్రమించును. as joint tenants

1. ఒకనిస్వార్జితపుయాస్తి లేక స్వంతయాస్తి యతనికికుమారులకుగాని మనమలకుగాని మునిమనమలకుగాని వారసత్వేనా సంక్రమించునపుడును.

2. భర్తతాలూకుయాస్తి భార్యలకు వారసత్వేనా సంక్రమించునపుడును,

3. తండ్రితాలూకుయాస్తి కుమార్తెలకు వారసత్వేనా సంక్రమించునపుడును.

4. సమిష్టికుటుంబముగానున్న యొకకుమార్తె కుమారులకు యనగా దౌహిత్రులకు మాతామహునియాస్తి సంక్రమించునపుడును 25 మ. 678. వారు యట్టియాస్తిని సమిష్టికుటుంబాస్తివలెనే as joint tenants with right of survivorship పొందుదురు. దరిమిలాను వారిలో నెవరైన చనిపోయినయెడల వారిహక్కులు మిగిలినవారికి జెందునుగాని వారి స్వంతవారసులకు జెందవు.

9. యాజ్ఞవల్క్యస్మృతిప్రకారము వారసులను పదితరగతులుగా విభాగింపనగును ఏమనిన:—

1. పురుషసంతానము (కుమారులు, మనుమలు, మునిమనుమలు) 2. భార్యలు 3. కుమార్తెలు వారికుమారులు 4 తల్లిదండ్రులు 5. సోదరులు 6. సోదరులకుమారులు 7. గోత్రజులు 8. బంధువులు 9. శిష్యులు 10. సహాధ్యాయులు యనగా యొకవిద్యను కలసి యభ్యసించువారు. వీరితో వారసులజాబితా పూర్తియైనదనుటకు వీలులేదు



ప్రతితరగతిలోను గతించినవానికిని వారసులకునుగల రక్తసంబంధమునుబట్టి మరికొందరిని జేర్చవచ్చును గనుక యాయాతరగతులలోని వారసులసంఖ్య పెరుగుట కవకాశముగలదు. అనగా రక్తసంబంధమును బట్టి వారసులసంఖ్యను నిర్ధారణచేయవచ్చును. ఆరక్తసంబంధముయొక్క సామీప్యమును (Propinquity) బట్టి యొకతరగతివారసులలో ముఖ్యుల నిర్ణయింపనగును. మనుమనికంటె కుమారునిసంబంధము సామీప్యముగనుక కుమారుడు ముందు వారసుడగును. అనగా యొకనియాస్తికి కుమారుడు వారసుడుండగా మనుమనికి సంక్రమించనేరదు. ఇటులనే రక్తసంబంధసామీప్యమునుబట్టి (Propinquity) యితరవారసుల నిర్ణయించవలయును. మితాక్షరన్యాయముప్రకారము వారసుల నిర్ణయించుటలో రక్తసంబంధసామీప్యము (Propinquity) ప్రాధాన్యమని యిదివరలో తెలుసుకొనియుంటిమి. అయితే చనిపోయినవానికి సమానమైన రక్తసంబంధముగలవారు యనగా వంశవృక్షములో సమానమైన యంతరువులలోనివారగు కొందరిలో చనిపోయినవాని వారసత్వమువిషయమై వివాదకలిగినపుడు వారిలో నెవడు పిండసంబంధమువలనయనగా యుత్తరక్రియలవలన చనిపోయిన) వానికి యెక్కువ మతసంబంధమయినలాభమును (Religious benefit గలుగజేయగలడో యతని ముఖ్యవారసుగా నెంచవచ్చును. అనగా యొక్క రక్తసంబంధసామీప్యమునుబట్టి ముఖ్యవారసులను నిర్ణయించ వీలులేనపుడు చనిపోయినవానికి వారసులవలన గలుగగల మతసంబంధమైన లాభపరిమితిని (Extent of religious benefit ) బట్టికూడవారసుల నిర్ణయింపనగును. 16, మ. 23. 41. మ. లా. జ. 676 ప్రి. కౌ.

ఉత్తరక్రియలవలని ఫలితమువలన గలిగెడు మతసంబంధమైన లాభమును Religious benefit బట్టి ముఖ్యవారసులను నిర్ణయించు

టులో తెలియుటకు మెయిన్ దొరగారి హిందూలాలోని యీదిగువ నుదహరించిన సూత్రములను గమనించవలయును.

1. పూర్ణపిండసంబంధముగలవారు యనగా సపిండులు, భిన్నపిండసంబంధముగలవారుయనగా సకుల్యులకంటెను, భిన్నపిండసంబంధముగలవారు (సకుల్యులు) తర్పణోదకసంబంధులు యనగా సమానోదకులకంటెనుముఖ్యులు.

2. ఒకనికి పిండములు మొదలగువానిని యర్పించువారు వానివలన పిండములు మొదలగువానిని పొందువారికంటెను యతనువేయు పిండములు మొదలగువానిలో పాల్గొనువారికంటెను ముఖ్యులు. ఉదాహరణము:— చనిపోయినవానికి పిండములర్పించు పురుషసంతానము దౌహిత్రులు మొదలగువారు యతనివలన పిండములనుపొందు యతని తండ్రి తాత మొదలగు పూర్వులకంటెను యతనువేయు పిండములవలన గలుగు లాభములో పాల్గొను సోదరులు మొదలగువారికంటెను ముఖ్యులు

3. తండ్రివైపు పూర్వులకును తల్లివైపు పూర్వులకునుగూడ పిండములర్పించువారు యొక్క తండ్రివైపువారికిమాత్రము పిండములర్పించువారికంటె ముఖ్యులు. ఉదాహరణము:— ఏకగర్భజులగుసోదరులు భిన్నోదరసోదరులకంటె ముఖ్యులు.

4. చనిపోయినవాని తండ్రివైపుపూర్వులకు పిండములర్పించగలవారు వానితల్లివైపుపూర్వులకు పిండములర్పించగలవారికంటె ముఖ్యులు. ఎందువలననగా మొదటితరగతిపిండములు రెండవతరగతిపిండములకంటె యెక్కుడుఫలితము నిచ్చునని శాస్త్రము. మొదటితరగతి పిండములుయనగా తండ్రివైపు పూర్వులకునిచ్చెడి పిండములు తక్కువసంఖ్యయైనను రెండవతరగతిపిండములు విస్తారసంఖ్యయైనను రెండవతరగతివాని నిచ్చువారికంటె స్వల్పసంఖ్యగల మొదటితరగతిపిండముల నర్పించువారే ముఖ్యులనిగూడ యున్నది.



5. అటువలెనే యొకేతరగతిపిండముల నెక్కువసర్పించువారు యొకేతరగతి తక్కువపిండముల నర్పించువారికంటె ముఖ్యులు. మరియును సమానసంఖ్యగల పిండములను సమీపసంబంధముగలవారికి నిచ్చువారు దూరపుసంబంధముగలవారికి నిచ్చువారికంటె ముఖ్యులు.

పైనయుదహరించిన సూత్రములనుబట్టి చనిపోయినవాని వారసులను సులభముగా నిర్ణయించవచ్చును. కాని మితాక్షరన్యాయము ప్రకారము స్పష్టముగా సామీప్యరక్తసంబంధమున్నప్పుడు యీపిండసంబంధమువిషయమై నాలోచించనవసరము లేదు. చనిపోయినవానికి యేకతరగతిలో యన్నివిధములా సమానమైన దగ్గరవారసులున్నయెడల వానియాస్తి యీవారసులకు సమానముగా సంక్రమించును దగ్గరవారసులు దూరులను వారసత్వమునుండి తొలగింతురు.

10. దేశాచారములుగాని యాదేశములకువర్తించు న్యాయశాస్త్రప్రమాణములుగాని ప్రత్యేకము యొప్పిననేగాని స్త్రీలు సాధారణముగా వారసత్వమున కర్హులు కారు. అయితే స్త్రీలు వారసత్వమునకు యర్హులు కాకపోయినను వారినమూను లర్హులగుచున్నారు. మితాక్షరముప్రకారము మనదేశములో కొంతమందిస్త్రీలుకూడా వారసత్వమున కర్హులని క్రమముగా హైకోర్టుతీర్పు లంగీకరించుచున్నవి. ఎట్టిస్త్రీల నటుల యంగీకరించినదో ముందు తెలియును.

11. చనిపోయినవానికి దగ్గరవారసులున్నను వారికి యీవారసత్వము సంక్రమించుటకు యీదిగువనుదహరించిన ప్రతిబంధకములేవియు లేకుండ నుండవలయును.

వారసత్వప్రతిబంధకములు:—

1. హిందూన్యాయశాస్త్రము ప్రకారము పుట్టుకతోనున్న యంధత్వము—చెముడు—మూగ గలిగినవారు వారసత్వమును పొందజాలరు. అంధత్వమయినను చెముడు, మూగయైనను పుట్టుకతోనే

యుండి యది కుదురునదేయాన లేనపుడే వారసత్వమునకు ప్రతిబంధకము కలుగునుగాని మధ్యవచ్చి మధ్య పోవు లోపములవలన యట్టి ప్రతిబంధకములు కలుగవు. 45 క. 17 పి) కా.

2. పుట్టుకతోనే యవయవలోపమేదైనను యున్నయెడల యది యొక వారసత్వపు ప్రతిబంధకమని చెప్పబడియున్నదిగాని యట్టిలోపము మనిషిని కేవలము యెందుకును పనికిరానివానిగా చేయునదిగా యుండిననేతప్ప యది యొక ప్రతిబంధకముగా నెన్నబడుటలేదు. 26 మ 133. అందువలననే పుట్టుకతోనే గుడ్డివాడుగానున్నను యిపుడు వానిసోదరులతోపాటు కుటుంబాస్తియందు హక్కుగలిగియుండుననిన్ని యది యొకవారసత్వపు ప్రతిబంధకముకాదనిన్ని తీర్మానించిరి. 43 మ. 4. తా॥ 1922 స॥ మ. వి. నో. పేజీ 693 పు. బెం. న్యతీరే॥

3. పిచ్చితనము—వెర్రితనము—పుట్టుకనుంచియున్నను మధ్యవచ్చినను కుదురుననే యాసయున్నను, లేక పోయినను వారసత్వమునకు ప్రతిబంధకమవును గాని యది గడుసుతనము లేమికిగాని కొంచము తెలివితక్కువతనముకుగాని వర్తించదు. లోకజ్ఞాన మెంతమాత్రము లేక తనయిరుగుపొరుగునను జరుగుచున్న సంగతులను గ్రహించలేనటువంటిన్ని మంచిచెడ్డల వివక్షతలు తెలియలేనటువంటిన్ని శుద్ధపశువువలెనుండిన పిచ్చి లేక వెర్రి వానికిమాత్రమే వారసత్వము సంక్రమించనేరదని భావము. అయితే యిట్టి స్థితి వారసత్వము సంక్రమించునాటికి యుండిననే యావారసత్వమునకు భంగముగలుగును గాని యొకనికి యాపిచ్చితనము, వెర్రితనము, వారసత్వము సంక్రమించుటకు పూర్వముండి వారసత్వము సంక్రమించునాటికి కుదిరి మంచిస్థితిలో యున్నయెడల యీవారసత్వము సంక్రమించుటకు యభ్యంతరముండదు. అటులనే యొకనికి వారసత్వము సంక్రమించినతరువాత



యట్టిపిచ్చి లేక వెర్రి వచ్చినయెడల సంక్రమించిన వారసత్వము పోనేరదు.

4 పుంసరశితోగూడిన కుష్ఠురోగముచే మిక్కిలి బాధపడువానికి వారసత్వమున కరహతయుండదు. అయితే యాకుష్ఠురోగము మిక్కిలి క్రూరజాతిదైయుండవలెను. దానివలన బాధసహింపరానిదై యుండవలెను. గాని సాధారణరోగమునకు వారసత్వపుప్రతిబంధకము యుండదు. 25 ఇం. కే. 968. 38 మ. 250.

5. నపుంసకత్వము, వారసత్వమునకు ప్రతిబంధకమగును. కుమారునిగనుట మానవజన్మముయొక్క యొకయుద్దేశము గనుక కుమారునిగనలేని వాని జన్మనిష్ఫలమనియెంచి నపుంసకునికి వారసత్వము సంక్రమించగూడదని మనుమొదలగు పూర్వపుఋషులు శాసించిరి. నపుంసకత్వము పుట్టుకనుండియున్నను మధ్యవచ్చినను వారసత్వము సంక్రమించునాటికి యున్నయెడల వానికి వారసత్వము సంక్రమించనేరదు.

6. పైన యుదహరించిన లోపములునుమరి ఈజన్మములో కుదురుననేయాసలేని క్రూరవ్యాధులును పూర్వజన్మములో చేసుకున్న పాపములవలన యీజన్మములో పీడించునని మను మొదలగు పూర్వపుఋషుల యభిప్రాయమైయున్నది. అట్టియభిప్రాయము ననుసరించి పాపాత్ములకు వారసత్వము సంక్రమించకూడదనియు యట్టివారు పితృదేవతలకు పిండములు తర్పణములు మొదలగువాని యందజేయ యనర్హులుగాన వారికి వారసత్వము సంక్రమించగూడదనియు శాస్త్రములేర్పడెను. యేవ్యాధియైనను యతికఠినముగానుండి వైద్యశాస్త్రమునకు లొంగనిదైయైననేయది వారసత్వమునకు ప్రతిబంధకమగునుగాని యన్ని వ్యాధులు యటువంటి ప్రతిబంధకములు కానేరవు పైనయుదహరించిన ప్రతిబంధకములన్నియు స్త్రీవారసులకును వర్తించును. 38 మ. 250

7. జారత్వము స్త్రీవారసులకు వారసత్వము సంక్రమించుటకు ప్రతిబంధకమగునని శాస్త్రముకలదు. అయినను మితాక్షరముప్రకారము భర్త యాస్తి భార్యకువిత్తంతుగా వారసత్వేనా సంక్రమించునపుడు మాత్రమే జారత్వమొక ప్రతిబంధకమగునుగాని స్త్రీధనము స్త్రీకి సంక్రమించునపుడును కుమార్తె మొదలగు యితరస్త్రీవారసులకు వారసత్వేనా యాస్తిసంక్రమించునపుడును జారత్వమంతగా వారసత్వపు ప్రతిబంధకము కానేరదని మద్రాసుహైకోర్టువారి యభిప్రాయమై యున్నది. 26 మ 509 31 మ 100.

8. ఒకనిచంపిగాని చంపించిగాని లేక యాచావుకుకారకుడుగా యుండిగాని కూనీనేరము చేసినవాడు యటులచంపబడినవానికి నేరము చేసినవాడు ముఖ్యవారసుడై యుండినను యావారసత్వము యతనికి సంక్రమించనేరదు 27 మ 591.

ఒకని చంపి కూనీనేరము చేసినవారసుని క్రిమినలుకోర్టువారు నిర్దోషియని విడిచిపెట్టినప్పటికిని చనిపోయినవాని యాస్తికి వారసత్వము విషయమై సివిలుకోర్టువారు తీర్మానించుటలో యావారసే యాహత్యకు కారకుడని సందేహమెంతమాత్రములేని మంచిసాక్ష్యమువల్ల రుజువైనయెడల వానిని యావారసత్వమునుండి తొలగించవచ్చును. 31మ100

9. 1856 సంవత్సరపు 15 చట్టమనగా హిందూవితంతుపునర్వివాహ చట్టముప్రకారము ఒకవితంతుపునర్వివాహము చేసుకొనినయెడల యామెకు తనమొదటిభర్తయొక్కయు వానిసంతతివారియొక్కయు యాస్తులయందుగల హక్కులు నశించును. ఆమెపునర్వివాహతిథి ముందే సదరాస్తికి సంబంధించినంతవరకు మృతినొందినటుల యెంచబడినవెంటనే సదరాస్తి చనిపోయినభర్తయొక్క యనంతరవారసులకు Reversioners సంక్రమించును అయితేయిది స్త్రీపునర్వివాహముచేసుకొను యాచారములేని కులములవారికి మాత్రమేవర్తించును. కాని



చనిపోయినభర్తయొక్క యాస్తియందు హక్కులు యెంతమాత్రము నశించకుండా పునర్వివాహము చేసుకొనగల యాచారముయున్న కులములవారికి వర్తించదు.

10 ప్రపంచముతో సంబంధము వదలుకొనిన సర్వవిధములా సన్యసించినవారికి వారసత్వము సంక్రమించనేరదు. కాని సన్యాసియైనను తనయాస్తులను వదలక తనస్వాధీనములోనే యుంచుకొని నాటికి యనుభవించుచున్నయెడల యతనికి వారసత్వము సంక్రమించుటకు ప్రతిబంధకముండదు.

11 చనిపోయినవాని ముఖ్యవారసునకు వారసత్వము సంక్రమించుటకు పయినయుదహరించినవానిలో నేదైనప్రతిబంధకమున్న యెడల యావారసత్వము యాముఖ్యవారసునితరువాత వారసునకు సంక్రమించును అట్టిస్థితిలో ప్రతిబంధకముగల వారసుడు యతనికుటుంబముసహా సదరు వారసత్వపుయాస్తినుండి పోషింపబడుటకుమాత్రము Maintenance హక్కుకలిగియుండును. ఒకనికి వారసత్వపుప్రతిబంధకమునకు కారణమగు యంగహీనము వ్యాధిమొదలగునవి యెప్పుడైన కుదిరిచక్కబడినయెడల యతనికితిరిగియప్పుడే వారసత్వమున కరహతయును హక్కునుకలుగునుగాని యటులచక్కబడుటకు పూర్వమే వారసత్వమేదైన తనకుయప్పటికిగల ప్రతిబంధకమువలన యితరపురుష వారసులకు పూర్ణమయినహక్కులతో సంక్రమించినయెడల దానిని తిరిగితప్పించ వీలుండదు. గాన తాను దరిమిలాను చక్కబడినను యావారసత్వమును పొందజాలడు.

ఉదాహరణములు—

1 ఒకడుచనిపోవునప్పటికి మూగకుమారుడును భార్యయునుయుండెను. అట్టిస్థితిలో వానియాస్తి భార్యకుసంక్రమించును. దరిమిలాను

తల్లి బ్రతికియుండగా కుమారునికి మూగతనముపోయి చక్కనైనపుడు యిదివరలో తల్లికిసంక్రమించిన యాస్తిని యామెజీవితకాలములో తిరిగి తానపొందుటకు వారసత్వేనా హక్కులేనప్పటికి యామెచనిపోయినతరువాత తండ్రికి తనపినతండ్రికంటె ముఖ్యవారసుగా పొం వచ్చును.

2. ఒకడుచనిపోవుసరికి గుడ్డికుమారుడును సోదరుడును కలరు అపుడు కుమారునికి వారసత్వప్రతిబంధకముండుటవలన వానియాస్తి సోదరునికి సంక్రమించెను. దరిమిలాను కుమారునినేత్రములు చక్కబడెనుగాని యొకమాటు వారసత్వేనా సంక్రమించినయాస్తి తిరిగిపోనేరదనేన్యాయమువలన కుమారునికి తిరిగి తండ్రియాస్తి సంక్రమించనేరదు.



# హిందూన్యాయశాస్త్రము.

# వారసత్వము.

---

### నాలుగవయధ్యాయము.

### పురుషులకు వారసత్వపుక్రమము

### మొదటిభాగము—గోత్రజులు

### Agnates

మితాక్షరన్యాయముప్రకారము చనిపోయినవానికి 1. గోత్రజ సపిండులు 2. సమానోదకులు 3. భిన్నగోత్రసపిండులులేక బంధువులు 4. గురువు 5. శిష్యుడు 6 సహాధ్యాయులు 7. చక్రవర్తి వరుసను వారసులగుదురు. ఇందులో ప్రతితరగతివారసులలోను దగ్గిరసంబంధముగలవారు దూరమువారికంటె ప్రాముఖ్యతను వహించి వారసత్వమునకు హక్కుగలవారగుదురని యిదివరలో తెలుసుకొనియుంటిమి గనుక యిపుడు మొదటి మూడుతరగతులవారసులను ప్రత్యేకముగా వివరించి వారికిని చనిపోయినవానికిని గలసంబంధ సామీప్యమునుబట్టి వారసత్వపుక్రమమును నిర్ణయించుట యావశ్యకము అందుకు గోత్రజులుయనగా సపిండులు, సమానోదకులును వారి వారసత్వపుక్రమమును యీదిగువ నుదహరించినవంశవృక్షములవలన సులభముగా తెలియనగును.

### 1 గోత్రజ సపిండులు.

మనదేశమునకు వర్తించు వారసత్వపుక్రమముప్రకారము యనగా మదరాసుహైకోర్టువారి యభిప్రాయముప్రకారము రామ

కృష్ణుని హిందూన్యాయశాస్త్రములో యిటుల సపిండులజాబితా వంశవృక్షముగా నియ్యబడియున్నది.

మొదటినెంబరు వంశవృక్షము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ముత్తాతముత్తాత 28 | క. | క. | క. | క. | క. | క. |
| ముత్తాతతాతతల్లి 27 | 29 | 30 | 54 | 55 | 56 | 57 |
| ముత్తాత తాత 24 | క. | క. | క. | క. | క. | క. |
| ముత్తాతతండ్రితల్లి 23 | 25 | 26 | 50 | 51 | 52 | 53 |
| ముత్తాత తండ్రి 20 | క. | క. | క. | క. | క. | క. |
| ముత్తాత తల్లి 19 | 21 | 22 | 46 | 47 | 48 | 49 |
| ముత్తాత 16 | క. | క. | క. | క. | క. | క. |
| తాతతల్లి 15 | 17 | 18 | 42 | 43 | 44 | 45 |
| తాత 12 | క. | క. | క. | క. | క. | క. |
| తండ్రితల్లి 11 | 13 | 14 | 38 | 39 | 40 | 41 |
| తండ్రి 8 | క. | క. | క. | క. | క. | క. |
| తల్లి 7 | 9 | 10 | 34 | 35 | 36 | 37 |

తండ్రి భార్య (సవతితల్లి) 6 — తండ్రి 5 — చనిపోయినవాడు = భార్య 4

కుమారుడు 1

మనుమడు 2

మునిమనుమడు 3

మునిమనుమని కుమారుడు 31

మునిమనుమని మనుమడు 32

మునిమనుమని మునిమనుమడు 33

ఈయాబదియేడుగురును గోత్రజసపిండులు వారిసంఖ్యవరుసననుసరించియే వారికిగలవారసత్వపుహక్కుయొక్క క్రమముస్పష్టముకాగలదు (క = కుమారుడు)



2. మనదేశమునందుగాక అలహాబాదు మొదలగు మితాక్షరన్యాయములలోగల ఇతరప్రదేశములయందువర్తించు వారసత్వపుక్రమముప్రకారము యనగా యలహాబాదు హైకోర్టువారి యభిప్రాయప్రకారము సర్వాధికారిచే తయారు చేయబడిన యీదిగువ జాబితా వంశవృక్షమునుపట్టి వారసత్వపుక్రమము విషయములో మనదేశమునకును యీదేశములకునుగల భేదములు స్పష్టముకాగలవు.

రెండవనెంబరు వంశవృక్షము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ముత్తాతముత్తాత 45 | క. | క. | క. | క. | క. | క. |
| ముత్తాతతాతతల్లి 44 | 46 | 47 | 48 | 55 | 56 | 57 |
| ముత్తాతతాత 40 | క. | క. | క. | క. | క. | క. |
| ముత్తాతతండ్రితల్లి 39 | 41 | 42 | 43 | 52 | 53 | 54 |
| ముత్తాత తండ్రి 35 | క. | క. | క. | క. | క. | క. |
| ముత్తాతతల్లి 34 | 36 | 37 | 38 | 49 | 50 | 51 |
| ముత్తాత 18 | క. | క. | క. | క. | క. | క. |
| తాతతల్లి 17 | 19 | 20 | 21 | 31 | 32 | 33 |
| తాత 13 | క. | క. | క. | క. | క. | క. |
| తండ్రితల్లి 12 | 14 | 15 | 16 | 28 | 29 | 30 |
| తండ్రి 8 | క. | క. | క. | క. | క. | క. |
| తల్లి 7 | 9 | 10 | 11 | 25 | 26 | 27 |

తండ్రి భార్య (సవతితల్లి) 6 — తండ్రి 5 — చనిపోయినవాడు = భార్య 4

కుమారుడు 1

మనుమడు 2

మునిమనుమడు 3

మునిమనుమని కుమారుడు 22

మునిమనుమని మనుమడు 23

మునిమనుమని మునిమనుమడు 24

ఈరెండువంశవృక్షములకు యందుపైగల మదరాసు యలహాబాదు హైకోర్టులవారి యభిప్రాయములను యలహాబాదు హైకోర్టు నుండియప్పీలుకాబడిన యొక కేసులో ప్రివి కౌన్సిలువారు విమర్శనచేసి మదరాసుహైకోర్టు వారి యభిప్రాయమును యాక్షేపింపుచు యలహాబాదు హైకోర్టువారి యభిప్రాయముప్రకారమే వారుకూడ తీర్పు నిచ్చిరి. 37. అ 604 ప్రి. కౌ.

దీనివిషయమై వివరముగా ముందు సోదరుని మనుమనియొక్క వారసత్వపు హక్కువిమర్శనలో తెలియగలదు.

## 2 సమానోదకులు.

సమానోదకులు నూటనలుబదియేడుమందివరకుగలరు వారెవరనిన మొదటినెంబరు వంశవృక్షముప్రకారము

1. చనిపోయినవానిదిగువను 8 వ తరమునుంచి 14 వ తరమాఖరువరకు యనగా 33 నెంబరునుండి దిగువను 7 తరములవారు వీరు 7 గురు.

2. చనిపోయినవాని పైమూడుతరములవారిలో ప్రతివాని యొక్క సంతతివారిలో దిగువ 8 వ తరమునుండి పదునాలుగవ తరమాఖరువరకు గలవారు అనగా 37. 41. 45. 49 53 57 నెంబరుల వారినుండి క్రమముగా దిగువను యేడేశితరములవారు (6 × 7=42) వీరు నలుబదియిద్దరు.

3. చనిపోయినవాని కెగువను యెనిమిదవతరమునుండి పదునాలుగవతరమాఖరువరకు యనగా 28 నెంబరునుండి యెగువను యేడు తరములువారు, వీరేడుగురు.

4. చనిపోయినవానికెగువను 8 వ తరమునుండి యనగా 28 నెంబరునుండి యెగువను 14 వ తరమాఖరువరకుగల 7 గురియొక్క



13 వ తరములువరకుగల సంతతివారు (7 × 13=91)తొంబదియొక్కమంది; మొత్తము నూటనలుబదియేడుగురు.

ఈసమానోదకులలో చనిపోయినవానికి దగ్గిరవాసనతతివారు దూరమువాని సంతతివారికంటే వారసత్వమునకు ముందు హక్కు కలిగియుందురు. మరియును యొకనిసంతతివారిలో దగ్గిరవారు దూరపు వారికంటే యాధిక్యతను వహింతురుగనుక పైనియుదహరించిన నాలుగు తరగతుల సమానోదకులలోగల వారసత్వపుక్రమమును సులభముగా నూహించవచ్చును.

పైనయుదహరించిన వంశవృక్షములోని జాబితాలప్రకారము గోత్రజసపిండులలో ముఖ్యులయినవారిని పేర్కొని వారివారివారసత్వపు ప్రాముఖ్యతను పరిశీలించుదము.

1 కుమారుడు—వారసులందరిలోనూ పుత్రుడు ముఖ్యము చనిపోయినవాని కుమారులు యేకగర్భజనితులైనను భిన్నోదరులయినను వానియాస్తిని సమానముగా పొందుదురు. అయితే తండ్రిచనిపోవునరికి వానితో సమిష్టిగాయున్న కుమారులు వానిస్వార్జితమైన స్వంత యాస్తిని పొందుదురుగాని వ్యష్టిగాయున్నవారు (విడిపోయినవారు) యట్టియాస్తిని పొందజాలరు. సమిష్టికుమారులు లేనపుడు వ్యష్టికుమారులు పొందుదురు 30 మ 348 (350) 32 మ 377 (381)

## దత్తుడు.

దత్తుడు దత్తతతండ్రి యావదాస్తికి వారసుడున్నాడు గాని తండ్రిచనిపోవునరికి యౌరసపుత్రుడు కూడాయున్నయెడల యప్పుడు దత్తుడు యౌరసునిభాగములో 4 వ వంతు పొందును. అనగా నాలుగు వాటాలు యౌరసుడును యొకవాటా దత్తుడును పొందుదురు. ఇట్టి నియమము బ్రాహ్మ క్షత్రియ వైశ్యులను మొదటి మూడుజాతుల వారికిని వర్తించును గాని శూద్రులలో దత్తుడును యౌరసుడును

సమానభాగములను పొందుదురని ప్రీవీకౌన్సిలువారు తీర్మానించిరి 41 మ లా జ 33 ప్రి. కౌ

భార్యకుగాక యుంచుకొనిన స్త్రీకిజన్మించిన పుత్రుడు Illegitimate son

ఇట్టిపుత్రుడు దాశీపుత్రుడనియు గూడ పిలువబడును. ఇట్టి పుత్రుడు ద్విజులనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు మూడుజాతులలోనూ తండ్రియాస్తికి వారసు కానేరడు గాని శూద్రులలో యిట్టి పుత్రుడు యౌరసునివలెనే తండ్రియాస్తియందు వారసత్వపుహక్కు కలిగియుండును అయితే వానితల్లి వానితండ్రితో కలసి భర్తవలెనే సంబంధముకలిగి విడవకుండా కాపురముచేసియుండవలెను. వాని తండ్రికి యౌరసకుమారుడున్నయెడల తండ్రియాస్తిలో రెండువంతులు యౌరసునకును యొకవంతువానికిని జెందును. అనగా వానికి యౌరసుని వాటాలో సగమువంతుయుండలాగున తండ్రియాస్తి జెందును 34. మ. 277.

ఔరసుడుగాని పెండ్లిభార్యగాని కుమార్తెగాని కుమార్తె కుమారుడుగాని లేనియెడల తండ్రియాస్తియంతయు వానికేజెందును. వానితండ్రికి పెండ్లిభార్యయును దౌహిత్రుడును యున్నయెడల వారితో సమానముగా యాస్తినిపంచుకొనుటకు హక్కుగలిగియుండును 33 మ 226

వానితండ్రి దాయాదులతాలూకుయాస్తియందు వానికి వారసత్వపుహక్కు యుండదు. ఒకశూద్రునికి యౌరసుడును దాశీపుత్రుడును యుండగా వీరిద్దరిని మామూలుజాయింటు కుటుంబమెంబరులనుగా భావింపనగును. వీరికి మామూలుజాయింటుకుటుంబములో నెట్టిహక్కులుండునో యట్టిహక్కులుండును. అనగా యొకరు చనిపోయినయెడల సర్వైవర్షిప్పుయాస్తి మిగతా వారికి సంక్రమించును 39మ136



అట్టిసర్వైవర్షిప్పుయాస్తిని పంచుకొనునపుడు మాత్రము దాశీపుత్రునకు యౌరసునివాటాలో సగముండులాగున పంచుకొనవలయును ఒకనికి పెండ్లిభార్యావలనగాక ఖాయముగా నుంచుకొనబడిన పరస్త్రీకి బుట్టినవాని దాశీపుత్రుడనిగూడ యందురనియు యట్టిదాశీపుత్రునకు శూద్రజాతియందు తండ్రియాస్తియందు కొంతవరకు వారసత్వపుహక్కు గూడనుండుననియు తెలుసుకొనియుంటిమి. పూర్వము డబ్బుగలవానికి బానిసలుండువారు యజమానికి బానిసరాలువల్లకలిగిన వానికి బానిసపుత్రుడు లేక దాశీపుత్రుడని పిలువబడుచుండెను. ఇప్పుడు గవర్నమెంటువారు బానిసత్వమును నశింపచేసినతరువాత నొకడు ఖాయముగా నుంచుకొనినపరస్త్రీకి జన్మించినపుత్రునకు దాశీపుత్రుడని వాడుచున్నారు. ఎట్టిదాశీపుత్రుడు తనతండ్రియొక్క యాస్తియందు వారసత్వపుహక్కును బడయునో యెట్టివాడు బడయజాలడో యీ దిగువనుదహరించిన యంశములవలన స్పష్టము కాగలదు.

1 బ్రాహ్మణక్షత్రియవైశ్యులను మొదటిమూడుజాతులలోనూ దాశీపుత్రుడు తనతండ్రియాస్తికి వారసత్వమును బడయజాలడు.

2. నాల్గవజాతియగు శూద్రులలో యొకడు ఖాయముగా యొకమనిషినియుంచుకొని దానివలన పుత్రునిబడసినయెడల యట్టి పుత్రుడు తనతండ్రి యాస్తియందు వారసత్వపుహక్కునుగలిగియుండును

3 అయితే శూద్రజాతిలోనయినను వావివరుసలులేకుండా సంచరించేమనిషివలన గలిగినపుత్రునకు తండ్రియాస్తియందు వారసత్వపుహక్కు గలుగనేరదు 4 మ. హై. రి 204 (208)

ఈకేసులో మామగారును కోడలును కలియగా కలిగిన పుత్రుడు తండ్రియాస్తియందు వారసత్వపుహక్కును బడయనేరడని తీర్మానించిరి.

4 స్త్రీలకు పునర్వివాహమువ కర్తృత లేని శూద్రులలో యొక

పురుషుడు భార్యగాయుంచుకొను స్త్రీ కన్యయైయుండవలెనుగాని యిదివరలో వివాహమైయుండగూడదు. అటులయిదివరలో నొకనికి వివాహమయినదానిని మరియొకడు యుంచుకొనుటవలనగలిగిన పుత్రునకు తనతండ్రియాస్తియందు వారసత్వపుహక్కు గలుగనేరదు. 33 మ 366

ఈ తీర్పు 41 మ 44 కేసులో యంగీకరింపబడలేదు. అనగా యిదివరలో నొకస్త్రీ వివాహమాడియుండినను భర్త పోయినయెడల పునర్వివాహచట్టము ప్రకారము యామె తిరిగి వివాహమాడవచ్చును గనుక యందుకు బదులుగా మరియొకని భార్యముగా భర్తవలెయుంచుకొని వానివలన పొందిన కుమారునికి తండ్రియాస్తియందు వారసత్వపుహక్కు యుండునని యభిప్రాయము. 41. మ. 44. (పూ బెం)

5. కులములోనుంచి వెలివేయబడిన బ్రాహ్మణునికి యొకకోమటి వితంతువు యిలాకాబడి వారిరువురు భార్యాభర్తలవలె జీవించుచు పుత్రులను బడసిరి. అట్టిపుత్రులకు తండ్రి సంపాదించిన యాస్తియందు వారసత్వపు హక్కులుండునని అలహాబాదు హైకోర్టువారు యభిప్రాయపడిరి. 13. అ 573-575.

6. ఒక శూద్రునకు బ్రాహ్మణస్త్రీవలనగలుగు దాసీపుత్రునకు తండ్రి యాస్తియందు వారసత్వపు హక్కులుండవని మదరాసు హైకోర్టువారు అభిప్రాయపడిరి. 4 మ. హై. కో. 204-(215)

దాశిపుత్రుడు తండ్రికి వారసగు విధముననే దాశిపుత్రునకు సంతానముగాని భార్యగాని తల్లిగాని లేనపుడు తండ్రివారసగును. 41. మ. 44 (పూ. బెం)

ఔరసదాశీపుత్రుల హక్కుభేదములు.

ఔరసపుత్రునకును దాశీపుత్రునకును వారసత్వపుహక్కు విషయములో కొన్ని భేదములుగలవు. దాశీపుత్రునకు తండ్రిజీవితకా



లములో కుటుంబయాస్తిని పంచి యివ్వమని తగాయిదాచేసి పుచ్చుకొనుటకు హక్కులేదు. తండ్రియిష్టంమీద యిచ్చిన యివ్వవచ్చును గాని బలవంతముమీద పుచ్చుకొనుటకు హక్కులేదు. ఔరసుడు యటులగాదు. అతడు జన్మించిన తోడనే కుటుంబాస్తియందు హక్కుగలుగును గనుక తండ్రితో పంచుకొని తన వాటాను పొందుటకు హక్కుగలదు తండ్రిచనిపోయిన తర్వాత దాశీపుత్రుడు ఔరసునితో పంచుకొనుహక్కులు గలుగును. అయితే తండ్రి చనిపోవుసరికి యాతనికి స్వంతయాస్తియుండి యుండవలెనుగాని వాని దాయాదులతో సమిష్టిగా యుండియుండగూడదు. అటులవాని దాయాదులతో యవిభక్తకుటుంబమెంబరుగాయుండి సమిష్టియాస్తి మాత్రమే యనుభవించుచు చనిపోయిన యెడల సదరాస్తిని పంచుకొనుటకు దాశీపుత్రునకు హక్కు యుండదు. అట్టిసమిష్టియాస్తిని దాయాదులతో పంచుకొనుటకు యౌరసునికి మాత్రమే హక్కులుండును. 27 మ. 32-(36)
దాశీపుత్రునకును తండ్రి సోదరులు మొదలగు దాయాదులకును సాపిండసంబంధములుండవుగాని ఔరసునకును దాశీపుత్రునకును మాత్రము సాపిండసంబంధములుండును. అనగా ఔరసుడును దాశీపుత్రుడును-దాయాదులగుదురని ప్రీవీ కవున్సిలువారు తీర్మానించిరి. 18 క. 151 ప్రి. కౌ. ఇందులో యెవరుచనిపోయినను వారికుటుంబాస్తి మిగిలినవారికి చెందును. దీనిని బట్టి మదరాసు హైకోర్టుజడ్జీగాయుండి ప్రఖ్యాతిగాంచిన భాష్యంఅయ్యంగారు, దాశీపుత్రుడును, యౌరసపుత్రుడునుగల సమిష్టికుటుంబములో పురుషసంతానముగల దాసీపుత్రుడు ముందుచనిపోయినతరువాత పురుషసంతానములేని యౌరసుడు చనిపోయినయెడల వారికుటుంబాస్తి దాసీపుత్రుని పురుషసంతానమునకు సంక్రమించుననిరి. 25 మ 519-(523)

ఇందులో నొకనికి యిద్దరు దాసీపుత్రులును యాదాసీపుత్రు

లకు యౌరసకుమారులును గలరు. ముందు దాసీపుత్రులు చనిపోయిరి. తరువాత తండ్రి చనిపోయెను. తండ్రియాస్తి దాసీపుత్రులయౌరసకుమారులకు చెందుననిరి. తండ్రియాస్తిని యౌరసపుత్రులు సమానముగా పంచుకొనెదరు. దాసీపుత్రుడు యౌరసపుత్రునివాటాలో సగమియుండులాగున పంచుకొనును. ఔరసపుత్రుడు యున్నయెడల తన తండ్రియాస్తి యాతనికుమార్తెలకును, కుమార్తెకుమారులకును చెందకుండా యావదాస్తి యౌరసునికే చెందును. దాసీపుత్రుడు వారితో సమానముగా పంచుకొనును. 10 మ 334–(344).

దాసీపుత్రుడు తనతల్లియొక్క యాస్తియందుగూడ వారసత్వపుహక్కును గలిగియుండును. 2 మ. హై కో రి. 196 (201)

ఒకస్త్రీకి యొకపురుషునివల్ల యిరువురు కుమార్తెలును మరియొకపురుషునివలన యొకకుమారుడును గలరు. ఇట్టిస్థితిలో యామె చనిపోయినయెడల యామెయాస్తి యామెకుమార్తెలకు చెందును 21 మ 40.

2. కుమారుని కుమారుడు (మనుమడు)

చనిపోయినవానికి కుమారులు లేనియెడల కుమారుని కుమారునికి వానియాస్తి చెందును.

3. కుమారుని కుమారుని కుమారుడు (మునిమనుమడు)

చనిపోయినవానికి ముందుకుమారుడు వారసుడనియు కుమారుడు లేనియెడల కుమారునికుమారుడు వారసనియు యతనూ లేనియెడల యతనికుమారుడు (మునిమనుమడు) వారసనియు తెలుసుకొనియుంటిమి. అయితే యొకడుచనిపోవునప్పటికి యాతని విభక్తకుమారుడును మరియొకవిభక్తకుమారుని కుమారులును (మనుమలు) మూడవవిభక్తకు



మారుని మనుమలును (మునిమనుమలు) గలరు. ఇట్టిస్థితిలో కుటుంబప్రాతినిధ్యన్యాయము (Doctrine of representation) ప్రకారము చనిపోయినవానియాస్తి యప్పటికి జీవించియున్న కుమారునికిని పయిన యుదహరించిన చనిపోయిన కుమారుల కుమారులకును మనుమలకును యనగా వానికుటుంబములో విడిపోయిన ముగ్గురుకుమారుల శాఖలవారికిని మూడుసమానవాటాలుగా సంక్రమించును (Per stirpes) ఇట్టిన్యాయమును 2వ యధ్యాయములో సమిష్టికుటుంబాస్తి సంక్రమణక్రమములో తెలిసికొనియుంటిమి. ఇది సమిష్టికుటుంబాస్తి సంక్రమణవిషయములో యెటులనో స్వంతయాస్తి వారసత్వేనా సంక్రమణ విషయములోగూడ యటులనే వర్తించును. కనుక యీన్యాయము దగ్గరవారసుడు, దూరులను వారసత్వమునుండి తొలగింతురను న్యాయమునకొకమినహాయింపు (Exception) గా చెప్పబడుచున్నది. దీనినిబట్టి శూద్రులలో యొక్క దాసీపుత్రుని యౌరసకుమారునకు తన తాతగారియాస్తి యందు తనతండ్రికి యెట్టివారసత్వపుహక్కులుండునో యట్టిహక్కులుండునని యూహింపనగును. శూద్రులలో యిద్దరువిభక్తసోదరులుండగా యందులో నొకనికి దాసీపుత్రులుండి వారు యౌరసకుమారులను బడసి తండ్రిజీవించియుండగానే చనిపోయిరి. తరువాత తండ్రి చనిపోయెను. వానియాస్తి దాసీపుత్రుల యౌరసకుమారుల స్వాధీనములో యున్నందున సదరాస్తికొరకు వానివిభక్తసోదరుడు తాను ముఖ్యవారసుడని చెప్పుచు వారిపైని దావాచేయగా మనుమలు దాసీపుత్రుల కుమారులైనను వాదికంటే వారే ముఖ్యవారసులని తీర్మానింపబడి వాదిదావా కొట్టివేయబడెను. 25 మ 519.

4. భార్య (వితంతువు)

మునిమనుమనితరువాత వారసు భార్య అనగా చనిపోయినవాని పురుషసంతతి (కుమారులు మనుమలు మునిమనుమలు) లేనపుడు

భార్యా వారసయగును. మితాక్షర న్యాయము ప్రకారము భార్య భర్తయొక్క యర్ధశరీరము గనుక దాని సపిండురాలుగా నెన్నబడి యామెకు వారసత్వపుహక్కు నంగీకరింపబడెను. 1912 మ. వి నో 1166 భార్యకు భర్తయు, భర్తకు భార్యయు పరస్పరము సపిండులగుచున్నారు. 15 మ. ల. జ 446 ప్రి. కౌ. భార్యకు యిట్టివారసత్వపుహక్కు భర్త కుటుంబములోనుంచి విభక్తమై చనిపోయినప్పుడును భర్త స్వార్జితము లేక స్వంతయాస్తిగలిగి చనిపోయినపుడును నుండునుగాని భర్తవాని కుటుంబములో సమిష్టిగానుండి స్వంతయాస్తి లేక చనిపోయినయెడల భార్యకిట్టిహక్కు కలుగనేరదు. యపుడు మనోవృత్తికిమాత్రమే హక్కు యుండును. భర్తయాస్తియందే భార్యకు వారసత్వపుహక్కులుండును గాని భర్తయొక్క యన్నదమ్ములకుగాని మరియితర దాయాదులకుగాని యామె వారసు కానేరదు. ఒకరికంటె యెక్కువమంది భార్యలుగల పురుషుడు చనిపోయినయెడల వానియాస్తి వాని భార్యలకందరకును సమిష్టిగా సంక్రమించును. అపుడు యాభార్యలలో నెవరుచనిపోయినను మిగతాభార్యలకు సదరాస్తి చెందుచుండును. ఈవిషయములో సమిష్టికుమారులవలెనే యాస్తిని భార్యలు యనుభవించవచ్చును. వారిలోవారికి సమిష్టిగానుండటకు యిష్టములేనియెడల యాస్తిని పంచుకొనవచ్చునుగాని వారివారి వాటాలయాస్తులను పురుషులవలె దానవిక్రయాది యన్యాక్రాంతములు చేయుటకుతగిన స్వాతంత్ర్యముండదు. అనగా భార్యలకు భర్తయాస్తి వారసత్వమురీత్యా దఖలుపడినపుడు సదరాస్తియందు వారికి యావజ్జీవము యనుభవించు మితమయిన హక్కులుండునుగాని దానవిక్రయాది యన్యాక్రాంతములు చేయుటకు స్వతంత్రమయిన పూర్ణాహక్కులుండనేరవు. అయితే యట్టి యన్యాక్రాంతము లేమయిన చేసినయెడల యవి వారి జీవితానంతరమువరకుమాత్రమే చెల్లునుగాని యటుతరువాత చెల్లనేరవు. వారిజీవి



తానంతరమున యట్టియాస్తి శాస్త్రప్రకారము యిదివరలో చనిపోయిన భర్తకు భార్యలుగూడ చనిపోవుసరికిగల మామూలువారసులకు చెందునుగనుక యట్టివారసులహక్కులకు వ్యతిరేకముగా స్త్రీవారసులుచేసిన యన్యాక్రాంతములు చెల్లనేరవు. స్త్రీలకు వారసత్వము రీత్యా దఖలుపడినయాస్తి యందుగల హక్కులవిషయమై ముందు వేరే చర్చించబడునుగాన ప్రస్తుతమిచట నింతటితో ముగించడమయినది.

చనిపోయినవాని వితంతువు వ్యభిచరించుచున్నయెడల యామె భర్తయాస్తి యామెకు సంక్రమించనేరదని యిదివరలో తెలుసుకొని యుంటిమి. అయితే భర్తపోవుసరికి పతివ్రతగా నుండినయెడల యతని యాస్తి యామెకు సంక్రమించును. అటులసంక్రమించిన యాస్తి తిరిగి పోనేరదు. కనుక తరువాత వ్యభిచారమువలన యాస్తి పోనేరదు. 24 మ. 441.

కాని యామె పునర్వివాహము చేసుకొనినయెడల యామెకు యిదివరలో సంక్రమించిన భర్తయొక్క యాస్తి పునర్వివాహమాడిన క్షణముననే యామెభర్తవారసులకు సంక్రమించును. 28. మ. 425. దీనికి కారణమేమన భార్య భర్తయొక్క యర్ధశరీరిగనుక యతను చనిపోయినవెంటనే యతని యాస్తి భార్యకు సంక్రమించెను. అట్టిభార్య పునర్వివాహమాడినపుడు మొదటిభర్తకు యర్ధశరీరి కానేరదు గనుక యపుడు యాస్తికిసంబంధించినంతవరకు యామెచనిపోయినటుల నెంచబడి యాస్తి భర్తవారసులకు సంక్రమించును. కాని యట్టిపునర్వివాహమువలన యామెకు మొదటిభర్తవలనగలిగిన కుమారుని యాస్తిని వారసత్వేనా పొందుట కభ్యంతరములేదు. 28 మ. 425.

దీనినిబట్టి భర్తయాస్తి భార్యకు సంక్రమించినతరువాత భార్య వ్యభిచరించినను యాస్తి పోనేరదనే పైన యుదహరించినతీర్పు (24.మ

441) యెంతవఱకు సబబుగానున్నదో యాలోచింపతగిన యంశమై యున్నది.

పునర్వివాహమాడుటకుముందు యొకనిభార్య కులముచెడి యితరమతము నవలంబించిన యెడలగూడ తనకు యిదివరలో సంక్రమించిన భర్తయాస్తిని కోలుపోవదనిరి. 41 మ. 1078 (పూ. బెం)

## 5 కుమార్తెలు

భార్యతరువాత కుమార్తె వారసగును భార్యయున్నంతకాలము భర్తయాస్తి కుమార్తెకు సంక్రమించనేరదు. చనిపోయినవానికి భార్యలు యెంతమందియున్నను వారందరు గతించిన తర్వాతనే కుమార్తెకు వానియాస్తి సంక్రమించును గాని భార్యలలో యెవరుయున్నను కుమార్తెకువానియాస్తి సంక్రమించనేరదు. కుమార్తెలలో వివాహముకానివారు వివాహమైన వారికంటెను ముఖ్యులు. అనగా వివాహముకానివారికి ముందువారసత్వపుయాస్తి సంక్రమించును గాని వారియనంతరము వివాహమయిన కుమార్తెలున్నయెడల వారికి సంక్రమించును. బొంబాయిలో నటులగాదు. ఒకకుమార్తెకు యాస్తిసంక్రమించునపుడు యదిపూర్ణహక్కులతో సంక్రమించును గనుక యామెయనంతరము యామె వారసులకే సంక్రమించునుగాని యామెతండ్రి వారసులకు సంక్రమించనేరదు. చనిపోయినవానికి యందరును వివాహమైన కుమార్తెలే యున్నపుడు యాకుమార్తెలలో ముందు బీదకుమార్తెలకును తరువాత భాగ్యవంతులకును తండ్రియాస్తి సంక్రమించుననే న్యాయముగలదు గాని యట్టిన్యాయము ప్రస్తుతమిచట యంతగా యమలులో నున్నటుల కనుపించదు సంతానము యున్న కుమార్తెయును సంతానములేని కుమార్తెయును గూడయిచట తండ్రికి సమానవారసులగుచున్నారు. గాన తండ్రిచనిపోవుసరికి సంతానముగలిగిన లేక సంతానముగలుగుటకు యవకాశముగల



సువాసినీ (భర్తయున్నస్త్రీ) కుమార్తెయును సంతానములేని, లేక సంతానము కలుగుటకు యవకాశములేని వితంతు (భర్తలేని) కుమార్తెయు యున్నయెడల వారిరువురును యితనికి సమానవారసులగుదురు చనిపోయినవానికి కుమార్తెలు వారసులగునపుడు వారు యతనియాస్తి సమిష్టిగా పొందుదురు యట్టియాస్తిని వారుపంచుకొనుటకు గూడ హక్కులుండునుగాని యట్టికుమార్తెలలో యెవరు కాలముచేసినను యామె యాస్తి మిగతాకుమార్తెలకు సంక్రమించును By survivor-ship కుమార్తెలపంపకము వారిజీవితకాలములో మాత్రమమలులో యుండునుగాని వారియనంతరవారసులను బాధించనేరదు. చనిపోయిన వానియాస్తి వానిభార్యలకు సంక్రమించిన నెట్లోయటులనే కుమార్తెలకు సంక్రమించునపుడును మితమైనహక్కులతో సంక్రమించును గాని పూర్ణమైనహక్కులతో సంక్రమించనేరదు. గనుక వారికి యట్టి యాస్తియందు దానవిక్రయాది సర్వస్వాతంత్రములు గలుగనేరవు. తండ్రియాస్తి కుమార్తెలకు సంక్రమించునపుడు వానికుమార్తెలందరు చనిపోవువరకు వానియాస్తియొక కుమార్తె చనిపోవునపుడు యామె హక్కు మిగతాకుమార్తెలకు సమిష్టికుటుంబాస్తి సంక్రమణన్యాయము ప్రకారము (Doctrine of survivorship) వరుసగా సంక్రమించుచు యొకరితరువాత నొకరు యందరుకుమార్తెలు గతించినతరువాత యప్పుడు తండ్రియాస్తి యావత్తు యిప్పటికి యనగా వానికుమార్తెలందరు గతించుసరికి యితనికిగల వారసులకు సంక్రమించును. కుమార్తెలకు వారసత్వమురీత్యా సంక్రమించిన యాస్తియందు వారికిగల హక్కు బాధ్యతలవిషయమై వేరేచర్చింపబడునుగాన యిచ్చట తెలుపనవసరములేదు. వ్యభిచారదోషమువలన వారసత్వమున కనర్హులనే న్యాయము భార్యలకేగాని కుమార్తెలకుగాని మరియితరస్త్రీ వారసులకుగాని వర్తించదు. 5 మ 149 (156) 31 మ. 100

### 6. కుమార్తె కుమారుడు. దౌహిత్రుడు.

చనిపోయినవానికి కుమార్తె కుమారుడు లేక దౌహిత్రుడు తన తల్లియగు స్త్రీ ద్వారా సపిండబాంధవ్యము గలవాడు గాన యతనుచనిపోయినవానికి భిన్నగోత్రజసపిండుడు లేక బంధువుడుయగును. అయితే న్యాయశాస్త్రముప్రకారముపూర్వముదౌహిత్రుడుయౌరసపుత్రునితో సమానునిగా నెంచబడుచుండెను. పూర్వము పురుషసంతతిలేనివారు తమకుమార్తెలలో నొకరికిగలుగు పుత్రుని తండ్రియొక్క పుత్రునిగా భావించియిచ్చుటకు యామె వివాహకాలమందే దంపతులతో యేర్పఱచుకొని యటుల పరస్పరమువాగ్దానము చేసుకొనినయెడల యామెకు గలుగుపుత్రుడు తండ్రియొక్క యౌరసపుత్రునివంటివాడని శాస్త్రోక్తముగా నెంచు యాచారము కలిగియుండెను. ఇట్టియాచారము యిప్పుడంతగా యమలులో లేకపోయినను దానినిబట్టి యిపుడు దౌహిత్రుడు బంధువైనను గోత్రజసపిండులందరకంటెను వారసత్వములో ప్రాముఖ్యమయిన పదవినిబొందియుండెను. అనగా దౌహిత్రుడు యిపుడు వారసత్వములో చనిపోయినవానితల్లిదండ్రులకంటెను ముఖ్యమయిన వారసుగా నున్నాడు గనుక చనిపోయినవానికి కుమార్తె తరువాత దౌహిత్రుడు వారసుగా ముందువచ్చును. దౌహిత్రుడులేనియెడల చనిపోయినవానికి తల్లిదండ్రులు వారసులగుదురు. దౌహిత్రునకు తనమాతామహునితాలూకుసొత్తు వారసత్వమురీత్యా సంక్రమించవలెననిన యతనిమాతామహునికుమార్తెలందరును గతించియుండవలెను. అనగా మాతామహునికుమార్తెలలోయెవరుజీవించియున్నను యతనికి దౌహిత్రుడు వారసుకానేరడు. మాతామహుని యాస్తి యతనుచనిపోయినవెంటనే యతనికుమార్తెలకు సంక్రమించి యాకుమార్తెలందరు చనిపోవువరకును యతనియాస్తి యాకుమార్తెలలోనే చనిపోయినవారు పోగామిగిలినవారికి సంక్రమించుచు చివరకు



యందరుకుమార్తెలు గతించినతరువాత వారికుమారుల కందరకు ప్రత్యేకమయిన సమానవాటాలను సంక్రమించును Per eapita. గాని వారితల్లులుయనగా చనిపోయినవాని కుమార్తెలసంఖ్యనుబట్టి మెట్టువాటాలను Per stirpes సంక్రమించనేరదు. గనుక యమలులోయనగా యీదౌహిత్రులలో నెవరైన తనమాతామహునికుమార్తెలలో నొకరయినను జీవించియుండగా కాలముచేసినయెడల యతని పురుషసంతానమువారు యతనిస్థానే యతని మాతామహునికి దగ్గిరవారసులు కానేరరు. అపుడు వారు యట్టిమాతామహునికి మరియితర దౌహిత్రులుగాని గోత్రజసపిండులుగాని లేనపుడు బంధువులుగా వారసులుగావచ్చును. ఒకనియాస్తి యతనియనంతరము యతనికుమార్తెల కుమారులకు (దౌహిత్రులకు) వారసత్వేనా సంక్రమించునపుడు వారిలో వారికందరకు యట్టియాస్తియందు సమిష్టిహక్కులు (rights of survivor ship) యుండనేరవు. అనగా వారిలో వారికి సమిష్టికుటుంబమెంబర్లవలె సదరాస్తియందు జాయింటుహక్కులుండనేరవు. (As joint tenants) వ్యష్టియైన కుటుంబమెంబరులు వారివారియిష్టముమీదయాస్తి మాత్రము యుమ్మడిగాయుంచుకొనినవారివలెనేమాతామహునియాస్తి యతని దౌహిత్రులకు చెందునపుడును వారియందరకును ప్రత్యేకమయిన హక్కులుగలుగును Rights of tenants-in-common కాని చనిపోయినవాని దౌహిత్రులలో యొకేకుమార్తె కుమారులు వారిలో వారు సమిష్టిగాయున్నకాలములో మాతామహునియాస్తి వారికి సంక్రమించునపుడుమాత్రము వారికిసదరాస్తియందు సమిష్టిహక్కులు గలుగును. 25 మ 678 ప్రి కౌ.

మాతామహునియాస్తి దౌహిత్రునకు సంక్రమించునపుడు కుమార్తెలకువలె మితమయినహక్కులతోగాక పూర్ణమయినహక్కులతో సంక్రమించును. గనుక మాతామహునియాస్తి దౌహిత్రులకు

సంక్రమించినతరువాత యాదౌహిత్రుడు గతించినయెడల యట్టియాస్తి యాదౌహిత్రుని వారసులకు చెందునుగాని యదితిరిగి మాతామహుని వారసులకు సంక్రమించనేరదు. 19 మ 451 ప్రి. కౌ.

7. తల్లి.

మితాక్షరన్యాయముప్రకారము దౌహిత్రునితరువాత ముఖ్య వారసు తల్లియగును. మనదేశములో తల్లి దండ్రి కంటే ముఖ్యవార సగును 1 మ 134 ప్రి. కౌ.

జనకతల్లియేగాక దత్తతతల్లిగూడ ముఖ్యవారసగును. 23 మ 1 ప్రి. కౌ. దీనినిబట్టి యొకనికి భార్యలు యిరువురుగాని యంతకంటె యెక్కువమందిగాని భార్యలు యున్నపుడు వారిలో యేభార్యతో కలసి యతను దత్తతస్వీకారము చేసుకొనునో యామెదత్తునకు తల్లియు మిగతావారు సవతితల్లులును యగుదురుగాన యామెమాత్రమే యతనికి వారసుగాని మిగతావారు వారసులు కానేరరు. సవతితల్లి (Step-mother) సవతి కుమారునికి ముఖ్యవారసు కానేరదు. 8 మ 133 కాని మనరాజధానిలో సవతితల్లి జనక, దత్తత, తల్లులవలె యంతదగ్గరవారసు కాకపోయినను అనగా గోత్రజ సపిండవారసు కాకపోయినను బాధుపుగా దూరపువారసు కావచ్చునని కొన్నితీర్పులు గలవు. 8 మ 107; 5 మ 29; 5 మ 32 కుమారునియాస్తి తల్లికి వారసత్వేనా సంక్రమించినపుడు యామెకు సదరాస్తియందు మితమయిన హక్కులుండునుగాని సంపూర్ణమయిన హక్కులు గలుగనేరవు. ఆమె యనంతరము తిరిగి కుమారునివారసులకు చెందును.

8. తండ్రి.

తల్లిదండ్రులలో తండ్రికంటె తల్లికి రక్తసంబంధ మెక్కువగను క మితాక్షరన్యాయముప్రకారము తండ్రి తల్లితరువాత వారసు కావ



చ్చును. అనగా ముందు తల్లి ముఖ్యవారసు తల్లిలేనియెడల తండ్రి వారసగును.

9. సోదరుడు.

తండ్రితరువాత ముఖ్యవారసుడు సోదరుడగును. సోదరులలో యేకగర్భజనితులు భిన్నోదరసోదరులకంటె ముఖ్యవారసులు. అనగా చనిపోయినవానికి యొక యేకగర్భజనితుడగు సోదరుడును యొకభిన్నోదరసోదరుడును యున్నయెడల వానియాస్తి యేకగర్భజనితుడగు సోదరునికి (ఒకతల్లికిబుట్టినవాడు— Uterine brother) వారసత్వేనా సంక్రమించునుగాని భిన్నోదరసోదరునికి (మారిటితల్లికి బుట్టినవాడు—Step brother) సంక్రమించనేరదు. 20 మ. ల. జ 604 ప్రి. కౌ.

ఏకగర్భజనితుడు లేనపుడు భిన్నోదరసోదరునికి సంక్రమించును మరియు నేకగర్భజనితులగు సోదరులలో చనిపోయినవానితో యతను పోవుసరికి కలసి సమిష్టిగాయుండినవారు, విడిపోయినవారికంటె ముఖ్యులు. అనగా చనిపోయినవానియాస్తి యతను పోవుసరికి వానితో కలసి సమిష్టిగాయున్న సోదరులకు సంక్రమించును. వారు లేనపుడు విడిపోయినవారికి సంక్రమించును. అటులనె చనిపోయినవారికి భిన్నోదరసోదరులుమాత్రమే యున్నపుడు వారిలో చనిపోయినవానితో యతను పోవుసరికి కలసి సమిష్టిగా యుండినవారికి యతనియాస్తియందు సంక్రమించును. వారు లేనియెడల విడిపోయినవారికి సంక్రమించును.

చనిపోయినవానితో యతను పోవుసరికి కలిసి సమిష్టిగాయుండిన భిన్నోదరసోదరులును విడిపోయిన యేకగర్భజనితులగు సోదరులును గూడ యుండినయెడల యపుడు భిన్నోదరులకును యేకగర్భజనితులకును వానియాస్తి సమానముగా సంక్రమించును. అనగా వానియాస్తి యందరుసోదరులును సమానముగా పంచుకొందురు. (పండిత రాజ

కుమార సర్వాధికారిగారు.) ఒకడు చనిపోవుసరికి వానికి వ్యష్టియైన యిరువురు యేకగర్భజనిత సోదరులును యొకసమిష్టిభిన్నోదరసోదరుని కుమారుడును గలరు. అనగా మొదట వీరికుటుంబమువారందరు వ్యష్టియై విడిపోయినతరువాత యిరువురు భిన్నోదరసోదరులుమాత్రము తిరిగి కలిసి సమిష్టికుటుంబముగా యేర్పడియుండువారు. అందులో యిప్పుడు చనిపోయినవాడొకడై యుండెను. ఆతనితో సమిష్టిగాయున్న భిన్నోదరసోదరుడు యదివరలోనే చనిపోయెనుగాని వాని కుమారుడు యిపుడు చనిపోయినవానితో యతడు పోవువరకును సమిష్టిగా యుండెను. ఇపుడు చనిపోయినవానికి సంతానములేదు. ఇట్టి స్థితిలో చనిపోయినవానియాస్తి సమిష్టిగాయున్న భిన్నోదరసోదరుని కుమారునికిని వ్యష్టిగాయున్న యిరువురు ఏకగర్భజనితసోదరులకును సమానముగా సంక్రమించునని హైకోర్టువారు తీర్మానించిరి. 16 మ 440. మితాక్షరన్యాయముప్రకారము సోదరులలో వారసత్వపుక్రమము యెటులనిన ముందు ఏకగర్భజనితుడగు సోదరుడు తరువాత భిన్నోదరసోదరుడు పిమ్మట యేకగర్భజనితుడగు సోదరునికుమారుడు యటుపిమ్మట భిన్నోదరసోదరుని కుమారుడు. కానివయిన వుదహరించిన కేసులోవలె సమిష్టిగాయున్న సోదరులలో యెవడుపోయినను వానియాస్తి కుటుంబప్రాతినిధ్యన్యాయము ప్రకారము (Doctrine of representation) యీసమిష్టికుటుంబములో మిగిలిన వారిలో జీవించియున్న సోదరులకును అదివరలోనే చనిపోయిన సమిష్టిసోదరుల సంతానము వారికిని సమానముగా సంక్రమించును.

10 సోదరునికుమారుడు.

ఏకగర్భజనితులగు సోదరులుగాని భిన్నోదరసోదరులుగాని లేనపుడు సోదరుల కుమారులు ముఖ్యవారసు లగుదురు. వారిలో ఏకగర్భజనితులగు సోదరుల కుమారులు భిన్నోదరసోదరుల కుమారులకం



టె ముఖ్యులు. చనిపోయినవానికి సోదరులు లేనపుడు వానియాస్తి సోదరుల కుమారులందరకు జనసంఖ్యసంబంధమయిన సంక్రమణన్యాయముప్రకారము Per Capita సమానముగా సంక్రమించును. సోదరులలోవలెనే సోదరులకుమారులలోగూడ చనిపోయినవానితో సమిష్టిగాయున్నవారు వ్యష్టిగాయున్నవారికంటె ముఖ్యులు. మన దేశములో అనగా మదరాసు రాజధానిలో వారసత్వములో ఏకగర్భజనితులు భిన్నోదరుల భేధము సోదరులకును సోదరుల కుమారులకును సంబంధించినంతవరకేగాని మిగతా వారసులలో యట్టిభేదములు లేవు.

11 సోదరుని కుమారుని కుమారుడు 34

ఈవారసువిషయములో మదరాసుహైకోర్టువారును అలహాబాదుహైకోర్టువారును భిన్నాభిప్రాయులయిరి. మదరాసుహైకోర్టువారు సోదరునికుమారునితరువాత తండ్రి తల్లి ముఖ్యవారసనియును, అటులనే పినతండ్రి లేక పెత్తండ్రికుమారునితరువాత తండ్రితండ్రితల్లి వారసనియు యిటులనే చనిపోయినవానికి పయిని ఏడుతరములవరకునుకూడా వానిపూర్వుల కుమారుని కుమారునివరకేగాని కుమారుని కుమారుని కుమారునకు కూడ అనగా ప్రతిపూర్వునియొక్క మునిమనుమనిగూడా ముందువారసుగా నెన్నగూడదనియు యభిప్రాయపడిరి.

అలహాబాదు హైకోర్టువారు యటుల కాదనిరి. చనిపోయిన వాని మునిమనుమడు యెటుల ముందు వారసగునో యటులనే వాని పూర్వులలో మూడుతరములవరకు ప్రతివానియొక్క మునిమనుమని ముందు వారసుగానెంచి యతనులేనియెడల పైపూర్వుని వారసుగా నెంచవలయునని వారి యభిప్రాయము. ఇట్టియభిప్రాయభేదము మితాక్షరములోని యొకసూత్రమునకు యర్థము చేయడములోకలిగెను. యాజ్ఞవల్క్యస్మృతి పురుషసంతానము

లేనివానికి వారసత్వపుక్రమము విషయమై యిటుల చెప్పబడియున్నది. "శాస్త్రప్రకారము పెండ్లియాడినభార్య, కుమార్తెలు, తల్లిదండ్రులు, సోదరులు, వారికుమారులు, దాయాదులు, బంధువులు, శిష్యుడు, సహాధ్యాయుడు, యీవరుసను చనిపోయినవానికి మొదటివాడు లేనియెడల రెండవవాడు వారసుడగుచుండును" గనుక యిట సోదరులకుమారులు మాత్రము పేర్కొనబడిరిగాని వారిమనుమలు పేర్కొనబడలేదు గాన "కుమారులు" యనుశబ్దమునకు యెక్కువ యర్థముచేసి మనుమలనుకూడ వర్తింపజేసి వారినిముందువారసులనుగా నెంచకూడదని మదరాసుహైకోర్టువారి యభిప్రాయము. అందువలన యీయభిప్రాయముప్రకారము చనిపోయినవారి సోదరులకుమారులు, తండ్రిసోదరులకుమారులు, తాతసోదరులకుమారులు మొదలుగాగల పైయేడుతరములవారును ముందు ముఖ్యవారసులగుదురుగాని వారిమనుమలను గూడ ముందువారసులలో చేర్చుటకు వీలులేదు. 5 మ 291-35 మ 152

కాని పైనియుదహరించిన యాజ్ఞవల్క్యసూత్రములో స్పష్టముగా పేర్కొనబడిన వారసులలో చేరనిదాయాదులలో యెవరు ముఖ్యవారసులని వివాదగలిగినపుడు చనిపోయినవానికిదగ్గిరగాయున్న వంశశాఖలోనివారు దూరపువంశశాఖలోని వారికంటె ముఖ్యవారసులని యెంచవలసియుండును. 35 మ 152 10 మ. ల. ట. 266

ఉ—మొదటనెంబరు వంశవృక్షములో చనిపోయినవానియొక్క సోదరునివంశశాఖవారగు 34, 35, 36, 37, నెంబర్లవారు వానియొక్కతండ్రిసోదరుని వంశశాఖవారగు 38, 39, 40 41 నెంబర్లవారికంటె ముఖ్యవారసులని యెంచవలసియుండును.

అయితే చనిపోయినవానియొక్క సోదరునిమనుమడగు 34 వ నెంబరువానికంటె వానియొక్క తండ్రిసోదరుని కుమారుడగు 14 వ



నెంబరువాడు యెటులముఖ్యవారసుడగుననే ప్రశ్నకు జవాబు యాజ్ఞవల్క్యస్మృతిలో స్పష్టముగా చెప్పబడినవారసులలోని 14 రు చేరును 34 నెంబరు చేరలేదని చెప్పవలసియుండును. అలహాబాదుహైకోర్టువారు యాజ్ఞవల్క్యస్మృతిలో పేర్కొనబడినవారసుల జాబితాలోని "కుమారులు" యనుశబ్దమునకు సంతానమని యర్థముచేసి యట్టిశబ్దము ప్రతిపూర్వుని "మునిమనుమలకు" గూడవర్తించుననిరి. యాజ్ఞవల్క్యస్మృతిలో నుదహరించినవారసుల జాబితాపూర్తియైన జాబితా కాదుగనుక వారసులను పేర్కొనుటలో తరగతికొకని చొప్పున యుదాహరణముగా పేర్కొనబడెను గాన చనిపోయినవానికి ముందు వానిసంతానము యెటులముఖ్యవారసులో వారులేనపుడు యతనితండ్రి పురుషసంతానమును వారులేనపుడు వానితండ్రితండ్రి పురుషసంతానమును యనగా పైప్రతిశాఖయందును మూడంతరవులవరకూ ముఖ్యవారసులని యభిప్రాయపడిరి. 24 అ 128. ఇందువలనే మొదటినెంబరు వంశవృక్షమునకును రెండవనెంబరువంశవృక్షమునకును భేదముగలిగెను. రెండువంశవృక్షములను పరిశీలించినయెడల వానిలోగల భేదములను గ్రహించుట యతిసులభమగును.

చివరకు యలహాబాదుహైకోర్టునుండి ప్రివీకవున్సిలువారికి యప్పీలుకాబడిన 34 అ 663 నెంబరు కేసులో ప్రివీకవున్సిలువారు గూడా యలహాబాదుహైకోర్టువారి యభిప్రాయమునే నామోదించిరి. 37. అ. 604. ప్రి. కౌ. అయితే యందులో న్యాయాధిపతులు మదరాసు హైకోర్టువారియభిప్రాయమును కొంచెము యాక్షేపించినటులయగుపడుచున్నను చివరకు వారుయిచ్చినతీర్పులలో బెనారసుకువర్తించెడి మితాక్షరన్యాయముప్రకారమని యుండుటచే మదరాసుహైకోర్టువారి తీర్పులను రద్దుచేయనటుల యూహింపనగును. మొదటినెంబరు వంశవృక్షమువలన మదరాసుహైకోర్టువారి యభిప్రాయముప్రకారమువార

సత్వపుక్రమమును, రెండవ నెంబరు వంశవృక్షమువలన అలహాబాదు హైకోర్టువారి యభిప్రాయముప్రకారము వారసత్వపుక్రమమును, స్పష్టముగా తెలియుచున్నను తిరిగి యీసగోత్రజపిండులగు వారసులని చటవరుసగా వివరింపనగును. ప్రతివారసునకును మొదటగల నెంబరు అలహాబాదుహైకోర్టువారి యభిప్రాయము ననుసరించిన వరుసనెంబరనియు చివర నెంబరు మదరాసుహైకోర్టువారి యభిప్రాయముననుసరించిన వరుసనెంబరనియు యూహించునది. ఇంతటినుంచి మదరాసుహైకోర్టువారుగూడ యలహాబాదు హైకోర్టువారి యభిప్రాయము ప్రకారముయనగా ప్రివికౌన్సిలువారి యభిప్రాయముప్రకారముతమయభిప్రాయమును మార్చుకొనవచ్చును గనుక రెండుయభిప్రాయముల ప్రకారము వారసత్వపుక్రమమును తెలిసియుండుటమంచిది. అలహాబాదు హైకోర్టువారి యభిప్రాయముప్రకారము 11 వ నెంబరు వారసగు సోదరుని కుమారుని కుమారుడు మదరాసుహైకోర్టువారి యభిప్రాయముప్రకారము 34 నెంబరు వారసగును. ఇటులనే రెండువంశవృక్షములలోని వారసులయొక్క క్రమభేదములను గ్రహించునది.

12 తండ్రితల్లి 11
13 తండ్రితండ్రి 12
14 తండ్రియొక్క సోదరుడు 13
15 తండ్రిసోదరునికుమారుడు 14
16 తండ్రిసోదరుని కుమారునికుమారుడు 38
17 తండ్రి తండ్రితల్లి 15
18 తండ్రితండ్రితండ్రి 16
19 తండ్రితండ్రిసోదరుడు 17
20 తండ్రితండ్రిసోదరుని కుమారుడు 18
21 తండ్రితండ్రిసోదరునికుమారునికుమారుడు 42



22 కుమారికుమారుని కుమారునికుమారుడు 31
23 కుమారునికుమారునికుమారునికుమారునికుమారుడు 32
24 కుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 33
25 సోదరుని కుమారుని కుమారుని కుమారుడు 35
26 సోదరుని కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 36
27 సోదరుని కుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 37
28 తండ్రిసోదరుని కుమారుని కుమారుని కుమారుడు 39
29 తండ్రిసోదరుని కుమారునికుమారునికుమారునికుమారుడు 40
30 తండ్రిసోదరునికుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 41
31 తండ్రి తండ్రి సోదరునికుమారుని కుమారునికుమారుడు 43
32 తండ్రి తండ్రి సోదరుని కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 44
33 తండ్రి తండ్రి సోదరుని కుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 45
34 తండ్రి తండ్రి తండ్రి తల్లి 19
35 తండ్రి తండ్రి తండ్రి తండ్రి 20
36 తండ్రి తండ్రి తండ్రి తండ్రికుమారుడు 21
37 తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుడు 22
38 తండ్రి తండ్రితండ్రితండ్రికుమారునికుమారునికుమారుడు 46
39 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తల్లి 23
40 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి 24
41 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుడు 25

42 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుడు 26

43 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమారుడు 50

44 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి తల్లి 27

45 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి 28

46 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుడు 29

47 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుడు 30

48 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమారుడు 54

49 తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 47

50 తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుడు కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 48

51 తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 49

52 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 51

53 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 52

54 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 53

55 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 55



56 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుడు. 56

57 తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 57

చనిపోయినవానికి సగోత్రజ సపిండులలో యెవరును లేనియెడల సమానోదకులు వారసులగుదురు. సగోత్రజ సపిండులను తెలియజరచు వంశవృక్షముల వెంబడిని సమానోదకులను వారి వారసత్వపు క్రమమును తెలియుటకు తగిన సులభమైన మార్గములను సూచించుచు వాంజాబితాను యిదివరలో యిచ్చియున్నందున యిచట వారి విషయమై వివరించనవసరము లేదు. గోత్రజ సపిండులును, సమానోదకులును యనగా సగోత్రజు లెవరును చనిపోయినవానికి లేనపుడు భిన్నగోత్రజ సపిండులు లేక బంధువులు వారసులగుదురు గాన వాని విషయమై యిచట తెలిసికొనవలసియున్నది.

---

# హిందూ న్యాయశాస్త్రము.

# వారసత్వము.

## ఐదవ యధ్యాయము.

పురుషులకు వారసత్వపు క్రమము రెండవ భాగము.

భిన్నగోత్రజసపిండులు లేక బంధువులు.

Cognates

మొదట పురుషులు—ఇదివరలో సగోత్రజసపిండులను జేర్చుకొని వారి వారసత్వపు క్రమమును పరిశీలించియుంటిమి. అట్టి వారసులు యెన్నితరములవారయినను చనిపోయినవానివంశములో యేకగోత్రమున బుట్టినవారై యుండిరి. అనగా చనిపోయినవానిది యేగోత్రమో యిదివరలో యుదహరించిన వారసులదికూడ యదేగోత్రమయియుండెను. చనిపోయినవానికి నేడుతరములలోపువారు గోత్రజసపిండులనియు యేడు మొదలు పదునాలుగుతరములలోపువారు సమానోదకులనియు తెలుసుకొనియున్నాము. చనిపోయినవానికిట్టి సగోత్రజులెవరునూ లేనపుడు యన్యగోత్రజులలో దగ్గిరబంధువులు వారసులగుదురు. అట్టి వారిని భిన్నగోత్రజసపిండులు లేక బంధువులని వాడుచున్నారు. ఇపుడట్టి బంధువులను జేర్చుకొని వారివారి వారసత్వపుక్రమమును నిర్ణయించవలసియున్నది. పండిత రాజకుమారసర్వాధికారిగారు బంధువులనగా స్త్రీరీత్యా రక్తసంబంధమువలన సపిండసంబంధముగలవారని వారి "హిందూన్యాయశాస్త్ర వారసత్వ"మను గ్రంథములో వ్రాసిరి. వారిని



భిన్నగోత్రజసపిండులనుటకు గారణమేమనగా వారు యన్యగోత్రములో బుట్టినను చనిపోయినవానికి సగోత్రములో బుట్టిన లేక సగోత్రీకులను పెండ్లియాడిన స్త్రీలద్వారా రక్తసంబంధముగలవారు గాన యటుల పిలువబడిరి. చనిపోయినవానికి యొకడు బంధువనుటకు రెండునిదర్శనములుండవలెను. ఒక స్త్రీరీత్యా వారిరువురకు సంబంధము కలిగియుండవలెను. అసంబంధమనునది చనిపోయినవానికతను సపిండసంబంధుడై యుండవలెను. మితాక్షరన్యాయప్రకారము బంధువులు మూడుతరగతులుగా విభజింపబడిరి.

1. ఆత్మబంధువులనగా యొకని స్వంతబంధువులు వీరు తండ్రి యొక్క తోబుట్టువులకుమారులు, తల్లియొక్క తోబుట్టువుల *కుమారులు, తల్లియొక్క సోదరులకుమారులు మొదలగువారై యున్నారు.

2. పితృబంధువులనగా తండ్రియొక్క బంధువులు. వీరు తండ్రి తండ్రియొక్క (తాత) తోబుట్టువులకుమారులు తండ్రితల్లియొక్క సోదరీలకుమారులు తండ్రితల్లియొక్క సోదరులకుమారులు మొదలగువారై యున్నారు 3 మాతృబంధువులనగా తల్లియొక్క బంధువులు వీరు తల్లితండ్రియొక్క సోదరీలకుమారులు, తల్లితల్లియొక్క సోదరులకుమారులు మొదలగువారై యున్నారు. దీనినిబట్టి యొకని బంధువులు తన స్వంతకుటుంబములోను తండ్రికుటుంబములోను తల్లికుటుంబములోను తండ్రితల్లి కుటుంబములోను తల్లి తల్లికుటుంబములోనుగలరు. పండిత రాజకుమారసర్వాధికారిగారిప్రకారం చనిపోయినవానికి యొకడు బంధువుగా వారసుకావలయునంటే యతను 1 చనిపోయినవానిసంతతికి సంబంధించినవాడుగా నైనాయుండవలెను. 2 వానితండ్రి కుటుంబములోనివాడుగానైనా యుండవలెను. 3 వానిమాతామహునికుటుంబములోనివాడుగా నైనాయుండవలెను. 4 వానితండ్రిమాతామహుని కుటుంబములోనివాడుగానైనా యుండవలెను. 5 వానితల్లి మాతా

* తల్లి తల్లియొక్క సోదరీలకుమారులు.

మహునికుటుంబములోనివాడుగానైనా యుండవలెను. ఈసంధర్భము లో మొదటిరెండుతరగతులవారును చనిపోయినవానియొక్క తండ్రి వైపునుంచివచ్చిన బంధువులనియు (Bandhus exparte paterna) మూడవతరగతివారు వానియొక్క తల్లివైపునుంచి వచ్చినబంధువులనియు Bandhus exparte matirna నాలుగోతరగతివారు తండ్రియొక్క బంధువులనియు Pitri Bandhus అయిదవతరగతివారు తల్లియొక్క బంధువులనియు Matri bandhus వాడబడుచున్నారు పీరివిషయమై ముందుయున్న బంధుకృత్యములవలన బాగుగా తెలియగలదు. మనదేశములో కొంతమందిస్త్రీలు గూడ వారసత్వపుహక్కుగలిగిన బంధువులుగా నెన్నబడుచున్నారనిగూడ ముందు తెలియగలదు.

పండితసర్వాధికారిగారు బంధువులను తెలుసుకొనుటకు యీ దిగువ మూడుపద్ధతుల నేర్పరచిరి

మొదటిపద్ధతి—వారిప్రకారము చనిపోయినవానియొక్క బంధువులనగా 1. వానినుండిమెగువనుగాని దిగువనుగాని లెఖవేయగా నాలుగంతరువులోపున స్త్రీలద్వారా సపిండసంబంధముగలవారనియు Cognate sapindas 2 వానిపైనివరుసగానున్న నలుగురిపూర్వులలో ప్రతివానినుండి యటుల దిగువకు లెక్కించగా యట్టిసంబంధముగల వారనియు యనియభిప్రాయము ఇచట పూర్వులనగా 1 చనిపోయిన వాని తండ్రివైపు పూర్వులు. 2 వానితల్లివైపు పూర్వులు 3 వాని తండ్రితల్లివైపు పూర్వులు 4 వానితల్లితల్లివైపు పూర్వులుయనియర్థము చనిపోయినవానినుండిగాని వానిపూర్వులనుండిగాని లెక్కించునపుడు నలు వానిని మినహాయించవలెను. అనగా చనిపోయినవానినుండి లెఖ వేయునపుడు చనిపోయినవానిని మినహాయించవలెను. వానియొక్క పూర్వునినుండి లెక్క వేయునపుడు యాపూర్వునివదిలివేయవలెను. అనగా వారుగాక నాలుగంతరువులని



యభిప్రాయము. దీనినిబట్టి యొకడుచనిపోయినవానికి బంధువుగా వారసగుటకు యీదిగువనుదహరించిన సంబంధమేదైన యుండవలెను.

1. వాడుచనిపోయినవాని మినహాయించి దిగువనుయనగా వానిసంతతివారిని లెక్కించగా నాలుగుతరములలోపువాడగు భిన్నగోత్రజసపిండుడై యుండవలెను. అనగా స్త్రీలమూలముగా సపిండసంబంధముకలవాడయి Cognate sapinda యుండవలెను.

2. వాడు చనిపోయినవాని మినహాయించి మెగువను యనగా వానిపూర్వులలో మొదటి నలుగురులో యెవరినుండియైనను యటుల లెక్కించగా నాలుగంతరువులలోపున స్త్రీలమూలమున సపిండబాంధవ్యముగలవాడు Cognate sapinda గా యుండవలెను.

3. వాడుచనిపోయినవానికిగాని వానితండ్రికిగాని వానితల్లికిగాని తల్లివైపు నాలుగుతరములు లోపువాడగు పూర్వికుడుగా గాని Maternal ancestor within four degrees లేక యట్టితల్లివైపు పూర్వుల సంతతివాడుగాగాని యైయుండవలెను.

రెండవపద్ధతి.

మరియు చనిపోయినవానియాస్తియందు బంధువుగా వారసత్వపుహక్కు యుండవలెననిన యీచనిపోయినవానికి యీబంధువునకును పరస్పరము తనద్వారాగాని తమతండ్రులద్వారాగాని, తమ తల్లులద్వారాగాని, సపిండసంబంధము కలిగియుండవలెను. అనగా వారసత్వమునకు యర్హతగలబంధువులనగా 1 చనిపోయిన వానినుండి మెగువనుగాని దిగువనుగాని యనగా వానిపూర్వులను గాని వానిసంతతివారినిగాని 2 వానినుండి నాలుగుతరములలోపు వారగువాని పితృసంబంధమైనపూర్వునినుండిగాని Paternal ancestor within four degrees 3 చనిపోయినవాని మాతృసంబంధమయిన

నాలుగుతరములలోపువారగుపూర్వునినుండిగాని Maternal ancestor within four degrees 4 చనిపోయినవానికి తండ్రియొక్క తల్లిసంబంధమయిన నాలుగుతరములలోపువారగు పూర్వుని Father's maternal ancestor within four degrees నుండిగాని చనిపోయినవానికి తల్లియొక్కతల్లిసంబంధమయిన నాలుగుతరములలోపువారగు పూర్వుని Mother's maternal ancestor within four degrees నుండిగాని లెక్కించగా నాలుగుతరములలోపువారగుభిన్నగోత్రజసపిండులని లేక స్త్రీమూలమునసపిండసంబంధముగలవారని Cognate sapinda సర్వాధికారిగారి యభిప్రాయమై యున్నది.

తండ్రియొక్క మాతృసంబంధమైన బంధువులవిషయములో నాలుగుతరములకు బదులుగా నైదుతరములవరకు లెక్కింపనగును. అనగా తండ్రితల్లిని మినహాయించినయెడల నాలుగుతరములవరకూ లెక్కింపనగును చనిపోయినవాడుగాని వాని పూర్వికుడుగాని తండ్రితల్లిద్వారా సంబంధముగలిగియున్నయెడల యపుడు రెండువైపులను నైదుతరములవరకును లెక్కింపనగును. ఉదాహరణము చనిపోయినవాని మనుమనికుమార్తెమనుమడు వానితండ్రితల్లిద్వారా చనిపోయినవానికి బంధువుగాన యతనువారసత్వమునకు హక్కుగలబంధువగును అనగా చనిపోయినవానిలేక వానిపూర్వికుని కుమారుని కుమారుని కుమార్తె కుమారుని కుమారుడు చనిపోయినవానికి యట్టిబంధువగునని యభిప్రాయము. ఇట్టిలెక్క చనిపోయినవాని పూర్వికులనుండి గలుగు బంధువులకేగాక చనిపోయినవానితండ్రియొక్క తల్లిపూర్వికుల వంశములోని బంధువులకుగూడ వర్తించును.

బంధువగుటకు నిదర్శనము—ఒకడుచనిపోయినవానికి వారసత్వమున కర్హతగల బంధువగుటకు యాచనిపోయినవాడు యతని మాతామహుని వంశములోనివాడుగాగాని యతనితండ్రి మాతామహుని వంశములోనివాడుగాగాని యతనితల్లి మాతామహునివంశములోనివాడుగాగానినైన యుండవలెను. దీనినిబట్టి యొకరు చనిపోయినవారికి బంధువైనది కానిది సులభముగా గ్రహించవచ్చును.



మూడవపద్ధతి

దీనివలన వారసత్వమునకెట్టిబంధువులనర్హులో తెలియును దిగువనున్న బంధుసంతతివాడగువానివిషయములో Congnate descendant చనిపోయినవాడుగాని వానిపూర్వికుడుగాని ancestor

1 అట్టిబంధువులయొక్క మాతామహునివంశమునకుగాని

2 వానితండ్రియొక్క మాతామహునివంశమునకుగాని

3 వానితల్లి మాతామహునివంశమునకుగాని చెందనియెడల యట్టిబంధువు యాచనిపోయినవాని వారసు కానేరదు

ఎగువనున్న బంధుపూర్వికుడగువాని విషయములో Cognate ascendant యట్టిబంధువు

1. చనిపోయినవానియొక్క మాతామహుని వంశమునకుగాని

2. వానితండ్రియొక్క మాతామహుని వంశమునకుగాని

3. వానితల్లియొక్క మాతామహునివంశమునకుగాని చెందనియెడల యట్టిబంధువు యాచనిపోయినవానియొక్క వారసు కానేరదు.

దీనినిబట్టి పైనయుదహరించిన యన్నితరగతుల బంధువులలోనూ కుమార్తెమునిమనుమడును, కుమార్తె కుమార్తెయొక్క మనుమడును, వారసత్వమున కర్హులుగానట్లు స్పష్టమగుచున్నది. ఉ—చనిపోయినవాడు తనకుమార్తె మునిమనుమని (యనగా కుమార్తె కుమారుని కుమారుని కుమారుడు) యొక్క తల్లిపూర్వికుడుగాని వాని తండ్రితల్లి పూర్వికుడుగాని వానితల్లితల్లి పూర్వికుడుగాని కాడు. కాని వానితండ్రితండ్రి తల్లియొక్క పూర్వికుడై యున్నాడు. అందువలన చనిపోయినవానికి యతనికుమార్తె మునిమనుమడు బంధువుగా వారసు కానేరడు. ఆప్రకారముగానే

చనిపోయినవానికి యతనికుమార్తె కుమార్తె కుమారుని కుమారుడు బంధువుగా వారసు కానేరడు. ఏలయన చనిపోయినవాడు తనకుమార్తె కుమార్తె కుమారుని కుమారునకు తల్లిపూర్వికుడుగాని వానితండ్రితల్లి పూర్వికుడుగాని వాని తల్లితల్లి పూర్వికుడుగాని కానేరడు. కాని యతడు వాని తండ్రితల్లి తల్లి పూర్వికుడై యున్నాడు. గనుక చనిపోయినవానికుమార్తె కుమార్తె కుమారుని కుమారుడు బంధువుగా వారసు కానేరడు.

### బంధువులలో వారసత్వపుక్రమము.

బంధువులలో వారసత్వపుక్రమము తెలియుటకు యీదిగువ సూత్రము లుపయోగకరములుగా నుండునని ట్రెవిలియన్ దొరగారు తమ హిందూన్యాయశాస్త్రమను గ్రంథములో పొందుపరచిరి.

1. బంధువులలో ఆత్మబంధువు లందరితరువాతను పితృబంధువులును వారితరువాత మాతృబంధువులును చనిపోయినవానికి వారసులగుచున్నారు. అనగా ఆత్మబంధువు లెవరును లేనియెడల పితృబంధువులును వారెవరును లేనియెడల మాతృబంధువులును వారసులగుదురు. 19 మ 405 ప్రి. కౌ. 33 మ 4[illegible]9.

2. ప్రతితరగతి బంధువులలోను చనిపోయినవాని తండ్రిద్వారా బంధుత్వముగలవారు (Exparte paterna) ముందును యటుపిమ్మట తల్లిద్వారా బంధుత్వముగలవారును (Exparte materna) వారసులగుదురు. 18 మ 193.

3. పయిరెండు సూత్రముల ననుసరించి వారసత్వములో దూరపువారసులకంటె దగ్గిర వారసులు ప్రాముఖ్యతను వహింతురు. 20 మ 342–29 మ 115–16 మ 23–19 మ 405 ప్రి. కౌ.

4. పయిమూడు సూత్రము లనుసరించి చనిపోయినవాని వంశ





మునకును తనకునుమధ్య సంబంధముకలుపునకు వంశవృక్షములో యిరువురు స్త్రీలనడుమను వచ్చిన బంధువారసుకంటె యొకస్త్రీ మాత్రము నడుమవచ్చిన బంధువారసు ముఖ్యుడగును. 30 మ 406.

అయితే పైనయుదహరించిన సూత్రములలో రెండవసూత్రమునందు కొద్దికాలముక్రిందట కొంతమార్పు కలిగెను. ఆసూత్రములో ప్రతితరగతిబంధువులలోను ముందు తండ్రివైపువారు Bandhus exparte paterna ముఖ్యులైయు వారెవరును లేనియెడల తల్లివైపువారు Bandhus exparte materna వారసులగుదురని యున్నది. ఈమధ్య మదరాసుహైకోర్టునుంచి యప్పీలు కాబడిన యొక కేసులో ప్రీవీకౌన్సిలువారు వొకటి మదరాసుహైకోర్టు తీర్పులను, హిందూన్యాయశాస్త్రగ్రంథములను విమర్శనజేసి చనిపోయినవానికిగల ఏకతరగతి బంధువులలో యనగా యాత్మ, పితృ, మాతృబంధువులను మూడుతరగతులలో యొకతరగతిబంధువులలో తండ్రివైపువారయినను తల్లివైపువారయినను దగ్గరవారు యనగా రక్తసంబంధ మెక్కువగలవారును పిండసంబంధ మెక్కువగలవారును యనగా చనిపోయినవానికి యుత్తరక్రియలవలన యెక్కువలాభము గలుగజేయువారు ముఖ్యవారసులు. కాని యొకేతరగతిలో తండ్రివైపువారిని యెక్కువగాను, తల్లివైపువారిని తక్కువగాను భావించి యెంతదూరబంధువులయినను తండ్రివైపువారినందరిని ముందువారసులనుగానెంచి వారెవరును లేనపుడు తల్లివైపువారిని బంధువారసులుగానెంచుట పొరబాటుయని యభిప్రాయపడిరి. దీనినిబట్టి యేకతరగతిబంధువులలో యనగా యాత్మబంధువులలోగాని పితృబంధువులలోగాని మాతృబంధువులలోగాని యిరువురకు చనిపోయినవాని వారసత్వముకొరకుమై వివాదకలిగినపుడాయిరువురులో చనిపోయినవారికి మిక్కిలి దగ్గిరబంధువు లేక రక్తసంబంధ మె

క్కువగలవారెవరో వారే ముఖ్యవారసులుగాని, తండ్రివైపువారెక్కువయును తల్లివైపువారు తక్కువయును కాదు. అయితే వారిరువురును చనిపోయినవానికి సమానమయిన రక్తసంబంధముగలిగి సమానమయిన తరువులోని బంధుత్వముగలవారగు (Same degree) నపుడు మాత్రము పిండసంబంధ మెక్కువగలవారు యనగా యుత్తరక్రియలవలన లాభమెక్కువ గలుగజేయువారు ప్రాముఖ్యతను వహింతురు గనుక వారిలో తండ్రివైపుబంధువునకు యెక్కువప్రాముఖ్యత నీయవచ్చును. అనగా యతని ముఖ్యవారసునిగా నెంచవచ్చును. ఈకేసులో చనిపోయినవాని తండ్రికి బుట్టిన కుమారుని కుమారునికంటే తల్లికి బుట్టినవాడు యనగా మేనమామ ముఖ్యమైన బంధువారసుడని తీర్మానింపబడెను. 41 మ. ల. జ. 676 ప్రి. కౌ. (1921) = 48. ఇ. అ. 349.

శ్రీవిలియమురుదొరగారు భట్టాచార్యులయొక్కయు సర్వాధికారియొక్కయు హిందూన్యాయశాస్త్రగ్రంథములలోని బంధువులయొక్క వారసత్వపుక్రమముల ననుసరించి యిప్పటికి యమలులోనున్న హైకోర్టుతీర్పులప్రకారము యవసరమైన సవరణలతో బంధువుల విషయమై యీముందుదహరించిన వారసత్వపుక్రమమును తనహిందూన్యాయశాస్త్రగ్రంథములలో చక్కగా నుదహరించెను. దానిప్రకారము యాత్మబంధువులలో చనిపోయినవాని కుటుంబములో కుమార్తెలద్వారా బంధువులగువారు చనిపోయినవాని తల్లిద్వారా బంధువులగువారికంటె ముందువారసులగుదురని యున్నది. కాని పైనయుదహరించిన ప్రీవీకౌన్సిలువారి తీర్పుప్రకారము యీవిషయములో కొన్నిసవరణలు చేయవలసియుండును. 41 మ. ల. జ 676 (ప్రి. కౌ.)

చనిపోయినవాని కుమార్తె కుమారుడు బంధువేయయినను యతను దౌహిత్రుడుగాన యతడు సపిండులలోనే యొకముఖ్యమైన



వారసుగా నెంచబడిన సపిండవారసులలో నొకప్రాముఖ్యమయిన పదవిని పొందియున్నవాడగాన వానిని బంధువులలో జేర్చనవసరము లేదు. ఇదివరలో యనగా పైనయుదహరించిన ప్రీవీకౌన్సిలువారితీర్పు రాకమునుపు యుదహరించిన సూత్రముల ననుసరించి శ్రీవిలియమ్‌దొరగారొక బంధువులజాబితా నిచ్చియుండిరి.

ఈజాబితా యాత్మబంధువులు, పితృబంధువులు, మాతృబంధువులు యనునట్టివారో సులభముగా తెలుసుకొనుటకు మిక్కిలి యుపయోగకరముగా నున్నదిగాని యాయాతరగతులలోని వారసులవరుస నెంబర్లుమాత్రము పయినయుదహరించిన ప్రీవీకౌన్సిలువారి తీర్పులో వివరింపబడిన పద్ధతులప్రకారము సవరణలు కావలసియున్నవి. అట్టి సవరణలు చేయుటకుముందు యీప్రీవీకౌన్సిలువారి తీర్మానములో భిన్నగోత్రజ సపిండులు లేక బంధువులలో వారసత్వపుక్రమము విషయమై వివరింపబడినపద్ధతులను సంగ్రహముగా తెలుసుకొనవలయును. అవియెట్టివనిన:—

1. చనిపోయినవాని కుటుంబములో పుట్టినటువంటిన్ని లేక యాకుటుంబమునకు వివాహమురీత్యా చెందినటువంటిన్ని స్త్రీలకు సంబంధించిన భిన్నగోత్రజ సపిండులే బంధువులనబడుదురు.

2. వారు వృద్ధసతాతప లేక బౌద్ధాయనసూత్రము ప్రకారము యాత్మబంధువులు, పితృబంధులు, మాతృబంధువులు యని మూడు తరగతులుగా నున్నారు. ఈతరగతుల వరుసననుసరించియే చనిపోయినవానికి క్రమముగా వారసులగుదురు.

3 ఆయాతరగతులలో నుదహరింపబడిన వారసులు చనిపోయినవానికి సమీపబంధువుల వరుసక్రమము నెటులగ్రహించవలయునో తెలియుటకుగాను యుదాహరణములుగా చేర్కొనబడినవారుగాని పూర్ణజాబితా కాదు.

4 ఏకతరగతిబంధువులలో చనిపోయినవానికి ముఖ్యవారసు లెవరో తెలియవలెనన్న చనిపోయినవానికి యెవరుయుత్తరక్రియల వలన యెక్కువలాభమును కలుగజేయుటకు యర్హులో వారుముఖ్య వారసులని గ్రహించవలయును. ఈనాలుగుపద్ధతులను మొదట మద రాసు హైకోర్టువారు 16 మ. 23 తీర్పులో వక్కాణించిరి. వానిని యిపుడు యీతీర్పులో ప్రీవీకవున్సిలువారు యుదహరించుచూ యిట్టి విషయములలో యీపద్ధతులను ప్రమాణములుగా గైకొని వానినవ లంభించుట క్షేమకరమనిరి. మరియును యీవిషయములో గోలాపు చెందరశాస్త్రిగారును, రాజకుమార సర్వాధికారిగారును తమహిందూ న్యాయశాస్త్రగ్రంథములలో చెప్పిన సూత్రములను ప్రీవీకవున్సిలు వారు యీతీర్పులో యుదహరించి వానియెడనాదరణ కనపరచిరి. ఆసూత్రము లెట్టివియన

1 గోలాపు చెందరశాస్త్రిగారు చెప్పిన సూత్రములు.

1. బంధుత్వ లేవైపువారైనను దూరపుబంధువులకంటే దగ్గిర బంధువులు ముఖ్యవారసులగుదురు.

2. సమానబంధుత్వమనగా యేకయంతరువులోనివారైన పుడు తల్లివైపువారికంటే తండ్రివైపువారుముఖ్యవారసులు కావచ్చును.

3. వారొకవైపువారేయగునపుడు యొకడు పురుషులద్వారా బంధుత్వముగలవాడైనను రెండవవాడు స్త్రీద్వారా బంధుత్వముగల వాడైనను భేదములేక యిరువురను సమానులనుగా నెంచవలెను.

2. రాజకుమార సర్వాధికారిగారు చెప్పిన సూత్రము.

చనిపోయినవానికి యేకతరగతిబంధువులలో సమానమైన యంతరవులోనివారగు యిరువురుబంధువులలో నెవరుముఖ్యవారసు యని తెలియవలయుననిన యందులో యెవరు చనిపోయినవానికి యుత్తరక్రియలవలన మతసంబంధమయిన లాభము నెక్కువగా కలుగ



జేయుటకు యర్హులుగానుందురో వారు ముఖ్యవారసని యూహించ వలయును.

ప్రీవీకవున్సిలువారు పైనయుదహరించిన సూత్రములన్నిటిని పరిశీలించి యేకతరగతిబంధువులలో దగ్గరవారును చనిపోయినవానికి యుత్తరక్రియలవలన మతసంబంధమయిన లాభమును యెక్కువకలుగ జేయుటకు యర్హులైనవారును ముఖ్యవారసులనియెంచి యీచనిపోయిన వానికి తండ్రివైపు యాత్మబంధువగు Atma bandhu exparte paterna మేనత్తకుమారుని కుమారునికంటే యనగా తండ్రితోబుట్టువయొక్క మనుమనికంటే తల్లివైపు యాత్మబంధువగు Atma bandhu exparte materna తల్లికితోబుట్టినవాడు (మేనమామ)ముఖ్యవారసుడనితీర్మా నించిరి. వేదాచల మొదలియార్ ఎదిరె సుబ్రహ్మణ్యము మొదలియార్ 41 మ. ల. జ 676=48. ఇ. అ 349 ప్రి కౌ దీని బట్టి చనిపోయిన వానికి యేకతరగతిబంధువులలోయనగా యాత్మబంధువులలోగాని పితృబంధువులలోగాని మాతృబంధువులలోగాని తండ్రివైపువారు కొందరు బంధువులును exparte paterna తల్లివైపువారు కొందరు బంధువులును Exparte materna యున్నపుడు వారిలో దగ్గిరవారును చనిపోయినవానికి యుత్తరక్రియలవలన యెక్కువలాభము గలుగ జేయువాడును ముఖ్యవారసుడుగాని తండ్రివైపువాడు Exparte paterna తల్లివైపువానికంటే Fxparte materna ముఖ్యుడను పూర్వపు భేదముతొలగిపోయినట్టు తెలియుచున్నది. అనగాదగ్గరబంధుత్వమిపుడు ముఖ్యమనియు, తరువాత పిండసంబంధము ప్రాధాన్యమనియు తండ్రివైపు తల్లివైపు యనను తారతమ్యములంతగా లేవనియు భావము. ప్రతిమనుజుడును తనతండ్రివైపు పూర్వులకును తల్లివైపుపూర్వులకు ను యుత్తరక్రియలు జేయును ఈకేసులో మేనత్తమనుమడు చని పోయినవాని తండ్రివైపు పూర్వులకుగాని తల్లివైపు పూర్వులకుగాని

పిండములనర్పింపజాలడు. అనగా చనిపోయినవానికి యుత్తరక్రియల
వలన మతసంబంధమయిన లాభమును కలుగజేయనేరడు. మేనమామ
తనతండ్రి, తాత ముత్తాతలగు చనిపోయినవానితల్లి పూర్వులకు తాను
చేయుయుత్తరక్రియలవలన (పిండములవలన) యనగా చనిపోయినవాడె
వరికి యట్టిపిండములర్పించవలసియుండునో యట్టివారికి పిండములనర్పిం
చడము మూలముగా చనిపోయినవానికి మతసంబంధమయిన లాభ
మును గలుగజేయును. మరియు చనిపోయినవానికి మేనత్తమనుమని
కంటె మేనమామదగ్గిరబంధువుగనుక మేనమామదగ్గర వారసుగా నెంచ
బడెను.

పండితరాజకుమార సర్వాధికారి క్రెటిలివియన్, భట్టాచారి
మొదలగువారి హిందూన్యాయశాస్త్ర గ్రంథములలో వివరింప
బడినబంధువులజాబితాలలో ప్రతితరగతిలోనూ యనగా యాత్మబంధు
వులలోనూ పితృబంధువులలోనూ మాతృబంధువులలోను తండ్రివైపు
వారి Exparte paterna కందరకు వారసత్వమునందు ముందుప్రాము
ఖ్యతనిచ్చి వారెవరును లేనియెడల తల్లివైపువారికి Exparte materna
వారసత్వపుహక్కు యుండునని చెప్పబడెను. అనగా వారుయిచ్చిన
జాబితాలలోని బంధు వారసులవరుసనెంబర్లు, ప్రతితరగతిలోను
తండ్రివైపువారికిని తల్లివైపువారికిని వారసత్వమువిషయములో
యపుడుయుండెడి తారతమ్యముల ననుసరించి వేయబడెను
ఇపుడు పైనయుదహరించినరీతిని ప్రివీకౌన్సిలువారి తీర్పుప్రకారము
తండ్రివైపువారికిని తల్లివైపువారికిని యట్టిభేదములు లేనటుల కాన్పిం
చుచున్నది. గాన యందులో సూచించిన పైపద్ధతుల ననుసరించి యి
దివరకుగలగ్రంథములలో నీయబడిన బంధువులజాబితాలలోని వరుసనెంబ
ర్లలో సవరణలు కావలసియున్నవి. అందుకుగాను పూర్వపుజాబితా
ప్రకారము ముందు యున్నతరగతులబంధువులను స్పష్టముగా తెలియు



లాగున వేరువేరు వంశవృక్షములమూలముగా వెల్లడిచేసి వానిలో
ప్రతిబంధువుస్థానమువద్దను మొదటపూర్వపువరుసనెంబరును గుర్తించి
పైనయుదహరించిన యిప్పటిపద్ధతులప్రకారము దానినిపుడెటుల
సవరణ చేయవలసియుండునో యనగా దానినిపుడేనెంబరుగామార్చి
న బాగుండునోసూచించునెంబరునుగూడ మొదటినెంబరుతరువాత దా
నికెదురుగా యరసున్నలమధ్యను (Within brackets) వేయబడును.
వీనినిబట్టి బంధువులలో వారసత్వపుక్రమమును స్పష్టముగా గ్రహించు
ట సులభమగును. ఎటులనిన యిచట ప్రతితరగతిబంధువులలో తండ్రి
వైపువారిని (Exparte paterna) యొకవంశవృక్షములోను తల్లివైపు
వారిని (Exparte materna) యొకవంశవృక్షములోను కనుపరచి వా
రసత్వములో వారికిగలస్థానములు వరుససంఖ్యలవలన సూచింపబడెను.
1, 2 నెంబర్లుగల వంశవృక్షములలోనివారు యాత్మబంధువులు. అందు
లో నొకటవనెంబరు వంశవృక్షమువారు చనిపోయినవానికి తండ్రివై
పు యాత్మబంధువులు (Atma Bandhus exparte paterna) రెండవ
నెంబరువంశవృక్షమువారు చనిపోయినవానికి తల్లివైపుయాత్మబంధులు
(Atma Bandhus Exparte Materna) తల్లివైపుబంధువులకంటె తండ్రి
వైపువారు యెక్కువయను తారతమ్యము లున్నయపుడు
యీబంధువులయొక్క వారసత్వపుస్థానములను కనుపరచు వరుససం
ఖ్య ముందు తండ్రివైపు యాత్మబంధువులుగల యొకటవనెంబరు వంశ
వృక్షములో ప్రారంభమై యందులోని బంధువులందలి స్థానములను వ
రుసనెంబర్లచే సూచించినతరువాత క్రమముగా యటులనే రెండవనెం
బరు వంశవృక్షములోని తల్లివైపు యాత్మబంధువులనుగూడ యావరు
సనే లెఖించి వారిస్థానములుగూడ యావరుసనెంబరులచే కనుపరచబ
డెను. ఇటువలెనే పితృబంధువులగు 3,4 నెంబర్లుగల వంశవృక్షము

లోను మాతృబంధువులకు 5, 6 నంబరుల వంశవృక్షములోను వరుసగా లెఖించి వారివారిస్థానముల నీవరుసనంబరులవలననే స్పష్టమగునటుల చేయబడెను. ప్రతిబంధువుయొక్క స్థానమువద్దను మొదటినంబరు యిట్టిపూర్వపుపద్ధతి యనగా ప్రతితరగతిలోను తండ్రివైపువారు తల్లివైపువారికంటె యెక్కువ ముఖ్యవారసులగునను మామూలుపూర్వపుపద్ధతిప్రకారము వేయబడిన వరుససంఖ్యను సూచించును.

అట్టి మొదటిసంఖ్యకెదురుగా యరసున్నలనడుమ ( Within brackets ) నున్న సంఖ్య ప్రతితరగతిబంధువులలోనూ చనిపోయినవాని తండ్రివైపువారికిని తల్లివైపువారికిని విశేషమయిన యెక్కువతక్కువ తారతమ్యములు లేకుండా సమీపబంధుత్వమును యుత్తరక్రియలవలన గలుగు మతసంబంధమయిన లాభమును ప్రాధాన్యముగానెంచిన పైన యుదహరించిన ప్రీవీకవున్సిలువారి తీర్పుప్రకారము వేయతగిన వరుససంఖ్యయై యున్నది. ఈవరుససంఖ్యనుబట్టి ప్రతిబంధువులయొక్క రెండువంశవృక్షములను కలిపి యేకముగా పరిశీలించినయెడల బంధువులలో వారసత్వపుక్రమము యిదివరలో యెటులుండినది యిప్పుడెటులుండవలసినది వెల్లడియగును. ఈవంశవృక్షములోని బంధువులయొక్క మొదటివరుసనంబరుపైని యుదహరించిన ప్రీవీకవున్సిలుతీర్పురాకమునుపు హిందూన్యాయశాస్త్ర నవీనగ్రంథకర్తలగు ట్రెవిలియన్—గవరు రామకృష్ణ మొదలగువారి గ్రంథములప్రకారమును, యరసున్నలలోనున్న రెండవవరుసనంబరు సదరు ప్రీవీకవున్సిలువారితీర్పు వచ్చినతరువాత మదరాసు హైకోర్టు జడ్జిగానుండిన కూట్సుట్రాటరుదొరగారిచే సవరణచేయబడి తిరిగి ప్రచురముకాబడిన మెయినుదొరగారి హిందూన్యాయశాస్త్రగ్రంథముప్రకారమును, వేయబడిన బంధువులలో వారసత్వపుక్రమమును తెలియజేయు సంఖ్యలైయున్నవి. ఈవంశవృక్షము



లలో కొన్నిస్థానములయందు పైనయుదహరించిన వరుససంఖ్యలు రెండు లేకుండా యొకసంఖ్యమాత్రమే కనపించును. అప్పుడాయొకసంఖ్యయును యరసున్నలమధ్య నున్నయెడల Within brackets పయిన యుదహరించిన కూట్సుదొరగారిచే యీమధ్య సవరణచేయబడి తిరిగి ప్రచురముకాబడిన మెయినుదొరగారి హిందూన్యాయశాస్త్రప్రకారము యట్టిసంఖ్యలు గలవారినిగూడ యాతరగతిబంధువులలో యాస్థానమున వారసత్వమునకు హక్కుగల బంధువులుగా నెంచబడినటులను యంతకుపూర్వము పైనయుదహరించిన ట్రెవిలియను గవరు రామకృష్ణ మొదలగువారి గ్రంథములప్రకారము వారు యాతరగతిబంధువులలో నెంచబడనటులను యూహించునది. అటులనే యాయొకసంఖ్యయును యరసున్నలమధ్య కాక Not within brackets మామూలుగా యున్నయెడల పైనయుదహరించిన ట్రెవిలియను—గవరు—రామకృష్ణయ్య మొదలగువారి గ్రంథములలోని పూర్వపుపద్ధతిప్రకారము యట్టిసంఖ్యగలవారు యాతరగతిలో యాస్థానములయందు వారసత్వపుహక్కుగల బంధువులుగా నెంచబడినటులను పైనయుదహరించిన కూట్సు—ట్రాటరు దొరగారిచే సవరణకాబడిన మెయినుదొరగారి గ్రంథములోని నూతనపద్ధతిప్రకారము వారు యాతరగతిబంధువులుగా నెంచబడనటులను యూహించునది.

## భిన్నగోత్రజ సపిండులు లేక బంధువులు (Cognates)

### మొదటితరగతి—ఆత్మబంధువులు.

### అందులో చనిపోయినవానికి తండ్రివైపువారు.

### Atma Bandhus Exparte Paterna.

### వంశవృక్షము నెంబరు 1.




ఎడమవైపుబ్రాకెట్టులులేనిఅంకె పూర్వపుపద్ధతిప్రకారము వరుససంఖ్య. కుడివైపుబ్రాకెట్టులలోనిఅంకె నూతనపద్ధతిప్రకారము వరుససంఖ్య.



## భిన్నగోత్రజసపిండులు లేక బంధువులు (Cognates)

### మొదటితరగతి—ఆత్మబంధువులు

### అందులో చనిపోయినవానితల్లివైపువారు

### Atma Bandhus Exparte materna

### వంశవృక్షము నెంబరు. 2.



భిన్నగోత్రజ సపిండులు లేక బంధువులు (Cognates)

రెండవతరగతి—పితృబంధువులు.

అందులో చనిపోయినవాని తండ్రికి తండ్రివైపువారు.

Pitru Bandhus Exparte paterna

వంశవృక్షము నెంబరు 3.






భిన్నగోత్రజ సపిండులు లేక బంధువులు (Cognates)

రెండవతరగతి—పితృబంధువులు.

అందులో చనిపోయినవానితండ్రికి తల్లివైపువారు.

Pitru Bandhus Exparte Materna.

వంశవృక్షము నెంబరు 4.



## భిన్నగోత్రజ సపిండులు లేక బంధువులు (Cognates)

### మూడవ తరగతి—మాతృబంధువులు.

### అంతులో చనిపోయినవాని తల్లికి తండ్రివైపువారు.

### Matru Bandhus Exparte Paterna.

వంశవృక్షము నెంబరు 5.






## భిన్నగోత్రజ సపిండులు లేక బంధువులు. (Cognates)

### మూడవతరగతి—మాతృబంధువులు.

### అంతులో చనిపోయినవాని తల్లికి తల్లివైపువారు.

### Matru Bandhus Exparte Materna.

వంశవృక్షము నెంబరు 6.



పై 6 వంశవృక్షములలోని బంధువులను వరుసగా వివరించిన వారిలో వారసత్వపుక్రమము స్పష్టము కాగలదు.

తండ్రివైపు ఆత్మబంధువులు

కుటుంబములోని కుమార్తెల కుమారులు.

| పూర్వపుపద్ధతి వరుస నెంబరు. | పూర్వపుపద్ధతిప్రకారము | నూతనపద్ధతి వరుస నెంబరు. |
|---|---|---|
| 1 | చనిపోయినవాని కుమారుని కుమార్తె కుమారుడు. | 1 |
| 2 ,, | కుమారుని కుమారుని కుమార్తె కుమారుడు. | 4 |
| 3 ,, | సోదరియొక్క కుమారుడు | 8 |
| | ఇచట సవతిసోదరి యనగా భిన్నోదరసోదరి కుమారుడుగూడ వారసగుచున్నాడు. 15. మ. 300 | |
| 4 ,, | సోదరుని కుమార్తె కుమారుడు. | 9 |
| 5 ,, | సోదరుని కుమారుని కుమార్తె కుమారుడు | 12 |
| 6 ,, | తండ్రి తండ్రియొక్క కుమార్తె కుమారుడు. | 18 |
| 7 ,, | తండ్రి తండ్రియొక్క కుమారుని కుమార్తె కుమారుడు. | 21 |
| 8 ,, | తండ్రి తండ్రికుమారుని కుమారుని కుమార్తె కుమారుడు. | 28 |

ఇచట భట్టాచార్యులువారును సర్వాధికారిగారును తండ్రి తండ్రి తండ్రియొక్క కుమార్తె కుమారుడు తరువాత యాత్మబంధువుగా వారసగుననిరి. కాని మితాక్షరములో వానిని పితృబంధువుగా చెప్పబడియున్నందున యాత్మబంధువు కానేరడని కోర్టువారు వానిహక్కును నిరాకరించిరి. 19 మ. 405 ప్రి. కౌ. 16. మ. 23 ఇచట కుటుంబములోని కుమార్తెలకు కుమారుల కుమారులు వారసులు (అనగా వారు చనిపోయినవానికి తండ్రివైపు యాత్మబంధువులును వారికి చనిపోయినవాడు పితృబంధువు యగును.



| పూర్వపుపద్ధతి వరుస నెంబరు. | పూర్వపుపద్ధతిప్రకారము. | నూతనపద్ధతి వరుస నెంబరు |
|---|---|---|
| 9 ,, | కుమార్తెకుమారుని కుమారుడు 30. మ. 406 | 2 |
| 10 ,, | కుమారుని కుమార్తె కుమారుని కుమారుడు | 5 |
| 11 ,, | తండ్రికుమార్తెకుమారునికుమారుడు 20. మ. 3+2 | 10 |
| 12 ,, | సోదరునికుమార్తె కుమారుని కుమారుడు | 13 |
| 13 ,, | తండ్రితండ్రి కుమార్తె కుమారుని కుమారుడు | 22 |
| 14 ,, | తండ్రి తండ్రి కుమారుని కుమార్తె కుమారుని కుమారుడు | 29 |
| | తరువాతచనిపోయినవానికి తండ్రివైపు ఆత్మబంధువులును వారికి చనిపోయినవాడుమాతృబంధువును యగువారసులను పేర్కొనబడియెను. | |
| | వారెవరనిన— | |
| 15 ,, | కుమార్తెకుమార్తె కుమారుడు 30. మ 406 | 3 |
| 16 ,, | కుమారుని కుమార్తె కుమార్తెకుమారుడు | 6 |
| 17 ,, | తండ్రికుమార్తె కుమార్తెకుమారుడు | 11 |
| 18 ,, | తండ్రికుమారుని కుమార్తె కుమార్తెకుమారుడు | 14 |
| 19 ,, | తండ్రి తండ్రి కుమార్తె కుమార్తె కుమారుడు 23 మ 123 | 23 |
| 20 ,, | తండ్రి తండ్రి కుమారుని కుమార్తె కుమార్తె కుమారుడు | 30 |

ఇచటసర్వాధికారి భట్టాచార్యులుగార్లు మరికొందరు బంధువులను జేర్చిరిగాని వారు యాత్మబంధువులు కానేరరనే కారణమునయిచట మినహాయింపబడిరి. తరువాత చనిపోయినవాని తల్లి

| పూర్వపుపద్ధతి వరుస నెంబరు. | | పూర్వపుపద్ధతిప్రకారము | నూతనపద్ధతి వరుస నెంబరు |
|---|---|---|---|
| | | వైపుయాత్మబంధువులను చేర్చెను. | |
| 21 | ,, | తల్లితండ్రి 13 మ 10 19 మ 405 ప్రి. కౌ ఈదిగువను బంధువులకు చనిపోయినవాడు వారి తండ్రివైపు బంధువగును. | 16 |
| 22 | ,, | తల్లియొక్కసోదరుడు అనగా చనిపోయినవాని మేనమామ. 19 మ 405 | 17 |
| 23 | ,, | తల్లిసోదరుని కుమారుడు అనగా మేనమామ కుమారుడు 20. మ. 342 | 19 |
| | | ఒకజైనమతస్థుల కేసులో మేనమామకుమారుని కంటె పినతల్లి (లేక తల్లిసోదరి)కుమారుడు ముఖ్య వారసుడని తీర్మానించిరి. 33 మ 439 | |
| 24 | ,, | తల్లిసోదరుని కుమారుని కుమారుడు | 24 |
| 25 | ,, | తల్లి తండ్రితండ్రి 11 మ 287 | 81 |
| 26 | ,, | తల్లితండ్రిసోదరుడు | 83 |
| 27 | ,, | తల్లితండ్రిసోదరునికుమారుడు | 85 |
| 28 | ,, | తల్లితండ్రిసోదరునికుమారునికుమారుడు 5 మ 69 | 89 |
| 29 | ,, | తల్లితండ్రి తండ్రి తండ్రి | 105 |
| 80 | ,, | తల్లితండ్రి తండ్రిసోదరుడు | 107 |
| 31 | ,, | తల్లితండ్రి తండ్రిసోదరునికుమారుడు | 109 |
| 32 | ,, | తల్లితండ్రి తండ్రిసోదరునికుమారుని కుమారుడు | 113 |
| | | అటుపిమ్మట చనిపోయినవానికి తల్లివైపుయాత్మ బంధువులును వారికిచనిపోయినవాడు గూడ తల్లివైపుఆత్మబంధువునయుగుటచే వారువచ్చెదరు | |



| పూర్వపుపద్ధతి వరుస నెంబరు. | | పూర్వపుపద్ధతిప్రకారము. | నూతనపద్ధతి వరుస నెంబరు. |
|---|---|---|---|
| 33 | ,, | తల్లిసోదరికుమారుడు 33 మ 439 | 20 |
| 34 | ,, | మాతామహుని కుమారునికుమార్తె కుమారుడు | 25 |
| 35 | ,, | మాతామహుని కుమారునికుమారునికుమార్తె కుమారుడు | 31 |
| 36 | ,, | మాతామహునికుమారుని కుమారునికుమారుని కుమారుడు | 32 |
| 37 | ,, | మాతామహుని తండ్రి కుమారుని కుమారుని కుమారుని కుమారుడు | 98 |
| 38 | ,, | మాతామహునితండ్రితండ్రి కుమారునికుమారుని కుమారుని కుమారుడు | 122 |
| | | తరువాతను చనిపోయినవానికి తల్లివైపు బంధువులును వారికి చనిపోయినయతడు పితృబంధువునయుగు వారసులు కొందరు ముఖ్యులు | |
| 39 | ,, | తల్లితోబుట్టువుయొక్క కుమారుని కుమారుడు | 26 |
| 40 | ,, | తల్లితోబుట్టినవానికుమార్తెకుమారునికుమారుడు | 33 |
| | | తరువాత చనిపోయినవానికి తల్లివైపు బంధువులును వారికి చనిపోయినవాడు మాతృబంధువునయుగు వారసులు వచ్చెదరు. | |
| 41 | ,, | తల్లితోబుట్టువుయొక్క కుమార్తెకుమారుడు | 27 |
| 42 | ,, | తల్లితోబుట్టినవానికుమార్తెకుమార్తెకుమారుడు | 34 |
| | | పిమ్మటచనిపోయినవానిపితృబంధువులుముఖ్యులు. | |
| 43 | ,, | తండ్రితండ్రితండ్రి కుమార్తెకుమారుడు 16 మ 23; 29 మ 615 | 38 |

| పూర్వపుపద్ధతి వరుసనెంబరు. | | పూర్వపుపద్ధతిప్రకారము. | నూతనపద్ధతి వరుసనెంబరు. |
|---|---|---|---|
| 44 | ,, | తండ్రితండ్రితండ్రికుమారునికుమార్తెకుమారుడు 2 మ. హై. కో. 346 | 41 |
| 45 | ,, | తండ్రితండ్రితండ్రి కుమారునికుమారునికుమార్తె కుమారుడు. | 48 |
| 46 | ,, | తండ్రి తండ్రి తండ్రి తండ్రికుమార్తెకుమారుడు | 58 |
| 47 | ,, | తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమార్తె కుమారుడు | 61 |
| 48 | ,, | తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమార్తె కుమారుడు | 68 |
| 49 | ,, | తండ్రితండ్రితండ్రికుమార్తెకుమారునికుమారుడు 12 మ 155 | 42 |
| 50 | ,, | తండ్రితండ్రితండ్రి కుమారుని కుమార్తెకుమారుని కుమారుడు | 49 |
| 51 | ,, | తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమార్తె కుమారుని కుమారుడు | 62 |
| 52 | ,, | తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమార్తె కుమారుని కుమారుడు | 69 |
| 53 | ,, | తండ్రితండ్రి తండ్రికుమార్తెకుమార్తెకుమారుడు | 43 |
| 54 | ,, | తండ్రితండ్రితండ్రి కుమారునికుమార్తె కుమార్తె కుమారుడు. | 50 |
| 55 | ,, | తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమార్తె కుమార్తె కుమారుడు | 63 |
| 56 | ,, | తండ్రి తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమార్తె కుమార్తెకుమారుడు | 70 |



తరువాత చనిపోయినవానికి పితృబంధువులును వారికి చనిపోయినవాడు తండ్రివైపుయాత్మబంధువును యగునట్టివారు వచ్చెదరు.

| | | | |
|---|---|---|---|
| 57 | ,, | తండ్రిమాతామహుని కుమారుడు | 37 |
| 58 | ,, | తండ్రిమాతామహుని కుమారునికుమారుడు | 39 |
| 59 | ,, | తండ్రి మాతామహుని కుమారునికుమారుని కుమారుడు | 44 |
| 60 | ,, | తండ్రి మాతామహుని తండ్రికుమారుడు | 57 |
| 61 | ,, | తండ్రిమాతామహునితండ్రికుమారునికుమారుడు | 59 |
| 62 | ,, | తండ్రిమాతామహునితండ్రికుమారునికుమారుని కుమారుడు | 64 |
| 63 | ,, | తండ్రిమాతామహుని తండ్రితండ్రి కుమారుడు | 77 |
| 64 | ,, | తండ్రి మాతామహుని తండ్రి తండ్రి కుమారుని కుమారుడు | 78 |
| 65 | ,, | తండ్రిమాతామహుని తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమారుడు | 79 |

పిమ్మట చనిపోయినవానికి పితృబంధువులును వారికి చనిపోయినవాడు తల్లివైపు యాత్మబంధువును యగునట్టివారు వారసులగుదురు.

| | | | |
|---|---|---|---|
| 66 | ,, | తండ్రిమాతామహునికుమార్తెకుమారుడు | 40 |
| 67 | ,, | తండ్రి మాతామహుని కుమారుని కుమార్తె కుమారుడు | 45 |
| 68 | ,, | తండ్రిమాతామహుని కుమారుని కుమారుని కుమార్తె కుమారుడు | 51 |

69 ,, తండ్రిమాతామహునితండ్రికుమార్తెకుమారుడు 60

70 ,, తండ్రిమాతామహుని తండ్రికుమారునికుమార్తె
కుమారుడు 65

71 ,, తండ్రిమాతామహునితండ్రికుమారునికుమారుని
కుమార్తె కుమారుడు 71

72 ,, తండ్రి మాతామహుని తండ్రి తండ్రి కుమార్తె
కుమారుడు

73 ,, తండ్రి మాతామహుని తండ్రి తండ్రి కుమారుని
కుమార్తె కుమారుడు

74 ,, తండ్రిమాతామహుని తండ్రి తండ్రి కుమారుని
కుమారుని కుమార్తె కుమారుడు

75 ,, తండ్రి మాతామహుని కుమారుని కుమారుని
కుమారుని కుమారుడు 52

76 తండ్రిమాతామహుని తండ్రి కుమారుని కుమారుని
కుమారుని కుమారుడు 72

77 ,, తండ్రి మాతామహుని తండ్రి తండ్రి కుమారుని
కుమారుని కుమారుని కుమారుడు 80
తరువాత చనిపోయినవానికి పితృబంధువులును
వారికిచనిపోయినవాడు గూడా పితృబంధువును
యగునట్టివారు వారసులగుదురు

78 ,, తండ్రి మాతామహుని కుమార్తె కుమారుని
కుమారుడు 46

79 ,, తండ్రి మాతామహుని కుమారుని కుమార్తె
కుమారుని కుమారుడు 53



80 ,, తండ్రి మాతామహుని తండ్రికుమార్తె
కుమారుని కుమారుడు 66

81 ,, తండ్రి మాతామహునితండ్రికుమారునికుమార్తె
కుమారునికుమారుడు 73
తరువాత చనిపోయినవానికి పితృబంధువులును
వారికి చనిపోయినవారు మాతృబంధువునుయగు
నట్టి వారు వారసులగుదురు.

82 ,, తండ్రి మాతామహుని కుమార్తె కుమార్తె
కుమారుడు 47

83 ,, తండ్రి మాతామహుని కుమారుని కుమార్తె
కుమార్తె కుమారుడు 54

84 ,, తండ్రి మాతామహునితండ్రికుమార్తె కుమార్తె
కుమారుడు 67

85 ,, తండ్రిమాతామహుని తండ్రికుమారునికుమార్తె
కుమార్తె కుమారుడు 74
తరువాత చనిపోయినవాని మాతృబంధువులు
వారసు లగుదురు

86 ,, మాతామహుని తండ్రి కుమార్తె కుమారుడు 86

87 ,, మాతామహుని తండ్రికుమారుని కుమార్తె
కుమారుడు 90

88 ,, మాతామహుని తండ్రి కుమారుని కుమారుని
కుమార్తె కుమారుడు 97

89 ,, మాతామహునితండ్రితండ్రికుమార్తెకుమారుడు 110

90 ,, మాతామహునితండ్రితండ్రి కుమారుని కుమార్తె
కుమారుడు 114

91 ,, మాతామహునితండ్రితండ్రికుమారునికుమారుని కుమార్తె కుమారుడు 121

92 ,, మాతామహుని తండ్రి కుమార్తె కుమారుని కుమారుడు 91

93 ,, మాతామహునితండ్రికుమారునికుమార్తె కుమారుని కుమారుడు 99

94 ,, మాతామహుని తండ్రితండ్రికుమార్తెకుమారుని కుమారుడు 115

95 ,, మాతామహుని తండ్రితండ్రికుమారునికుమార్తె కుమారునికుమారుడు 113

96 ,, మాతామహుని తండ్రి కుమార్తె కుమార్తె కుమారుడు 92

97 ,, మాతామహుని తండ్రి కుమారుని కుమార్తె కుమార్తె కుమారుడు 100

98 ,, మాతామహుని తండ్రితండ్రి కుమార్తెకుమార్తె కుమారుడు 116

99 ,, మాతామహుని తండ్రితండ్రికుమారునికుమార్తె కుమార్తెకుమారుడు 124

తరువాత చనిపోయినవానికి మాతృబంధువులును వారికి చనిపోయినవాడు తండ్రివైపు పితృబంధువును యగునట్టివారుముఖ్యబంధు వారసు లగుదురు

100 ,, తల్లిమాతామహుడు 82

101 ,, తల్లిమాతామహుని కుమారుడు 84

102 ,, తల్లిమాతామహుని కుమారుని కుమారుడు 87



103 ,, తల్లిమాతామహునికుమారుని కుమారునికుమారుడు 93

104 ,, తల్లిమాతామహుని తండ్రి 106

105 ,, తల్లిమాతామహుని తండ్రికుమారుడు 108

106 ,, తల్లి మాతామహుని తండ్రికు మారునికు మారుడు 111

107 ,, తల్లిమాతామహుని తండ్రికుమారుని కుమారుని కుమారుడు 117

తరువాతచనిపోయినవానికి మాతృబంధువులును వారికిచనిపోయినవాడు తల్లివైపు ఆత్మబంధువును యగునట్టివారు వారసులగుదురు.

108 ,, తల్లిమాతామహుని కుమార్తె కుమారుడు 88

109 ,, తల్లి మాతామహుని కుమారుని కుమార్తె కుమారుడు 94

110 ,, తల్లి మాతామహుని కుమారుని కుమారుని కుమార్తెకుమారుడు 101

111 ,, తల్లిమాతామహుని తండ్రికుమార్తెకుమారుడు 102

112 ,, తల్లి మాతామహుని తండ్రికుమారునికుమార్తె కుమారుడు 118

113 ,, తల్లి మాతామహుని తండ్రికుమారుని కుమారుని కుమార్తెకుమారుడు 125

114 ,, తల్లి మాతామహుని కుమారుని కుమారుని కుమారుని కుమారుడు 102

115 ,, తల్లిమాతామహుని తండ్రికుమారుని కుమారుని కుమారుని కుమారుడు 126

తరువాత చనిపోయినవానికి మాతృబంధువులును
వారికి చనిపోయినవాడు పితృబంధువును యగు
నట్టివారు వారసులగుదురు.

116 ,, తల్లిమాతామహుని కుమార్తె కుమారుని కుమారుడు 95

117 ,, తల్లి మాతామహుని కుమారుని కుమార్తె కుమారుని కుమారుడు 103

118 ,, తల్లిమాతామహుని తండ్రికుమార్తె కుమారుని కుమారుడు 119

119 ,, తల్లిమాతామహునితండ్రికుమారుని కుమార్తె కుమారుని కుమారుడు 127

తరువాత చనిపోయినవానికి మాతృబంధువులును
వారికిచనిపోయినవారుగూడా మాతృబంధువును
యగునట్టివారు వారసు లగుదురు.

120 ,, తల్లిమాతామహునికుమార్తెకుమార్తెకుమారుడు 96

121 ,, తల్లి మాతామహుని కుమారుని కుమార్తె కుమార్తె కుమారుడు 104

122 ,, తల్లిమాతామహుని తండ్రికుమార్తె కుమార్తె కుమారుడు 120

123 తల్లి మాతామహుని తండ్రి కుమారుని కుమార్తె కుమార్తె కుమారుడు 128

ఆరువంశవృక్షములలోని బంధువులను వారిజాబితాయును పరిశీలించిచూచిన కొంతమంది అదివరలో లేనివారని నూతనముగా జేర్చబడినటులను అదివరలో నున్నవారిలో కొంతమంది వదలివేయబడినటులను కానిపించును మొదటిపద్ధతిప్రకారము బంధువుల జాబితాలో



లేనటువంటిన్ని రెండవపద్ధతిప్రకారము సదరుజాబితాలో జేర్చబడినటువంటిన్ని బంధువు లెవరనిన—

మొదటితరగతి యాత్మబంధువులలో

1 చనిపోయినవాని కుమారుని కుమారునికుమార్తెకుమారుని కుమారుడును (7)

2 చనిపోయినవానితండ్రికుమారునికుమారుని కుమార్తె కుమారుని కుమారుడును (15)

3 ,, తండ్రితండ్రికుమారుని కుమారునికుమార్తెకుమారుని కుమారుడును (35)

రెండవతరగతి పితృబంధువులలో

1 చనిపోయినవాని తండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమార్తె కుమారుని కుమారుడును (55)

2 ,, తండ్రితండ్రి తండ్రి తండ్రి కుమారుని కుమారుని కుమార్తె కుమారుని కుమారుడును (75)

3 ,, తండ్రి తల్లితండ్రిని (36)

4 ,, తండ్రి తల్లి తండ్రి తండ్రిని (56)

5 ,, తండ్రితల్లి తండ్రితండ్రితండ్రిని (76)

మొదటిపద్ధతిప్రకారము బంధువుల జాబితాలోయున్న వారిని రెండవపద్ధతిప్రకారము సదరుజాబితాలో వదలివేయబడిన వారెవరనిన

రెండవతరగతి పితృబంధువులలో

1. 72 ,, తండ్రితల్లి తండ్రితండ్రితండ్రి కుమార్తెకుమారుడు

2. 73 ,, తండ్రితల్లి తండ్రితండ్రితండ్రి కుమారునికుమార్తె కుమారుడు

3. 74 ,, తండ్రితల్లితండ్రితండ్రి తండ్రి కుమారునికుమార్తె కుమారుడు

మొదటితరగతియాత్మబంధువులలో (7), (15), (35) నెంబరులవారిని గూడ చేర్చుటకు కారణమేమన చనిపోయినవానికి తండ్రితల్లితండ్రి తండ్రితండ్రియును, తండ్రితల్లితండ్రితండ్రి తండ్రికుమారుడును, తండ్రి తల్లితండ్రితండ్రితండ్రి కుమారుని కుమారుడును [అనగా (76) (77) (78) నెంబరులవారు] పరస్పరము యెటులబంధువులయిరో యటులనే చనిపోయినవారికిని (7)(15)(35)నెంబరులవారికిని పరస్పరము యట్టిబంధుత్వమే గలదనే యభిప్రాయముచే వారిని గూడచేర్చబడెనని యూహింపవగును.

ఇటులనే రెండవతరగతి పితృబంధువులలో నూతనముగా చేర్చబడిన (55) (75) (36)(56) (76) నెంబరులవారి విషయమైగూడ కారణములు యూహింపనగును.

రెండవతరగతి పితృబంధువులలో మొదటి పద్ధతిప్రకారము యున్న 72, 73, 74 నెంబరులవారు రెండవపద్ధతిలో వదలివేయబడుటకు కారణము చనిపోయినవారికిని సదరు నెంబరులవారికిని పరస్పరము వారసత్వమున కర్హతగలబంధుత్వము లేనటుల యభిప్రాయమని యూహింపనగును. ఉ చనిపోయినవానికి 72 నెంబరువాడట్టిబంధువు కావచ్చునుగాని 72 నెంబరువారికి చనిపోయినవాడట్టి బంధువుకానేరడని యభిప్రాయము ఈపరస్పరబంధుత్వము 2, 4, 5 నెంబరులవంశవృక్షములుకలిపి పరిశీలించిన బాగుగా తెలియును.

### స్త్రీబంధువులు

ఇంతవరకు బంధువులలో పురుషులవిషయమై విమర్శనచేసి వారిలో వారసత్వపుక్రమమును తెలుసుకొనియుంటిమి. ఇపుడు స్త్రీబంధువులలో వారసత్వపుహక్కుగలవారెవరో తెలిసికొనవలసియున్నది అసలు చెన్నపురిరాజధానిలో ధర్మశాస్త్రములలో స్పష్టముగా చెప్ప



బడియుండిననే తప్ప స్త్రీలు సాధారణముగా వారసత్వమున కర్హులు కారు 5 మ 241 (249); 8 మ 107(117 127-129)

కాని విశేషమయిన రక్తసంబంధముగల స్త్రీసంబంధులను భిన్నగోత్రజసపిండులనుగా నెంచవచ్చునని యుమితాక్షరములోని రెండవ యధ్యాయము యారవసూత్రముప్రకారము సపిండశబ్దము స్త్రీలకు కూడావర్తించుననియు చెప్పుచూ మద్రాసుహైకోర్టువారు కొంతమంది స్త్రీలను వారసత్వమునకు హక్కులుగల బంధువులనుగా నెంచిరి 18 మ 168 (170) 8 మ హై కో రి 88. 21 మ 263 (267)

కాని యట్టి స్త్రీబంధువులు చనిపోయినవానికి పురుషబంధువులెవరను లేనపుడుమాత్రము వారసులగుదురు. 31 మ. 321. 1 మ 174 (185) ప్రి. కౌ.

మదరాసుహైకోర్టువారిచే నేటివరకు యట్టిబంధువులుగా నెంచబడిన స్త్రీలెవరనిన

1 చనిపోయినవాని తోబుట్టువ (సోదరి) 8 మ. హై. రి 88 దోబుట్టువకంటే యామెకుమారుడు చనిపోయినవానికి ముఖ్యవారసు 5 మ. 241.

2. చనిపోయినవాని సవతితోబుట్టువయనగా సవతితల్లికుమార్తె 5 మ. 29

3. కుమారుని కుమార్తె 14 మ. 149

4 చనిపోయినవానికు కుమార్తెకుమార్తె 17 మ. 182

5 ,, తండ్రితోబుట్టువ (మేనత్త) 15 మ 421 13 మ 10

6 ,, సోదరునికుమార్తె 21 మ. 263

మనదేశములోయనగా మదరాసు రాజధానిలో గోత్రజసపిండుల భార్యలు వారసులు గారు 18 మ. 168, 37 మ. 293

## మఠాధిపతులు మొదలగు మతసంబంధమయిన ఆశ్రమములను పుచ్చుకొనిన వారిలో వారసత్వపుక్రమము.

ప్రపంచకముయొక్క వ్యవహారములతో సంబంధమును వదులుకొనిన మతగురువులు మొదలగువారు సాధారణముగా యొకమఠాధిపతిగాగాని మరియితరమత సంబంధమయిన పదవిని బొందిగాని యుందురు. వారెవరయిన చనిపోయినపుడు మఠములు మొదలగు వానికిగల యాస్తి యాయామఠముల విషయమై చిరకాలమునుండి యములులోనున్న యాచారముల ప్రకారం వారసులగువారికి సంక్రమించును. ఒకడుమఠాధిపతి మొదలగు మతసంబంధమయిన పదవులను బొందవలెననిన యతను సంసారసంబంధమయిన సర్వసౌఖ్యములను పరిత్యజించి సన్యసింపవలెను. అటులయతడుసన్యసించినక్షణముననే గృహస్థాశ్రమమునకు సంబంధించినంతవరకు యతడు చనిపోయినటుల నెంచబడి యతనికి గృహస్థాశ్రమములో యుండుచున్న యావదాస్తియు యతనికి పూర్వపుయాశ్రమములోగల వారసులకు సంక్రమించును. అతడు ప్రపంచకముతో సంబంధమును యనగా గృహస్థాశ్రమధర్మములను పూర్తిగా విడనాడనియెడల తాను సన్యాసిమఠములో చేరినంతమాత్రమున తనకు గృహస్థాశ్రమములోగల యాస్తులయందు హక్కులు నశించుటగాని యతను చనిపోయినపుడు తనమామూలు వారసులకు తనయాస్తి సంక్రమించకపోవుటగాని తటస్థించదు. గనుక పూర్తిగా సన్యశించినవానివిషయములో మాత్రమే వారసత్వపుక్రమముమారును.

ఈసన్యశించడమనునది ద్విజులకేవర్తించునుగాని శూద్రులు యథావిధిగా సన్యశించుటకు శాస్త్రములొప్పవు గనుక శూద్రుడు నిజముగా బ్రాహ్మణునివలె సన్యశించినను వానికి వారసత్వపుక్రమము మారదు. అనగా శూద్రసన్యాసికి తనగృహస్థాశ్రమమునందుగల యాస్తులును వానియందుగల వారసత్వము మొదలగు హక్కులును మామూలుగానేయుండును. 22 మ. 302; 40 మ 846



ద్విజులలో గృహస్థాశ్రమధర్మములను విడనాడి మామూలు ప్రపంచకముతో సంబంధము లేకుండా యుండువారిని న్యాయశాస్త్రమునకు సంబంధించినంతవరకు మూడుతరగతులుగా విభాగింపనగును.

1 వానప్రస్థులు—ఒకడీయాశ్రమములోనుండి యాస్తినికలిగి చనిపోయినయెడల యిట్టియాస్తి యాంతరగతియాశ్రమమునకు చెందినన సహాధ్యాయునకు జెందును.

2 యతి లేక సన్యాసులు—ఒకడీయాశ్రమమునందుండి యాస్తిని గలిగి చనిపోయినయెడల వానియాస్తి పుణ్యశీలుడగువాని ప్రియశిష్యనకు చెందును.

3 బ్రహ్మచారులు—ఈయాశ్రమములో యాస్తినిగలిగి చనిపోయినవానికి వానిమతగురువు వారసగును.

చనిపోయినవారికెవరికైన పైనయుదహరించిన వారసత్వపుక్రమములోని యేవారసులేనియెడల యిట్టివారియాస్తి సర్కారువారికిజెందును.

## ముందుసమిష్టిగానున్న కుటుంబమువారు వ్యష్టియైన తరువాత వారిలో కొంతమందికలసితిరిగి సమిష్టికుటుంబముగా నేర్పడిన వారిలో వారసత్వపుక్రమము.

## Order of Succession after Re-union.

వ్యష్టియైన కుటుంబము వారిలోతిరిగి సమిష్టిగానుండుట కేర్పర్చుకొని యటుల సమిష్టిగానున్న కుటుంబమువారి విషయమై తెలియవలసిన సంగతులుకొన్నిగలవు. అవియేవన

(1) మితాక్షరను న్యాయప్రకారము వ్యష్టియైన కుటుంబము వారిలోనెవరైనను తనతండ్రితోగాని సోదరునితోగాని పినతండ్రి, లేక పెదతండ్రితోగాని కలసితిరిగి సమిష్టికుటుంబముగా నేర్పడియుండవచ్చును. గాని దూరపు దాయాదులతో తిరిగి కలసిసమిష్టికుటుంబముగా నేర్పడుటకు వీలులేదు.

(2) అట్టి వ్యష్టియయిన కుటుంబమువారిలో కొందరుతిరిగి కలిశిసమిష్టి కుటుంబముగా నేర్పడినపుడు యట్టికుటుంబము వారికినీదిగువ నుదహరించిన మార్పులతో మామూలుసమిష్టి కుటుంబమునందరుల వలెనేసమిష్టి కుటుంబాస్తి సంక్రమణహక్కులు (Rights of Survivorship) మొదలగు హక్కులుండును.

19 మ. ల. జ. 723; 33 మ. 165

(3) ముందువ్యష్టియైన కుటుంబము వారిలోకొంతమందే కోదరసోదరులును, భిన్నోదరసోదరులును, కలసితిరిగీ సమిష్టికుంటుంబముగా నేర్పడినతర్వాత చనిపోయినవానికేకే కోదరులుముఖ్యవారసులగుదురు.

(4) ముందువ్యష్టియైన కుటుంబము వారిలో నొకనియేకోదరులు వ్యష్టిగానేయుండి వానితో భిన్నోదరులు మాత్రముకలసి సమిష్టికుటుంబముగా నేర్పడియుండగా యతనుచనిపోయినయెడల వానికపుడు యేకోదరసోదరులును భిన్నోదరసోదరులును వారిసంతతివారును సమానముగా యతనికి వారసులగుదురు. అనగా యతనియాస్తి వారికేకకాలమందు సమానముగా సంక్రమించును. ఉ. చనిపోయినవారికి సమిష్టిగానున్న భిన్నోదరసోదరుని కుమారుడుచువ్యష్టిగానున్న యేకోదరిసోదరుడును యున్నపుడు వానియాస్తి వారిరువురకు సమానముగా సంక్రమించును. 16 మ. 440

(5) ముందువ్యష్టియైనకుటుంబమువారిలో నొకనికిగల భిన్నోదరసోదరులలో కొంతమందిమాత్రమే యతనితోకలసి సమిష్టిగానున్నపుడతను చనిపోయినయెడల వానియాస్తి సమిష్టిగానున్న భిన్నోదరసోదరులకేగాని వ్యష్టిగానున్నవారికి సంక్రమించనేరదు.

ఒకసారివ్యష్టియై తిరిగిసమిష్టిగానున్నవారివిషయమై యింకను తెలిసికొనవలయునసిన సమిష్టికుటుంబమువ్యష్టియగువిధమును తెలిపెడు మరియొకగ్రంథములో పూర్ణముగా తెలియును గాన యిచటయంత



వివరముగా వ్రాయనవసరములేదు. గానియట్టి కుటుంబమువారిలో నెవరైన చనిపోయినయెడల వారికిగల వారసుక్రమము నిచట తెలుసుకొనవలయును. మితాక్షరము న్యాయప్రకారము ఇట్టివారసత్వపుక్రమమును రెండు విధములుగా వివరింపనగును.

1 వీరమిత్రోదయము ప్రకారము

1 కుమారుడు 2 కుమారునికుమారుడు (మనుమడు)

3 కుమారుని కుమారుని కుమారుడు (మునిమనుమడు)

4 సమిష్టిగానున్న ఏకగర్భజనితుడగు సోదరుడు

5 సమిష్టిగానున్న భిన్నోదరసోదరుడును వ్యష్టిగానున్న ఏకగర్భజనితసోదరుడును సమానముగా చనిపోయినవానియాస్తిని పొందుదురు. 16 మ 440

6 సమిష్టిగానున్నతల్లి

7 సమిష్టిగానున్నతండ్రి

8 సమిష్టిగానున్న యితరదాయాది

9 వ్యష్టిగానున్నభిన్నోదరసోదరుడు

10 సమిష్టిగానుండనితల్లి

11 సమిష్టిగానుండనితండ్రి

12 భార్య

13 కుమార్తె

14 కుమార్తెకుమారుడు (దౌహిత్రుడు)

15 సోదరి

వీరిలో నెవరునూ లేనియెడల యిదివరలో నుదహరించిన వారసత్వపుక్రమము ప్రకారం సపిండులు, సమానోదకులు, బంధువులు మొదలగువారును క్రమముగా వారసులగుదురు.

2 స్మృతిచంద్రికాప్రకారము.

1 పురుషసంతానము (కుమారుడు, మనుమడు మునిమనుమడు వరుసనొకరు లేనపుడొకరు)

2 సమిష్టిగానున్న యేకోదర సోదరుడు

3 వ్యష్టియైన యేకోదరసోదరుడు

4 సమిష్టిగానున్న భిన్నోదరసోదరుడు

5 సమిష్టిగానున్న తండ్రి గాని పినతండ్రి లేక పెత్తండ్రిగాని

6 వ్యష్టియైన భిన్నోదర సోదరుడు

7 తండ్రి

8 తల్లి

9 భార్య

10 తోబుట్టువ

11 సపిండులు

12 సమానోదకులు మొదలగువారు

ఈరెండువిధముల వారసత్వపు క్రమములో యవరికేదివర్తించునాచారముకలదో వారికిదాని వర్తింపజేయనగును.

ప్రజలునేలు శ్రీచక్రవర్తిగారు

చనిపోయినవానికి యిదివరలో యుదహరించిన వారసులెవరును లేనియెడల వానియాస్తి ప్రజలనేలు శ్రీ చక్రవర్తి గారికి జేరును. 8 మూ. ఇం. అ. 500

బేవారసుఆస్తి (అనగా వారసులులేని వానియాస్తి) యిటులసర్కారువారికి జెందునపుడు వారసులకు చెందునపుడు వలెనే చనిపోయినవాని హక్కుబాధ్యతలతో సంక్రమించును. అనగా సర్కారువారు సదరాస్తిపైగల న్యాయమైన తనఖాలు మొదలగు బాధ్యతలకు లోబడిపొందుదురు. 11 మూ. ఇం. అ 619

# హిందూన్యాయశాస్త్రము.

# వారసత్వము.

## ఆరవ అధ్యాయము.

### స్త్రీధనము. వారసత్వపుక్రమము.

ఇంతవరకును పురుషులకుగల యాస్తులను గురించియు వారు చనిపోయినపుడు వారియాస్తులకు వారసత్వేనా పొందగల వారసుల క్రమమునుగురించియు తెలుసుకొనియుంటిమి. ఇపుడు స్త్రీలకు కలిగియుండగల యాస్తులనుగురించియు వారు చనిపోయినపుడు వారియాస్తులను వారసత్వేనా పొందగల వారసుల క్రమమునుగురించియు తెలుసుకొనవలసియున్నది.

సాధారణముగా స్త్రీలకు యుండగలయాస్తి రెండువిధములు.

1 వారసత్వముతోనా స్త్రీకి సంక్రమించినయాస్తి ఇట్టియాస్తియందు స్త్రీలకు దానవిక్రయాది యన్యాక్రాంతములు చేయుటకు స్వాతంత్ర్యముగాని సంపూర్ణమయినహక్కులుగాని యుండవు. మరియు నిట్టియాస్తి కలిగిన యొక స్త్రీ చనిపోయినమీదట సదరాస్తి యామె వారసులకు చెందుటకు బదులుగా యామెకు పూర్వమాయాస్తి యెవరిహక్కు భుక్తములలోనుండెనో యెవరినుండి సదరాస్తి యామెకు వారసత్వేనా సంక్రమించెనో యట్టివారివారసులకు సంక్రమించును. అనగా యాస్త్రీ కాలముచేయునరికి యాస్త్రీకి పూర్వపుహక్కుదారుని ముఖ్యవారసు లెవరుందురో వారికి సంక్రమించును. వారసత్వేనా

స్త్రీలకు సంక్రమించిన యాస్తియందు సకరాస్తిని యేటుపొందిన స్త్రీలకు యెట్టిహక్కులుండునో మును వేరేగ్రంథములో వివరముగా తెలియునుగాన నిచట నావివరములు దెల్పనవసరము లేదు. 2 వారసత్వము వలననగాక స్త్రీలకు ప్రత్యేకము సర్వస్వతంత్రమయిన హక్కులతో యొసగబడినటువంటిన్నీ దానవిక్రయాదియన్యాక్రాంతము చేయుటకు యొకప్పుడు వారిభర్తలవలనగలుగు యభ్యంతరములు తప్పనియేవిధమయిన యభ్యంతరములు లేనటువంటిన్నీ తాము చనిపోయిన యెడల తమస్వంతవారసులకే చెందునటువంటిన్నీ యాస్తులు స్త్రీధనమనబడును. ఈయధ్యాయములో స్త్రీలకు యుండగలయాస్తులలో రెండవ తరగతియగు స్త్రీధనమును గురించి మాత్రము విమర్శనచేయబడును.

స్త్రీధనమననేమి ?

స్త్రీధనము యనే మాటకు సాధారణముగా యాడమనిషికిగల సొత్తు (స్త్రీ=ఆడమనిషి; ధనము=సొత్తు) యనియర్థము కాని యీపదమును వేరువేరు న్యాయశాస్త్ర తరగతులవారు వేరువేరుయర్థములతో వాడుచున్నారు. గనుక యీపదముయొక్క యర్థమును పూర్ణముగా గ్రహించుటకుగాను స్మృతులలో యెటులచెప్పబడినదో ముందుకనుగొనుట మంచిది.

మనుస్మృతిప్రకారము స్త్రీధనము యారువిధములు.

1 అధ్యగ్నికము—వివాహమువేళ యగ్నిహోత్రుని సన్నిధియందు చదివింపబడు బహుమతులు మొదలగు స్త్రీధనము.

2 అధ్యావహనికము—పుట్టినింటనుండి అత్తవారియింటికి జనునపుడియ్యబడునట్టి స్త్రీధనము

3 ప్రీతిదత్తము—అత్తగారిచేతగాని మామగారిచేతగాని ప్రేమచే నీయబడినదియును, పాదవందనకాలమునం దియ్యబడినదియునైన స్త్రీధనము.



4 తండ్రిచేనియ్యబడు బహుమానములు.

5 తల్లిచేనియ్యబడు బహుమానములు.

6 సోదరునిచే నియ్యబడుబహుమానములు.

ఇట్టిమనుస్మృతిపై వ్యాఖ్యానకర్తలు పైజాబితాపూర్తియైనది కాదని చెప్పెదరు.

పైనయుదహరించిన జాబితాకు విష్ణునిచే యీదిగువ నుదహరింపబడిన స్త్రీధనతరగతులు జేర్చబడెను.

1 అధివేదనికము—భార్యయుండగా మరలపెండ్లియాడుటకుగాను నీయబడిన స్త్రీధనము.

2 అన్వాధేయకము—వివాహమయినతరువాత యత్తవారివైపు బంధువులుగాని పుట్టింటివారివైపు బంధువులుగాని యిచ్చినస్త్రీధనము.

3 శుల్కము—వివాహకట్నము యనగా వివాహమాడినందుకుగాను ప్రతిఫలముగా నీయబడిన స్త్రీధనము.

4 కుమారులవలనను యితరబంధువులవలనను నీయబడిన స్త్రీధనము.

కాత్యాయనుడు స్మృతులలో పైచెప్పబడిన స్త్రీధనమునకు పైన యుదహరించిన యర్థములచేయును భర్తతో కాపురముచేయుచున్న స్త్రీకి బంధువులుగాక యితరులు పైనయుదహరించిన సమయములందుగాక యితరసమయములందు ప్రేమచేనిచ్చెడు బహుమానములుగాని యామెనేర్పువలనజేయు చేతిపనులవలన సంపాదించిన సొత్తుగాని భర్తయధీనమైయుండును గనుక యట్టియాస్తి స్త్రీధనము కాదని చెప్పెను. అనగా యట్టియాస్తిని భర్తయనుమతిలేనిది భార్య తనయిష్టమువచ్చినటుల వినియోగించుట కర్హతలేదుగాన యది స్త్రీధనము కాదని యభిప్రాయము. దీనినిబట్టి యొకస్త్రీ తనవివాహమునకు పూర్వము యనగా కన్యగాయున్నపుడుగాని భర్తచనిపోయిన

తరువాతగాని ఇతరులచే నటుల ప్రేమచే పొందినటువంటిన్ని నేర్పుచే చేతిపనులవలన సంపాదించినటువంటిన్ని యాస్తి స్త్రీధనము కావచ్చును.

భర్త భార్యకు బహుమానముగా నిచ్చిన నగలు మొదలగునవి యామె స్త్రీధనమవునని దాదాపుగా యందరు స్మృతివ్యాఖ్యానకర్తల యభిప్రాయమైయున్నది.

యాజ్ఞవల్క్యస్మృతిప్రకారము స్త్రీధనమనగా—ఒక స్త్రీకి తన తండ్రి, తల్లి, భర్త లేక సోదరులవలన నీయబడినటువంటి యాస్తిగాని యామెవివాహకాలమందు బహుమానముగా పొందినయాస్తిగాని యామెభర్త మరియొక స్త్రీని వివాహమాడునపుడు తనకు బహుమానముగానిచ్చిన యాస్తిగాని తదితరాస్తిగాని స్త్రీధనమనబడును.

మరియు బంధువులవలన నీయబడినయాస్తియు వివాహకట్నము (శుల్కము) ను వివాహముయినతరువాత నీయబడినయాస్తియు గూడ స్త్రీధనమనబడుననియున్నది. కనుక స్మృతులలో స్త్రీధనము యనుపదము సాధారణముగా వ్యుత్పత్త్యర్థముగు స్త్రీయొక్క సొత్తు యను యభిప్రాయముతో నుపయోగింపబడలేదనియు యది ప్రత్యేకము విశేషార్థముతో నుపయోగించబడెననియు గ్రహింపనగును. అనగా దాని శబ్దార్థప్రకారము నుపయోగించినయెడల స్త్రీధనమనగా స్త్రీకిగలసొత్తు యెటువంటిదైనను కావచ్చును. స్మృతులలో దానియభిప్రాయమది కాదు. ఒక స్త్రీ తనబంధువులవలన బహుమానముగా పొందునట్టియు యితరులవలన తనవివాహకాలమందును యత్తవారి యింటికి జనెడుసమయమందును బహుమానముగా పొందునట్టియు యాస్తియును యామెనగలును వస్తువులునుకలసి స్త్రీధనమగునని యభిప్రాయము గాని వారసత్వేనా యామెకు దఖలుపడిన యాస్తియును యామెకు పెండ్లియైనతరువాత భర్తతోనుండగా బంధువులుగాక మరి యితరులవలన బహుమానముగా పొందుయాస్తియును యామెభర్త



తోనుండగా నేర్పుచే చేతిపనులవలన సంపాదించిన యాస్తియునుగూడ స్మృతులప్రకారము స్త్రీధనము కానేరదు. అయితే యాజ్ఞవల్క్యస్మృతిమీద విజ్ఞానేశ్వరుని వ్యాఖ్యానమగు మితాక్షరములో స్త్రీధనముయని పదమునకు యసలు స్మృతిలో చెప్పబడినదానికంటె యెక్కువ యర్థముచేయబడెను. అనగా పైనయుదహరించిన యాజ్ఞవల్క్యస్మృతిలో స్త్రీధనమన నెట్టిదో చెప్పుచూ యాఖరున ఆద్య యనగా తదితరాస్తియని చెప్పబడెను. అందువలన విజ్ఞానేశ్వరుడు తనమితాక్షరములో స్త్రీధనమను పదమునకు యర్థముపెంచి యదియొక స్త్రీ, వారసత్వమువలనగాని క్రయమువలనగాని విభాగమువలనగాని వ్యతిరేకభుక్తమువలనగాని సంపాదనవలనగాని పొందినయాస్తులన్నిటికిని వర్తించునటుల చెప్పెను, అనగా చివరకదెటువంటియాస్తియైనను సరే స్త్రీలకు చెందియున్నయెడల యది స్త్రీధనమనునటుల శబ్దార్థముప్రకారము నర్థముచేసెను. మితాక్షరమును న్యాయశాస్త్రతరగతిని మొదటియధ్యాయమాఖరున యివ్వబడిన న్యాయశాస్త్రజాబితాప్రకారము (1) బొంబాయితరగతి (2) బనారసుతరగతి (3) మిథిలతరగతి (4) మదరాసుతరగతి యని నాలుగుయంతర్భాగములుగా విభాగింపనగును. ఈతరగతులన్నియు మితాక్షరమును ప్రాధాన్యప్రమాణముగా నొప్పుకొన్నను ఆయాదేశములలో వాడబడు యితరప్రామాణ్యగ్రంథములనుబట్టిగూడ యచటచటి యభిప్రాయములు మారుచుండును. మదరాసులో యటులముఖ్యముగా వాడబడు ప్రమాణములైన యితరగ్రంథములు స్మృతిచంద్రిక, పరాశరమాధవీయమునైయున్నవి తరువాత సరస్వతీవిలాసము వ్యవహారనిర్ణయముగూడ వాడబడుచున్నవి. ఈనాలుగుగ్రంథములలోను స్త్రీధనముయను పదమునకు వేరు వేరు యర్థములున్నవిగాని మితాక్షరములో చెప్పబడినయర్థము కాదని ఖండితముగాగాని యేకయభిప్రాయముగాని వానిలోచెప్పబడి

యుండలేదు. గనుక మితాక్షరములో చెప్పబడినటుల స్త్రీధనమను పదమునకు యొక్కవయర్థము చేయుటయే మంచిదని మొదట మదరాసుహైకోర్టువారు యామోదించిరి. 21 మ 100 (103-105)

దీనినిబట్టి మదరాసుహైకోర్టువారు ఈదిగువనుదహరించిన సొత్తులను స్త్రీధనముగా భావించిరి.

1 మనోవర్తికిగాను స్త్రీకియిచ్చిన సొమ్మును యాసొమ్మువలన కొన్నయాస్తియును 28 మ 1

2 మదరాసులో వాడబడు ప్రమాణగ్రంథములలో వ్యతిరేక యభిప్రాయము లేనందున యొకస్త్రీకి పెండ్లియైనతరువాత భర్తతోనుండగా బంధువులుగాక ఇతరులవలన బహుమానముగా నీయబడిన యాస్తిగూడ యామెకు స్త్రీధనమగుననిరి. 21 మ 100

3 అటులనే భార్య భర్తతోనుండగా యామెవలన సంపాదింపబడినయాస్తియును స్త్రీధనమగుననిరి. 21 మ 100 (105) 38 మ1036

4 వ్యతిరేకభుక్తమువలన యొకస్త్రీ సంపాదించినయాస్తియును యామెకు నూతనముగా కనిపెట్టుటవలన దొరకినయాస్తియును స్త్రీధనమగుననిరి. 28 మ 1 (7)

5 కాని వారసత్వమురీత్యా యొకస్త్రీకిదఖలుపడినయాస్తిమాత్రము చిరకాలమునుండి మదరాసుహైకోర్టువారు పడినయభిప్రాయప్రకారము స్త్రీధనము కానేరదనిరి.

(1) ఒకస్త్రీకి పురుషులనుండి వారసత్వమురీత్యా సంక్రమించిన యాస్తి స్త్రీధనము కాదనిరి. 3 మ 290 ప్రి కౌ 25 మ 678(686)ప్రి కౌ)

(2)అటువలెనే ఒకస్త్రీకి స్త్రీనుండి వారసత్వేనా సంక్రమించిన యాస్తిగూడ స్త్రీధనము కాదనిరి. 32 మ 521; 29 మ 358; 19మ110 28 మ 1 (9-1.) మదరాసుహైకోర్టువారు మితాక్షరములో చెప్పబడిన ప్రకారము స్త్రీధనము యనుపదమునకు యొక్కవయర్థముయనగా



యందులో చెప్పబడిన యన్నివిధముల సొత్తునూ వర్తింపచేయనగునని యభిప్రాయముపడుచూ వారసత్వమురీత్యా స్త్రీకిసంక్రమించినయాస్తిమాత్రము స్త్రీధనముకాదని యభిప్రాయము పడుటకు రెండుకారణములుగలవు. మొదటిదియచటవాడబడుచున్న వ్యాఖ్యానగ్రంథములలో యట్టియాస్తిని స్త్రీధనముగా నెంచకపోవుట, రెండవది చిరకాలమునుంచి మదరాసుహైకోర్టువారట్టియాస్తిని స్త్రీధనముకాదని తీర్మానించుచుండుట.

6 కుటుంబాస్తిపంచుకొనుటలో తల్లి మొదలగు స్త్రీలకుగూడా వాటాపంచియిచ్చు నాచారమే మదరాసురాజధానిలోయములునందు లేదుగనుక మితాక్షరములో చెప్పబడినటుల పంపకములో స్త్రీకివచ్చు వాటాయాస్తి యామెకు స్త్రీధనమగునో కాదో యచటతీర్మానించుటకవసరమే లేకపోయినది ప్రీవీకవున్సిలువారుగూడా పురుషులనుండిగాని స్త్రీలనుండిగాని వారసత్వేనా స్త్రీలకు సంక్రమించినయాస్తి స్త్రీధనముగానేరదని తీర్మానించిరి 11 మ. ఇ. అ 487; 11 మ. ఇ. అ. 139; 25 అ 468=30 ఇ అ 202; 25 అ. 476=30 ఇ. అ. 209

అటువలెనే పంపకమువలన స్త్రీకిరాబడిన వాటాయాస్తిగూడా యామెస్త్రీధనము కాదని తీర్మానింపబడెను. 34 అ 234 ప్రి కౌ 39 ఇ. అ 121 గనుక మనదేశములో అనగా మదరాసురాజధానిలో స్త్రీధనమన నెట్టియాస్తికి వర్తించునో సంగ్రహముగా వివరింపనగును.

మదరాసురాజధానిలో స్త్రీధనము.

1 ఒక హిందూస్త్రీకి కన్యగానున్నపుడుగాని భర్తతో కాపురము చేయునపుడుగాని విధవగానున్నపుడుగాని యామెతల్లితండ్రులవలనగాని వారిబంధువులవలనగాని భర్తవలనగాని వానిబంధువులవలనగాని నీయబడినయాస్తి స్త్రీధనమగును 31 మ 179

2 ఒకహిందూస్త్రీకి కన్యగానున్నపుడుగాని వివాహసమయ మందుగాని వివాహామయినతరువాత భర్తతో కాపురముచేయునపుడు గాని వితంతుగానున్నపుడుగాని యాబంధువులుగాక యన్యులవలన నీయబడుయాస్తిగూడ స్త్రీధనమగును. 21 మ 100

3 ఒకహిందూస్త్రీకి భర్తతో కాపురంచేయుచున్నపుడు గాని వితంతుగానున్నపుడుగానియామెమనోవర్తినిమిత్తముయేకముగాసొమ్ముగాలేక చరాస్తిగాని సంపూర్ణమయిన హక్కులతో స్థిరాస్తిగాని యొడంబడిక ద్వారాగాని (అనగా ఇచ్చినవారియొక్కయు పుచ్చుకొన్న వారియొక్కయు ఇష్టముమీాద), కోర్టువారిడిక్రీద్వారాగాని నీయబడిన యాస్తి స్త్రీధనమగును 1 మ 166; 28 మ 1; 34 అ 234=39 ఇ. అ 121 ప్రి కౌ. 21 మ 100

4 ఒకహిందూస్త్రీ కన్యగానున్నపుడుగాని వివాహమై భర్తతో నున్నపుడుగాని వితంతుగానున్నపుడు గాని తననేర్పువలన పాటుపడి సంపాదించినయాస్తి స్త్రీధనమగును 21 మ 100 (105); 38 మ 1036

5 ఒకస్త్రీకి తనకుగల స్త్రీధనమునందు హక్కువదులుకొని నందుకు ప్రతిఫలముగా రాజీనామాప్రకారం నీయబడినయాస్తి స్త్రీధనమగును 31 మ. 179

6 ఒకస్త్రీ వివాహమై భర్తతోనున్నపుడుగాని వితంతుగానున్న పుడుగాని వ్యతిరేకభుక్తమువలన సంపాదించినయాస్తి స్త్రీధనమగును.

7 ఒకస్త్రీ తనస్త్రీ ధనమువలనకొనినయాస్తియు తనస్త్రీధన మువలనవచ్చురాబడియు స్త్రీధనమగును. 2 మ 333 ప్రీ. కౌ.

మదరాసురాజధానిలో స్త్రీధనముకానివి.

(1) ఒకస్త్రీకి పురుషులనుండిగాని స్త్రీలనుండిగాని వారసత్వేనా సంక్రమించినయాస్తి స్త్రీధనము కానేరదు.



(2) స్త్రీలకు ప్రత్యేకము కుటుంబాస్తిలోనుండి వాటా యిచ్చురివాజు యిచటలేదు గాని యట్టిది యితరదేశములందువలెనే స్త్రీధనము కానేరదని నూహింపనగును.

స్త్రీలకు స్త్రీధనమునందుగల హక్కులు.

(1) ఒకస్త్రీ కన్యగానున్నప్పుడు అనగా వివాహము కానపుడు తనకుగల స్త్రీధన మేతరగతిలో చేరినదైనను దానిని తనయిష్టము వచ్చినటుల స్వేచ్ఛగా వినియోగించుకొనవచ్చును. కాని యామె మైనరుగానున్నయెడలమాత్రము యామెస్త్రీధనమును యటుల స్వేచ్ఛగా వినియోగించుకొనుటకు ప్రతిబంధకముండును. అనగా యామె మైనరుగానున్నయెడల తనస్త్రీధనమును తనయిష్టముప్రకారము వినియోగించకూడదు.

(2) అటులనే మయినరుగాయుండని (అనగా మేజరుగానున్న) వితంతుస్త్రీ, తనభర్తయున్నపుడుగాని చనిపోయినతరువాతగాని సంపాదించిన యన్నితరగతుల స్త్రీధనపుయాస్తిని తనయిష్టమువచ్చినటుల స్వేచ్ఛగా వినియోగపర్చుకొనవచ్చును. 1 మ 281 (286)

(3) అయితే ఒకస్త్రీ వివాహమై భర్తతోనున్నపుడుమాత్రము తనకుగల స్త్రీధనమునందు తనకెంతవరకు హక్కులుండునో యా స్త్రీధనముయొక్క తరగతినిబట్టి యుండును. ఈసందర్భములో యట్టి స్త్రీధనమును సౌదాయికమనియు అదిసరమనియు రెండుతరగతులుగా విభాగింపనగును.

(1) సౌదాయికమనగా యొకస్త్రీకి వివాహమునకు పూర్వము గాని వివాహకాలమందుగాని యాదరిమిలానుగాని తనతల్లిదండ్రులవలనగాని వారిచుట్టములవలనగాని తనభర్తవలనగాని వానిచుట్టములవలనగాని బహుమానముగా నీయబడిన యాస్తులని భావము. అనగా యన్యులవలనగాక చుట్టములవలన నీయబడిన యాస్తియని భావము.

39 మ 268 సౌదాయికమనబడిన స్త్రీధనమునందు స్త్రీకి సంపూర్ణమయిన స్వాతంత్ర్యములుండును. ఆమె భర్తతో కాపురము చేయునప్పుడుగూడా భర్తయనుమతి లేకుండా యామెయిష్టమువచ్చినటుల సదరాస్తిని స్వేచ్ఛగా వినియోగపర్చుకొనవచ్చును. అనగా దానవిక్రయాదియన్యాక్రాంతములు స్వేచ్ఛగా జరిగించుకొనవచ్చును. 2 మ 333 ప్రి కౌ. 1 మ 281.

ఇట్టియాస్తియందు భర్తకు యేవిధమయినజోక్యముగాని యధికారముగాని లేదు. కాని యాపత్కాలమందుమాత్రము దానిని భర్త తగుమాత్రము వినియోగించుకొనవచ్చును. ఆపత్కాలమందు అనగా క్షామము (కరవు) జబ్బు, దుఃఖము, చెరసాలయందుండుట మొదలగు సమయములయందని భావము. ఆపత్కాలమందు భార్యసొత్తును భర్త యుపయోగించుకొను హక్కు యతనికిమాత్రమే వర్తించును గాని యతనిస్వారే యతని ఋణదాతలకు తమకురావలసిన బాకీలను సదరాస్తివలన రాబట్టుకొనుటకు హక్కులుండవు. 8 బొం. హై. కో. 120 (అప్పీలు కేసు)

పైన యుదహరించిన సౌదాయికమను స్త్రీధనమందు స్త్రీకి దానవిక్రయాది యన్యాక్రాంతములుచేయుటకు సంపూర్ణమైన హక్కులుండునని చెప్పుటలో సదరాస్తిని మొదట యాస్త్రీకిచ్చిన చుట్టము యటుల సంపూర్ణమయిన హక్కులతో నిచ్చియుండవలెననియూహింపనగును.

(2) సౌదాయికముగాక యితరస్త్రీధనమనగా స్త్రీలకు చుట్టములవలనగాక యన్యులవలన నీయబడినదియు స్త్రీలుపాటుపడి చేతిపనులు మొదలగువానిచే వారు సంపాదించినదియునైనగు యాస్తియని యర్థము. అట్టి స్త్రీధనమందు భర్తయుండగా భార్యకు సర్వస్వాతంత్ర్యమయిన హక్కులుండవు. అనగా భర్తయనుమతిలేనిదే భార్య దానవిక్రయాదియన్యాక్రాంతములు చేయవీలులేదు. స్మృతిచంద్రిక 9 యధ్యాయము; 21 మ 100 (105). అట్టియాస్తి భర్తయధీనమందుండును. ఆపత్కాలము గాకపోయినను భర్త యట్టి స్త్రీధనమును తనయిష్టమువచ్చినటుల యుపయోగించుకొనగలడు. అట్టి స్త్రీధనమును భార్యయిష్టమువచ్చినటుల వినియోగించుకొనుటకు యామెభర్తప్రతిబంధకమేగాని మరియెవరిప్రతిబంధకము లేదు గనుక భర్తచనిపోయినతరువాత సదరాస్తిని యాస్త్రీ తనయిష్టమువచ్చినటుల స్వేచ్ఛగా వినియోగించుకొనవచ్చును. భర్తయుండగా భార్య చనిపోయినను భర్త కాలముచేసినతరువాత భార్య చనిపోయినను యట్టిస్త్రీధనము యామెయొక్క స్త్రీధనమునకు సంబంధించిన వారసులకే సంక్రమించును గాని భర్తకుగాని భర్తవారసులకుగాని సంక్రమించదు. 21 మ 100.



### స్త్రీధనము వారసత్వక్రమము.

ఒకస్త్రీయొక్క స్త్రీధనమునకు వారసత్వక్రమము ఈదిగువ నుదహరించిన యంశములనుబట్టి మారుచుండును.

1 ఆస్త్రీకి వివాహమయ్యెనా లేక కన్యగానుండెనా యను యంశమునుబట్టియు

2 వివాహమైయుండినయెడల యావివాహము శాస్త్రసమ్మతమయినదా? (Approved form) లేక శాస్త్రసమ్మతమయినదికాదా (Unapproved form) యను యంశమును బట్టియు

3 ఆమెకాస్త్రీ ధనమెటుల సంప్రాప్తమయ్యెనను యంశమును బట్టియు

4 ఆమె యేతరగతిన్యాయశాస్త్రమునకు సంబంధించినదో యను యంశమునుబట్టియు

యామెస్త్రీధనమునకు వారసత్వక్రమమును నిర్ధారణచేయనగును. అయితే యిదివరలో చెప్పినటుల మనకుముఖ్యముగా సదరా

ను రాజధానిలో వర్తించు మితాక్షరన్యాయశాస్త్రతరగతిప్రకారము మాత్రమే వారసత్వపుక్రమమును తెలుసుకొనుచుంటిమి. గాన పైన యుదహరించిన నాలుగవయంశము విషయమై పరిశీలించనవసరమంతగా కనుపించదు. గనుక మిగతా మొదటి మూడుయంశముల విషయమై వరుసగా విమర్శన చేయవలసియున్నది. అనగా మదరాసు రాజధానిలో వర్తించు మితాక్షరన్యాయశాస్త్రతరగతిప్రకారము మొదటి మూడు యంశములను బట్టియే స్త్రీధనమునకు వారసత్వపుక్రమము నిర్ధారణ చేయవలయును.

### మొదటిది కన్యక వారసత్వపుక్రమము.

వివాహముకాని కన్య చనిపోయిన యెడల యామెయొక్క ఆభరణములు దుస్తులు మొదలుగాగల స్త్రీధనము యామెయొక్క ఏకోదర సోదరునికి సంక్రమించును. అట్టిసోదరుడు లేనియెడల తల్లికిని యామె లేనియెడల తండ్రికిని తండ్రియు లేనియెడల యతని సపిండులకును తరువాత తల్లిసపిండులకును యటుపిమ్మట యాకన్యయొక్క సపిండులకును సంక్రమించును. అనగా

1 ఏకోదరసోదరుడు
2 తల్లి
3 తండ్రి
4 తండ్రియొక్క సపిండులు
5 తల్లియొక్క సపిండులు
6 చనిపోయినకన్యయొక్క సపిండులు

వరుసగా రక్తసంబంధసామీప్యమును బట్టి వారసులగుదురు. దీనిబట్టి మిగతా వారసులక్రమమును యూహించవచ్చును.

ఉదాహరణములు——



1 చనిపోయినకన్యయొక్క తండ్రి తల్లితోబుట్టువ యామెయొక్క తల్లితల్లి (మాతామహి) కంటే ముఖ్యవారసురాలని తీర్మానింపబడెను. 32 బొం 409

2 ఆమెయొక్క సవతితల్లి (తండ్రికి రెండవపెండ్లి భార్య) పినతల్లి (తల్లితోబుట్టువ) కంటే ముఖ్యవారసురాలు 38 మ 45

3 ఆమె మేనత్తకంటే (తండ్రిసోదరి) పినతండ్రికుమారుడు (తండ్రిసోదరునికుమారుడు) ముఖ్యవారసుడు 43 మ 32

### వివాహమైన స్త్రీయొక్క స్త్రీధనమునకు వారసత్వపుక్రమము.

ఈసందర్భములో వారసత్వపుక్రమమును దెలియుటకు ముఖ్యాధారములయిన రెండుయంశముల విషయమై ముందు తెలుసుకొనవలయును. మొదటిది చనిపోయిన స్త్రీకి నెట్టివివాహమయ్యెనను యంశము. రెండవది యాస్త్రీకిగల స్త్రీధనమెట్టిది యనుయంశము. ప్రస్తుతము న్యాయశాస్త్రప్రకారము మనములలోయున్న వివాహములు బ్రాహ్మము, ఆసురము యని రెండువిధములు. బ్రాహ్మముయనగా సాలంకృతకన్యాదానము అనగా కన్యనిచ్చి పెండ్లిచేయువారు, పెండ్లికుమారునివలన యెంతమాత్రమును ప్రతిఫలమును పొందకయే తమకుతోచినయలంకారములతో కన్యనిచ్చిచేయువివాహమని తాత్పర్యము. ఆసురమనగా కన్యనిచ్చి పెండ్లిచేయువారు తమకన్యనిచ్చినందుకు కొంతప్రతిఫలము పుచ్చుకొనిచేయు వివాహమని తాత్పర్యము బ్రాహ్మము శాస్త్రసమ్మతమయినది (Approved form) ఆసురము శాస్త్రసమ్మతమయినది కాదు (Unapproved form) అయినను న్యాయశాస్త్రప్రకారము యీరెండును యన్నికులములలోనూ చెల్లతగినవిగానే యున్నవి. పెండ్లికుమార్తెకుగాని యామెతల్లికిగాని వారియందుగల ప్రేమలేక గౌరవమును కనపరచుటకుగాను బహుమానముగానిచ్చినంత

మాత్రమునఁ యావివాహము ఆసురము Unapproved form of marraige కాజేరదు. 32 మ 512; 37 బొం. 295; 33 బొం. 433

యీరెండుతరగతుల వివాహములలోఁగల భేదములనుబట్టియే వారసత్వపుక్రమము భేదించును. అనగా మొదటితరగతివివాహమాడి చనిపోయిన స్త్రీయొక్క స్త్రీధనమున కొకవిధముగాను, రెండవతరగతి వివాహమాడి చనిపోయిన స్త్రీయొక్క స్త్రీధనమున కొకవిధముగాను వారసత్వపుక్రమముండును. అయితే యొకస్త్రీయొక్క వివాహ మేతరగతిదైయుండునని ప్రశ్నకలిగినప్పుడు యది రెండవతరగతి వివాహమని స్పష్టముగా రుజువయిననే తప్ప యాతవరకును యది మొదటితరగతి వివాహమేయై యుండునని యూహించవలసియుండును 32 మ 512; 33 బొం. 433. (437) 34 బొం 553

వారసత్వపుక్రమమునకు సంబంధించినంతవరకు, వివాహము కాబడిన స్త్రీకి యుండెడు స్త్రీధనము (1) శుల్కము (2) యౌతకము 3) అయౌతకము అని మూడుతరగతులుగా విభాగింపనగును.

శుల్కమనగా వివాహమాడినందుకుగాను ప్రతిఫలముగా పెండ్లికుమార్తెనిమిత్తము నియ్యబడిన స్త్రీధనమని యర్థము.

యౌతకమనగా వివాహకాలమందు పెండ్లిపీటమీదభర్తతో కలసి యగ్నిహోత్రునిసాక్షిగా యున్నపుడు బహుమానములుగా పొందిన స్త్రీధనము

అయౌతకమనగా యౌతకముకాని స్త్రీధనము స్మృతిచంద్రికలో భర్తృదత్తము, అన్వాధేయకము యని మరిరెండువిధముల స్త్రీధనము గూడా వివరించెను. భర్తృదత్తమనగా భార్యకు భర్తవలన నీయబడినది. అన్వాధేయకమనగా పుట్టింటివారివైపు బంధువులవలనగాని అత్తింటివారివైపు బంధువులవలనగాని వివాహమైనతరువాత యియ్యబడిన స్త్రీధనము,



మితాక్షరప్రకారము వారసత్వపుక్రమమునకు సంబంధించినంతవరకు స్త్రీధనము (1) శుల్కము (2) తదితరములని రెండువిధములుగా మాత్రమే విభాగింపబడెను. అనగా మితాక్షరముప్రకారము శుల్కమను స్త్రీధనమునకుతప్ప మిగతాతరగతుల స్త్రీధనములకన్నిటికిని యొకటే వారసత్వపుక్రమమని యేర్పడుచున్నది.

మితాక్షరముప్రకారము శుల్కమను స్త్రీధనమునకు
వారసత్వపుక్రమము.

1 ఏకోదరసోదరులు

2 తల్లి

3 తండ్రి

4 తండ్రివారసులు అనగా వానిసపిండులు సమానోదకులు బంధువులు మొదలగువారు

అనగా వీరిలో యొకరులేనియెడల తరువాతవారికి వరుసగా సంక్రమించుననిభావము.

మితాక్షరముప్రకారము శుల్కముగాక ఇతరములైన
స్త్రీధనమునకు వారసత్వపుక్రమము.

అట్టిస్త్రీధనముగల స్త్రీచనిపోవునప్పుడు వరుసగా నీదిగువ నుదహరింపబడినవారు వారసులగుదురు.

1. వివాహముకానికుమార్తె

2 వివాహముకాబడినబీదకుమార్తె 3 క. 587; 5 ఇ ఆ. 40 ప్రీకౌ

3. వివాహముకాబడిన భాగ్యవంతురాలైనకుమార్తె 3 బొం

229

4 కుమార్తెకుమార్తె 28 మ 1.

5. కుమార్తెకుమారుడు 28 మ 1

6. కుమారుడు 27 మ 200 ఒకకుమారునికంటె యెక్కువ మందియున్నపుడు వారు ప్రత్యేకహక్కులతో As tenants in common పొందుదురు.

ఇచట కుమారుడనుపదము యాస్త్రీయొక్క స్వంతకుమారునికిగాని సవతికుమారునికి వర్తించదు. 33 బొం 452. మరియును కుమారుడు యనుపదము తనకు వివాహమైన భర్తవలనగాక జారత్వమువలన మరియొకనివలన తనకుబుట్టినవానికిగూడ వర్తించదు. అట్టి కుమారునికంటె భర్తయే ముఖ్యవారసు యగును. 32 మ 512.

7. కుమారుని కుమారుడు.

పైవారిలో నెవరును లేనియెడల అనగా చనిపోయినస్త్రీకి స్త్రీపురుషసంతానము లేనపుడు యాస్త్రీయొక్క వివాహము బ్రాహ్మము (శాస్త్రసమ్మతమైనది. Approved form) గా నుండినయెడల యామెభర్తకును వానితరువాత మామూలువారసత్వపుక్రమముప్రకారము వానివారసులకును సదరాస్తి సంక్రమించును. 33 బొం 452 మరియొకభార్యవలన గలిగిన కుమారునికంటె తానే ముందువారసగునని గ్రహించునది. ఆమెభర్తవారసు లెవరును లేనియెడల యాస్త్రీయొక్క రక్తబంధువులకు సంక్రమించును. 37 మ 293.

అటులగాక యాస్త్రీయొక్క వివాహము అసురము (శాస్త్రసమ్మతముకానిది Unapproved form) గా నుండియున్నయెడల యామె స్త్రీధనము ముందు తల్లికిని తరువాత తండ్రికిని వారిరువురు లేనియెడల తండ్రివారసులకును సంక్రమించును. 29 మ 358.

మదరాసు రాజధానిలో మితాక్షరముతరువాత ప్రమాణములుగా గైకొనబడు వ్యాఖ్యానగ్రంథములలో స్మృతిచంద్రిక పరాశరమాధవీయము సరస్వతీవిలాసము వ్యవహారనిర్ణయము ముఖ్యములైనవని యిదివరలో చెప్పబడియున్నది. స్త్రీధనమువిషయమై యేయొకధ



ర్మసందేహము కలిగినపుడందువిషయమై యీనాలుగువ్యాఖ్యానగ్రంథములలోను భిన్నాభిప్రాయములున్నయెడల అనగా యేకాభిప్రాయము లేనియెడల అందువిషయమై మితాక్షరములో చెప్పబడినప్రకారము దానిని పరిష్కరించుటయే యుత్తమమని యీమధ్యను మద్రాసుహైకోర్టువారి యభిప్రాయమై యున్నది. 21 మ 100 103, 104. గనుక నాలుగువ్యాఖ్యానగ్రంథములలోను స్త్రీధనమునకు వారసత్వమువిషయమై కొంచము విరళముగాగల స్మృతిచంద్రికనుబట్టి ముందువారసత్వపుక్రమమును తెలుసుకొనిన తరువాత దానిని మదరాసుహైకోర్టువారెంతవరకు నామోదించిరో కనుగొనవచ్చును.

స్మృతిచంద్రికప్రకారము స్త్రీధనమునకు వారసత్వపుక్రమము.

స్మృతిచంద్రికప్రకారము స్త్రీధనమనగా యొకస్త్రీకి చుట్టములవలన యెపుడైనను నీయబడిన బహుమానములును, యన్యులవలన పెండ్లికాలమందును పుట్టినింటనుండి యత్తవారింటికి జనునపుడును నీయబడిన బహుమానములును యని యర్థముగాని మితాక్షరములోవలె తదితరబాపతుసొత్తులు స్త్రీధనము కానేరదు.

అట్టి స్త్రీధనము స్మృతిచంద్రికప్రకారము నాలుగువిధములు.

1. శుల్కము. 2. యౌతకము. 3. భర్తృదత్తము, అన్వాధేయకము. 4. తదితరము. వీనియర్థములు యిదివరలో మొదటనే తెలుపబడియున్నది. కనుక స్మృతిచంద్రికప్రకారము యీనాలుగుతరగతుల స్త్రీధనములకు వారసత్వపుక్రమమును తెలిసియుండుట మంచిది.

1. శుల్కమునకు వారసత్వపుక్రమము—ఇదివరలో మితాక్షరములో చెప్పబడిన విధమునే స్మృతిచంద్రిక యవలంబించినదిగాన దానిని వేరుగా నిచట చెప్పనవసరము లేదు.

2. యౌతకమునకుముందు వివాహముకాని కుమార్తెలు వారసులు; వారులేనియెడల మితాక్షరములో చెప్పబడినప్రకారము యీ తండ్రివివాహము బ్రాహ్మమైనయెడల భర్త మొదలగువారును ఆసురమైనయెడల తలిదండ్రులు మొదలగువారును వారసులగుదురు.

3. భర్తృదత్తము, అన్వాధేయకములకు కుమారులును కుమార్తెలును యేకముగా సమానవారసులు. అనగా సదరు స్త్రీధనము వారికి సమానముగా సంక్రమించును. ఇచట కుమార్తెలను పదము వివాహముకాని వారికిని వివాహమై వారిభర్తలు జీవించియున్నవారికి నిగూడ వర్తించును. గాని వితంతువులుగానున్న కుమార్తెలకు వర్తింపదు. అనగా యట్టిస్త్రీధనము వివాహముకాని కుమార్తెలు, వివాహమై భర్తలుగల కుమార్తెలకు వరుసగా సంక్రమించునుగాని వితంతుకుమార్తెలకు సంక్రమించదని తాత్పర్యము.

4. తదితరమైన స్త్రీధనము.

మొదట వివాహముకాని కుమార్తెలును వివాహమైనను బీదవారగు కుమార్తెలకును సమానముగా సంక్రమించును. అటుపిమ్మట మితాక్షరములో చెప్పబడిన వారసత్వపు క్రమప్రకారము సంక్రమించును. దీనినిబట్టి స్మృతిచంద్రికప్రకారము వారసత్వపుక్రమములో కొన్నిలోటులున్నటుల స్పష్టముకాగలదు.

ఉ — (1) యౌతకమునకుముందు వివాహముకాని కుమార్తెలు వారసులని యున్నదేగాని వారులేనియెడల యితరసంతానమున కెట్టుల సంక్రమించునో మొదలగుయంశములు చెప్పబడియుండలేదు.

(2) భర్తృదత్తము, అన్వాధేయకములకు కుమార్తెలు కుమారులు వారసులగుదురని యున్నదిగాని వారు లేనియెడల యెవరు వారసులగుదురో తెలియపరచియుండలేదు.



మదరాసుహైకోర్టువారు స్త్రీధనమువిషయమై మితాక్షరమును స్మృతిచంద్రిక మొదలగు యితరవ్యాఖ్యానములను పరిశీలించగా తెలిసినయంశము లేవనిన —

1 స్త్రీధనముయొక్క యర్థమువలెనే వారసత్వపుక్రమము గూడ స్మృతిచంద్రిక మొదలగు యితరవ్యాఖ్యానములలో వేరువేరు విధములుగా వివరింపబడినదిగాని యొకవిధముగా నుండలేదు.

(2) ఆవ్యాఖ్యానకర్తలు వేరువేరుస్మృతులలో చెప్పబడినయంశములను సమన్వయించుటకు ప్రయత్నించుటలో స్త్రీధనమునకు వారసత్వపుక్రమమును వేరువేరు విధములుగాజెప్పి యనవసరముగా గ్రంథమును పెంచిరి.

(3) ఇంతకు యొకవ్యాఖ్యానములోనూ వారసత్వపుక్రమము పూర్తిగా లేదు.

(4) మితాక్షరములో నటులకాదు. స్త్రీధనముయొక్క యర్థమెంతచక్కగా నిర్ధారణ చేయబడినదో యటులనే వారసత్వపుక్రమమువిషయమై మితాక్షరములోగల సూత్రములుగూడ సంతవిపులముగాను పూర్ణముగాను న్యాయముగాను సులభముగా యమలు జరుగగలవిగాను యున్నవి.

పైకారణములచే మదరాసుహైకోర్టువారు స్త్రీధనమువిషయములో మితాక్షరమును ప్రధానమైన ప్రామాణ్యముగా నంగీకరించుటయేగాక దానిప్రకారము శుల్కమను స్త్రీధనమునకుతప్ప మిగతా యితరతరగతుల స్త్రీధనములకన్నిటికిని వారసత్వపుక్రమము యొక్కటేయని వక్కాణించిరి. గనుక నిపుడు మదరాసురాజధానిలో స్త్రీధనమునకు వారసత్వపుక్రమము మితాక్షరముప్రకార మమలులో నున్నదని యెరుంగునది.

ఉదాహరణములు:—

(1) ఒకస్త్రీయొక్క అయౌతకస్త్రీధనమున కామెయొక్క వివాహముకాని కుమార్తెవివాహమయినకుమార్తెలకంటెను కుమారునికంటెను భర్తకంటెను ముఖ్యవారసుయని తీర్మానింపబడెను. 21 మ 58

(2) అటువలెనే ఒకస్త్రీకి వివాహమయినతరువాత తండ్రివలన నీయబడిన స్థిరాస్తికి యామెకుమార్తె వారసుయని తీర్మానింపబడెను 21 మ 100

(3) ఏవిధమయిన సంతానములేని స్త్రీయొక్క స్త్రీధనము యామెయొక్కవివాహము బ్రాహ్మము అయినందున Apporved form యామెభర్తకును అతనులేనియెడల మితాక్షరములో చెప్పబడినవరుసను యతనిసపిండులకును సంక్రమించుననిరి. 36 మ. 116 అనగా భర్త లేకపోయినను యామె స్త్రీధనము భర్తకు చెందినదనుకొనినపుడు యతనియాస్తి యెటుల సంక్రమించునో యటులనే యిట్టియాస్తి సంక్రమించునని భావము. అటులనే యీయామెవివాహము ఆసురమైనయెడల Unapproved form యామె స్త్రీధనము యామెతండ్రికిని తరువాత యతనిసపిండవారసులకును చెందును.

(4) మితాక్షరసూత్రమునుబట్టి బ్రాహ్మము. వివాహము కాబడిన యొకస్త్రీయొక్క స్త్రీధనమునకు యామె మేనమామ కుమారునికంటే భర్తయొక్క సోదరునికుమార్తె ముఖ్యవారసుయని తీర్మానింపబడెను. 21 మ. 263

(5) ఒకస్త్రీయొక్కవివాహము ఆసురము Unapproved form అయినపుడు యామె స్త్రీధనమునకు యామె తోబుట్టువ కుమారునికంటే తోబుట్టువ ముఖ్యవారసనిరి. 29 మ 358

(6) ఒకస్త్రీకి తండ్రియొక్క సాపిండులుగాని భర్తయొక్క



సాపిండులుగాని లేనపుడు యామెయొక్క రక్తబంధువులు వారసులగుదురు వారునులేనియెడల శ్రీచక్రవర్తికి జెందును 37 మ 293.

మరియును స్త్రీధనము వారసత్వేనా సంక్రమించు విషయములో నీదిగువయంశములు దాదాపుగా యన్నిదేశములన్యాయశాస్త్ర తరగతులకును వర్తించునుగాన వానినిగూడ ముఖ్యముగా గమనించవలయును:—

(1) ఒకస్త్రీయొక్క స్త్రీధనము యిరువురకుగాని యంతకంటే నెక్కుడుమందికిగాని కలసిసంక్రమించునపుడా వారసులు సమిష్టి కుటుంబమెంబరులయినను వారికిసదరాస్తిమాత్రము ప్రత్యేకముగా (As tenants in Common)సంక్రమించును అనగాయట్టియాస్తియటుల సంక్రమించినతరువాత వారిలోనెవరైన సంతానములేకుండా చనిపోయినయెడల వానికిసంక్రమించినయాస్తి మిగతాకుటుంబమెంబర్లకు సమిష్టికుటుంబాస్తి సంక్రమణన్యాయప్రకారము (Doctrine of Sur) vivorship సంక్రమించుటకు బదులుగా వానిభార్య కుమార్తె మొదలగు వాని స్వాంత వారసులకు జెందును. 27 మ. 300

(2) చనిపోయినస్త్రీయొక్క వారసులలో రెండవతరమువారు అనగా కుమారుల కుమారులు, కుమార్తెలకుమారులు, కుమార్తెల కుమార్తెలు, యామెస్త్రీధనమునుకుటుంబశాఖాసంఖ్యాసంబంధమయిన సంక్రమణన్యాయప్రకారము (Perstirpes) బడయుదురు. 27 మ 30) (308)

ఉదాహరణములు—ఒకస్త్రీ చనిపోయేసరికి యామె కొక కుమార్తెవలన యిరువురుకుమారులును మరియొక కుమార్తెవలన ముగ్గురు కుమారులునుగలరు. అనగా యామెజీవితకాలములోనే కుమార్తెలు కాలముచేయ్యగా వారిబాపతుపైనయుదహరించిన అయిదుగురు దౌహిత్రులుగలరు. ఇటులుండగా యామె చనిపోయినయెడల

యామె స్త్రీధనములో సగము మొదటికుమార్తె కుమారులిరువురకును మిగతాసగము రెండవకుమార్తె కుమారులు మువ్గురకును సంక్రమించును గాని అయిదుగురు మనుమలకు నైదుసమపాలాలుగ సంక్రమించదని భావము.

(3) ఒక స్త్రీయొక్క స్త్రీధనము పురుషవారసులకు సంక్రమించినయెడల యాపురుషులకు సదరాస్తియందు సర్వస్వతంత్రమైన హక్కులుండును తరువాతవారు చనిపోయినయెడల సదరాస్తి వారి వారసులకే సంక్రమించునుగాని వారికి పూర్వము హక్కుదారులగు స్త్రీవారసులకు సంక్రమించనేరదు.

(4) ఒక స్త్రీయొక్క స్త్రీధనము స్త్రీవారసులకు సంక్రమించునపుడు యట్టి స్త్రీవారసులకు సదరాస్తియందు సంపూర్ణమయిన హక్కులుండక మితమయిన హక్కులుమాత్రమే యుండును. తరువాత యాస్త్రీవారసు చనిపోయినయెడల సదరాస్తి యామెకు పూర్వము హక్కుదారు రాలెవరైయుండిరో లేక యెవరినుండి తనకుసదరాస్తి సంక్రమించెనో అట్టిస్త్రీయొక్క వారసులకుచెందును. 19 మ. 110-29 మ. 358. 32 మ. 521

(5) ఒక స్త్రీయొక్క స్త్రీధనము మరియొక్క స్త్రీకి వారసత్వేనా సంక్రమించుటకు యావారసుయొక్క వ్యభిచార మొక ప్రతిబంధకము కానేరదు. 26 మ 509

### వ్యభిచారవృత్తిచే సంచరించెడి వారిస్త్రీధనమునకు వారసత్వపుక్రమము.

స్త్రీలు వ్యభిచారవృత్తిచే సంచరించుటవలన కులముచెడినను వారికిని తమ యసలుకుటుంబమువారికిని పరస్పరముగల రక్తసంబంధము పోనేరదు గనుక యామె చనిపోయినతరువాత యామెయాస్తి



మామూలు స్త్రీధనమునకు వారసత్వపుక్రమమువలెనే వారసులకు క్రమముగా సంక్రమించవచ్చును.

ఉదాహరణములు—

(1) ఒక స్త్రీ వ్యభిచారిణిగానుండి చనిపోయినపుడు యితరవారసులెవరును లేనందున యామెయాస్తి సవతికుమారునికి చెందునని తీర్మానింపబడెను. 23 మ 171.

(2) అట్టిస్థితిలో యొకవ్యభిచారిణియొక్క యాస్తి యామెయసలు భర్తకు చెందునని తీర్మానింపబడెను. 29 అ 4.

(3) ఒకవ్యభిచారిణిస్త్రీకి పెండ్లిభర్తవలన కలిగిన కుమారులును వ్యభిచారమువలన కలిగిన కుమారులును యున్నపుడు యామె యాస్తి పెండ్లిభర్తవలన కలిగిన కుమారులకు సంక్రమించునని తీర్మానింపబడెను. 38 మ 1144

అటులనే నొకస్త్రీ భర్తతో కాపురముచేయునపు డొకకుమార్తె కలిగెను. తరువాత నామె భర్తనువదలి వ్యభిచారమువలన కుమారులను బడసెను. ఆమె చనిపొయ్యేసరికి మొదటిభర్తవలన కలిగిన కుమార్తె కాలము చేసెను. గాని యాకుమార్తెకొక కుమార్తె గలదు. ఇట్టిస్థితిలో యామెయాస్తికి వ్యభిచారమువలన గలిగిన కుమారులకంటె భర్తవలనగలిగిన కుమార్తెయొక్క కుమార్తె ముఖ్యవారసు యని తీర్మానింపబడెను. 24 మ ల జ 223.

(5) ఒకవ్యభిచారిణియొక్కయాస్తికి కుమార్తె వారసుగా తీర్మానింపబడెను. 31 బొం 495.

(6) మరియొక కేసులో యొకవ్యభిచారిణియాస్తికి యామెసోదరుని కుమారుడు వారసుగా బడసెను. 40 క 650.

(7) ఒక స్త్రీకి వ్యభిచారమువలన కలిగిన కుమార్తెలును కు

మారులును యున్నపుడామెయాస్తికి కుమార్తెలు ముఖ్యవారసులగుదురు. 21 మ 40.

(8) వివాహమాడుటమాని కేవలము వ్యభిచారవృత్తివల్లనే జీవించు భోగమువాండ్రు, సానివాండ్రు మొదలగుస్త్రీలలో (Prostitutes) కుమార్తెలను సర్వవిధముల కుమారులవలె నెంచు నాచారముగలదు. అపుడట్టి స్త్రీలయాస్తికి కుమార్తెలు కుమారులకంటె ముఖ్యవారసులగుదురు. ఒకస్త్రీయొక్కయాస్తి యామెకుమార్తెలకు సంక్రమించినతరువాత వారిలో నెవరైన చనిపోయినయెడల యామెకు వారసత్వమురీత్యా తల్లినుండిబడసినయాస్తి యామెతల్లియొక్క మిగతాకుమార్తెలకు సంక్రమించుటకుబదులు అనగా యామెతల్లివారసులకు సంక్రమించుటకుబదులు యామెస్వంతవారసులకే సంక్రమించును అనగా యొకపురుషునియాస్తి వానికుమారులకు సంక్రమించినపుడు సదరాస్తియందు వారికెట్టి హక్కులుండునో చిరకాలమునుండి యమలులోగల యాచరణమువలన పైనయుదహరించిన స్త్రీయొక్క కుమార్తెలకును సర్వవిధములా యట్టిహక్కులుండును. 5 మ హైకో రి 161.

కొన్నిప్రాంతములయందు యట్టిభోగమువాండ్రలో స్త్రీలయొక్కయాస్తి కుమార్తెలకును కుమారులకును సమానముగా సంక్రమించెడి యాచారముకూడ గలదు. 14 మ 163.

---

# హిందూన్యాయశాస్త్రము.

# వారసత్వము.

## సప్తమాధ్యాయము.

### విభాగింపగూడని యస్టేటులకు వారసత్వపుక్రమము.

### Succession to Impartible Estates

రెండవయధ్యాయములో సమిష్టికుటుంబము, సమిష్టిదాయాదికుటుంబము, సమిష్టిదాయాదికుటుంబాస్తి స్వార్జితము మొదలగుపదముల కర్థము తెలుసుకొనియుంటిమి. సమిష్టికుటుంబాస్తియందు యాకుటుంబములోని సమిష్టిదాయాదులకు (Coparceners) తమయిష్టము వచ్చినపుడు సదరాస్తిని పంచుకొనుహక్కు లుండునని దెలుపబడెను కాని యట్టికుటుంబాస్తులలో యన్నితరగతులయాస్తులయందును నట్టి హక్కు లుండవనియు సమిష్టిదాయాదులందరు కలసి పంచుకొనుటకనర్హములు (అనగావీలులేనివి) కొన్నియాస్తులుండవచ్చుననియు నిపుడెరుగవలయును అటుల విభాగింపదగని సొత్తులెవ్వియన

(1) ఒకకుటుంబములో నిస్సందేహముగాను నిరభ్యంతరముగాను యనేకతరములనుండి మార్పులేతమాత్రమును లేకుండా నమలు జరుగుచున్న యాచారముప్రకార మొకయాస్తియందు యాకుటుంబము వారికి పంచుకొనుహక్కులేక యందుకేర్పడిన వారసత్వపుక్రమప్రకారమాకుటుంబములో నొకరికిమాత్రమే సంక్రమించుచు మిగిలినవారికి దానినుండి మనోవర్తిమాత్రము హక్కుగలస్థిరాస్తియును 1 క 15 3 ప్రి. కా. 34 క 6

(2) పూర్వకాలమున సర్వస్వతంత్రాధికారులగు రాజులు లేక పాలిగురులచే నేలబడిన రాజ్యములు లేక పాలియములునై యుండి సర్కారువారిచే నిపుడు జమీందారీలుగా లెక్కింపబడి నేటివరకు కుటుంబములో నొకరికిమాత్రమే చెందుచుండునవియును, 6 మ. హై. కో 93 (105) 28 మ 508 ప్రి కౌ

(3) కుటుంబములో నొకరుమాత్రమే పనిచేయుటకుగాను సర్కారువారిచే నియమింపబడిన యుద్యోగమునకు ప్రతిఫలముగా నేర్పడిన స్థిరాస్తియును 7 మ 236

(ఉ. గ్రామకరణము మొదలగు నౌఖరీభూములు) విభాగింపగూడని యస్టేటులైయున్నవి. హిందూన్యాయశాస్త్రము ప్రకారము సాధారణముగా సమిష్టికుటుంబాస్తులన్నియు భాగింపగూడినవని యూహించవలసియుండును గనుక యటులకాదని చెప్పువారు అనగా యేదైన యొకయాస్తి విభాగింపరానిదని చెప్పువారు యట్టియస్టేటు యొక్క స్వభావమునుగాని యట్టియస్టేటును పంచుకొనుటకు హక్కులు లేనట్టు స్పష్టమగు ప్రత్యేకమయినకుటుంబాచారమునుగాని రుజువు చేయవలెను 37 మ 199 (210) ప్రి. కౌ. 28 మ 508 (115) ప్రి కౌ 13 మ 406 ప్రి. కౌ

విభాగింపగూడిన యస్టేటును నూతనముగా సాధారణజనులలో నెవరును యటులవిభాగింపగూడనిదానిగా మార్చజాలరు 36 బొం 53 ఏలయన యెల్లప్పుడును తనయాస్తియొక్క వారసునికే సంక్రమించుచుండవలయునని ఏదైనయేర్పాటుచేసినను యదిహిందూన్యాయశాస్త్రమునకు వ్యతిరేకముగాన యదిచెల్లనేరదు కాని సర్కారువారు యెవరికైనను యస్టేటులను దయచేయునపుడు వానిని విభాగింపగూడదను షరతులతో పట్టాలనొసంగవచ్చును. అపుడట్టివిభాగింపగూడని యస్టేటులగును 21 బొం 458 (462)



విభాగింపగూడని యస్టేటులయందలి హక్కుబాధ్యతలు.

(1) అట్టియస్టేటు వంశపారంపర్యా కుటుంబములో నొకనికి మాత్రమే వారసత్వేనా సంక్రమించును. అటుల సంక్రమించుటలో సాధారణముగా జ్యేష్ఠునకు సంక్రమించును. అపుడది వానిహక్కుభుక్తములలో నుండును.

(2) అట్టిది యెంతమాత్రము సమిష్టికుటుంబాస్తి కానేరదు. అనగా మామూలు సమిష్టిదాయాదిహక్కులు(Coparcenary rights) సదరాస్తియందు యెంతమాత్రము యేవిషయములోను యుండనేరవు 30 మ 454; 32 మ 429; 36 మ 108; 36 మ 305.

కనుక మామూలుహిందూన్యాయశాస్త్రముప్రకారము సమిష్టిదాయాదులకు సాధారణముగా యుండుకొన్నహక్కులలో వేనినైన విభాగింపగూడని యస్టేటుకు వర్తింపజేయవలెననిన యట్టియాచారమున్నటుల స్పష్టముగులాగున యందుకిషయమై యిదివరలో న్యాయాధికారులొసంగిన తీర్పులవలనగాని యితరసాక్ష్యములవలనగాని కనుపరచవలయును. దీనినిబట్టి సదరాస్తికుండి మిగిలినదాయాదులు మనోవర్తిని పొందునాచారము కలదని రుజువుపరచిననే యటుల మనోవృత్తిని రాబట్టుకొను హక్కులుండునని యూహింపవలసియుండును. 41 మ 778 ప్రి. కౌ; 39 మ 306.

(3) అట్టియాస్తిని దానవిక్రయాది యన్యాక్రాంతములు చేయకూడదని ప్రత్యేకము యాచారముగాని సర్కారువారి చట్టములుగాని యుండిననేతప్ప దానిహక్కుదారుడు తనయిష్టమువచ్చినటుల వినియోగించుకొనుటకు సర్వస్వతంత్రమయిన హక్కులు గలిగియుండునని తీర్మానింపబడెను. 18 మ 287; 22 మ 383 ప్రి. కౌ.

కాని మదరాసురాజధానిలో సర్కారువారు దాదాపుగా యట్టియస్టేటులన్నిటిని వానిహక్కుదారులు తమయిష్టమువచ్చినటులెల్ల

యన్యాక్రాంతముచేయుటకుగాని కాముచేయుఋణములను యట్టియెస్టేటులపై బైండుచేయుటకుగాని తగినంత యవసరముండిననేతప్ప వీలులేకుండా కొన్నిచట్టములను యమలులోనికి తెచ్చిరి. అవి 1902 సంవత్సరపు 2 వ నెంబరు ఆక్టు 1903 సంవత్సరము 2 వ నెంబరు ఆక్టు 1904 సంవత్సరపు 2 వ నెంబరు ఆక్టు మొదలైనవై యున్నవి. ప్రస్తుతము 1904 సంవత్సరపు 2వ నెంబరు ఆక్టు యమలులోనున్నది. (The Madras Impartible Estates Act II of 1904) దీనినిబట్టి మామూలు హిందూసమిష్టికుటుంబ మేనేజరుమిగతా సమిష్టిదాయాదులకు తండ్రిగాని తాతగాని కానపుడు యాసమిష్టికుటుంబాస్తిని యెట్టిస్థితిగతులలో మిగతాసమిష్టిదాయాదుల యనుమతియైనను యక్కరలేకయే కుటుంబాస్తిలో వారికి హక్కుగలవాటాలనుగూడ బయిండుచేయులాగున నదరాస్తిని యన్యాక్రాంతములుగాని దానిపై ఋణములుగాని చేయగలడో యట్టిస్థితిగతులు (లేక సంగతిసందర్భములు)లో తప్ప మొదటనుదహరించిన 1-2 తరగతుల (Impartible Estates) విభాగింపగూడని యస్టేటులకు హక్కుదారులగు రాజులు, జమీందారులు పాలిగరులు మొదలగువారు తమయిష్టమువచ్చినటుల్లా తగినయవసరములేనిదే వారియస్టేటులను యన్యాక్రాంతములుచేయుటకుగాని వారియస్టేటులను బయిండుచేయు ఋణములను చేయుటకుగాని యిపుడు వీలులేదు. అటుల చేసినయెడల యవి వారిజీవితానంతరమువరకుమాత్రమే చెల్లునేగాని యవి వారివారసులను బయిండుచేయనేరవు

విభాగింపగూడని యాస్తులయొక్క హక్కుదారులలో మూడవతరగతివారగు సర్కారునౌకరులు. (ఉ. గ్రామకరణము మొదలగువారు) 1894 సంవత్సరపు 2 నెంబరు ఆక్టుప్రకారమున్ను 1895 సంవత్సరపు 3 నెంబరు ఆక్టుప్రకారమున్ను వారివారికి ప్రతిఫలముగా పు



ట్టబడిన యాస్తులను యన్యాక్రాంతములుచేయుటకు యెట్టిసంగతి సందర్భములలోగూడ అసలేహక్కులులేవు.

విభాగింపగూడని యస్టేట్లు (Impartible Estates) అసలుహక్కుదారులవలన యితరులకు విక్రయముకాబడినయెడల యపుడు వానిస్వభావముమారి క్రయదారులకు విభాగింపగూడిన యస్టేట్లు Partible Estates కావచ్చును.

(4) విభాగింపగూడని యస్టేటువలన సాలీనావచ్చు రాబడిని దానిహక్కుదారులు స్వేచ్ఛగా వినియోగపర్చుకొనవచ్చును. అనగా యారాబడి యతనికి స్వార్జితమగును. గనుక యట్టిరాబడివలన సంపాదించిన యాస్తులతనికి స్వార్జితములగును. 29 క 433 ప్రి. కౌ. యట్టియాస్తులను యాహక్కుదారుడు తనయసలు యస్టేటు నభివృద్ధిచేయునుద్దేశ్యముతో వానినిగూడ చేర్చియున్నటుల స్పష్టమయిననేగాని లేనియెడల యతడు చనిపోయినతర్వాత యట్టియాస్తులు మామూలుగా విభాగింపగూడిన స్వార్జితము లేక స్వంతయాస్తివలెనే యతనివారసులకు సంక్రమించును.

ఏదయిన నొకవిభాగింపగూడని యస్టేటుయొక్క హక్కుదారుడు కొంతస్వంతయాస్తిని సంపాదించి దానినెంతమాత్రము ఏవిధముగాను వినియోగపర్చడముగాని దానివిషయమై మరణశాసనము వ్రాయుడముగాని లేక యది తనస్వార్జితమని సూచించు మరియితర వ్యవహారములనుగాని జరిగించకయే మృతినొందినయెడల యపుడది యసలుయస్టేటుతో జేర్చబడునటుల నెంచబడును 27 అ 203 (252) 8 మ. 145; 5 మ హైకో 131.

(5) విభాగింపగూడని యస్టేటు నభివృద్ధిచేయు నుద్దేశ్యముతో దరిమిలాను సంపాదింపబడిన మరికొంతయాస్తి యసలుదానికి చేర్చ

బడినయెడల నూతనముగా చేర్పబడినయాస్తి గూడ మొదటి దానివలెనే విభాగింపగూడని యస్టేటగును

విభాగింపగూడని యస్టేటువిషయమై వారసత్వపుక్రమమును బాగుగా తెలియుటకుగాను వానివిషయమై యింతవరకు సంగ్రహముగా చెప్పబడినవిషయములు యనగా యట్టియస్టేటులన నెట్టివియో వానియందు యజమానులకుగల హక్కుబాధ్యతలెట్టివియో మొదలగు యంశములు ప్రస్తుతమీసందర్భములో చాలును గనుక నిపుడట్టి యస్టేటులవిషయమై వారసత్వపుక్రమము తెలుసుకొనవలయును.

## విభాగింపగూడని యస్టేటులకు వారసత్వపుక్రమము.

## Succession to Impart ible Estates

విభాగింపగూడని యస్టేటుకు వారసత్వపుక్రమమువిషయమై యొక్కొక్క ప్రదేశమందు యొక్కొక్క కుటుంబమువారికి ప్రత్యేకమైదయినయాచారమేర్పడియుండిన నేతప్ప లేనియడల వారసత్వపుక్రమమువిషయమై యచట నాకుటుంబమువారికి వర్తించుమామూలు హిందూన్యాయశాస్త్రపద్ధతియే విభాగింపగూడని యస్టేటులవిషయమై పొందగలమార్పులతో వర్తించునని యెరుంగునది. అనగా విభాగింపగూడని యస్టేటులకు వారసత్వమువిషయమై దేశాచారముగాని కులాచారముగాని కుటుంబాచారముగాని ప్రత్యేకముయేర్పడియున్నయడల దానిప్రకారము యట్టియస్టేటులకు వారసత్వపుక్రమము యమలు జరుగును. అట్టిదేమియు లేనియెడల సదరుయెస్టేటుయొక్క విభాగింపగూడని స్వభావమునుబట్టి రాగలకొన్నిమార్పులతో యచటివారికి వర్తించుమామూలు హిందూన్యాయశాస్త్రప్రకారమే యమలుజరుగును 9 మ. ఇ. అ. 193 ప్రి కౌ; 39 మ. ల. జ. 529.

మితాక్షరన్యాయము శాస్త్రప్రకారము మామూలుగా విభాగింపగూడిన యాస్తికి వారసత్వపుక్రమము విషయములో సమిష్టికు



టుంబాస్తి కొకవిధముగాను స్వార్జితము లేక స్వంతయాస్తి కొకవిధముగాను యెటులుండునో యటులనే విభాగింపగూడని యస్టేటుకు వారసత్వపుక్రమమువిషయములో గూడా యట్టిభేదములుండును. అనగా విభాగింపగూడని యస్టేటుకు వారసత్వపుక్రమము ఈదిగువ నుదహరించిన రెండుయంశములమీద నాధారపడియుండును:—

(1) చనిపోయినహక్కుదారుడు సమిష్టికుటుంబములోనివాడా లేక యాకుటుంబమునుండి వ్యష్టియైనవాడా?

(2) అతను చనిపోయేసరికి యనుభవించుచున్న యాస్తి పితురార్జితమా లేక యతనికది స్వార్జితము లేక స్వంతయాస్తియా?

ఒకడు యనుభవించుచున్నయాస్తి విభాగింపగూడని యెస్టేటైనను (Impartible Estate) యది కేవలము యతనికి స్వార్జితము లేక స్వంతయాస్తిగా భావించుటకు వీలులేదు. అదిసమిష్టికుటుంబాస్తియును కావచ్చును 43 అ. 228=40 మ. ల. జ. 387 ప్రి కౌ

అతను తనకుటుంబముయొక్క మిగతాదాయాదులతో సమిష్టిగాను యుండవచ్చును. లేదా వ్యష్టిగాను యుండవచ్చును. యెటులనిన వానికి పూర్వము వానితండ్రి సదరుయస్టేటును హక్కుదారుగా యనుభవించి దానినుండి సాలీనావచ్చెడి యాదాయమువలన విశేషమైన చరస్థిరరూపకముయిన యాస్తిని స్వార్జితముగా సంపాదించిచనిపోవును. అప్పటికతనికి నలుగురు సమిష్టికుమారులుందురు. అందులో ప్రథముకుమారునకు విభాగింపగూడని యెస్టేటుసంక్రమించును గాని వాని తండ్రివేరే స్వార్జితముగానుంచినయాస్తి యందరికుమారులకును సమిష్టిగా సంక్రమించును. అపుడాకుటుంబములో మొదటివాడు విభాగింపగూడని యెస్టేటుననుభవించుచున్నను యతడు చనిపోవువరకును మిగిలినవారితో సమిష్టిగానుండవచ్చును. లేదా మధ్యనెపుడైనను వ్యష్టియైనను కావచ్చును ఈసమిష్టిగాక వ్యష్టిగానుయుండవచ్చునునది యాకుటుంబ

మునకుగలయాస్తినిబట్టియుండదు. వేరేయాస్తియుండవచ్చును. లేకపోవచ్చును. ఎటులైనను వారియునికిని స్థితిని (Status) వారిప్రయత్నమువలన మధ్యమార్చుకొనిననేగాని లేనియెడల మారజాలదు అనగా వారువిడిపోవలెనని వ్యక్తియైననే తప్ప లేనియెడల వారికి సహజమయిన సమిష్టత్వమును యునికి(Undivided status) దానంతటది మధ్యమారజాలదు గాన వారెల్లప్పుడును సమిష్టిగానేయున్నటులనే భావింపనగును.

అయితే విభాగింపకూడని యెస్టేటును యట్టిసమిష్టికుటుంబములో నొకడుమాత్రము యట్టి యెస్టేటునం దుండదగిన యావత్తుహక్కులతో యనుభవించుచున్నయెడల యది సమిష్టికుటుంబాస్తియగునా లేక స్వంతయాస్తియగునా యని సందేహము గలుగవచ్చును. అట్టియాస్తియందు సమిష్టిగానున్న దాయాదుల కింతమాత్రము యేవిధములయినహక్కులు లేవని యిదివరలో తెలుసుకొని యున్నాము. 32మ 429; 36 మ 108 (325) అట్టి యస్టేటునుండి మనోవర్తి పొందుటకయినను యాచారముండిననేతప్ప హక్కులుండవనిగూడ తెలుసుకొనియుంటిమి. 41 మ 778 ప్రి. కౌ. గనుక సమిష్టికుటుంబదాయాదులకుగాని యితరులకుగాని సదరాస్తియందెట్టిహక్కులు నుండవనుమాట వాస్తవముగాని సదరాస్తి యేతరగతిలోచేరునో యట్టితరగతియొక్క నామముమాత్రము వారసత్వపుక్రమమును దెలుపుటకుగాను మిక్కిలి యుపయోగించును. అనగా యట్టియాస్తి చనిపోయినవానికి పేరునకుమాత్రమే యైనను సమిష్టికుటుంబాస్తిగా యుండినయెడ లపుడది యొకవిధమయిన వారసులకును, యటులగాక స్వార్జితము లేక స్వంతయాస్తిగానుండినయెడల మరియొకవిధమైన వారసులకును సంక్రమించునని యభిప్రాయము. గనుక యీసందర్భములో సమిష్టికుటుంబాస్తి యనగా పితృరార్జితము పాపతు విభాగింపకూడనియాస్తి (Ancestral Impartible



Estate) సమిష్టికుటుంబములో నొకరికిమాత్రము సంక్రమించి యతడు మిగిలిన దాయాదులతో సమిష్టిగానుండగా యతని హక్కుభుక్తములలో నున్నది యని భావము.

దీనినిబట్టి పితురార్జితమయిన విభాగింపకూడని యాస్తి (Ancestral Impartible Estate) సమిష్టికుటుంబములో నొకరికిని సంక్రమించినపుడు యది సమిష్టికుటుంబాస్తి యనుపించుకున్నను దరిమిలాను యతడు మిగతాసమిష్టిదాయాదులనుండి అనగా సమిష్టికుటుంబమునుండి వ్యక్తియైనయెడల యటుల వ్యక్తియైన క్షణముననే యట్టి యాస్తికి యాపేరుగూడమారి స్వంతయాస్తి యని పేరువచ్చును. అటుల సమిష్టికుటుంబాస్తి (Joint family property) యను పేరుపోయి స్వంతయాస్తి యను పేరు (Separte property) యెపుడువచ్చునో యపుడే వారసత్వపుక్రమము మారును.

ఒకప్పుడు సమిష్టికుటుంబములో నొకడు యనుభవించెడి విభాగింపకూడని యాస్తి (Impartible Estate) యతని స్వంతయాస్తి కావచ్చును. ఎటులనిన యట్టియాస్తి తనకుటుంబములో తనకుపైని మూడుతరముల పూర్వులనుండిగాక విభాగింపదగిన మామూలుయాస్తివలెనే మరియితరదాయాదులనుండిగాని (Collaterals) తనతల్లి మొదలగు స్త్రీలద్వారా యితరకుటుంబములోనుండిగాని వారసత్వమురీత్యా స్వార్జితముగా సంక్రమించవచ్చును. మరియుతాను సర్కారువలనగాని విభాగింపకూడని యాస్తిని (Impartible Estate) యన్యాక్రాంతముచేయుటకు హక్కుగలిగిన మరియితరులవలనగాని యుచితముగానైనను ప్రతిఫలమునకైనను పొందియుండవచ్చును. ఇట్టియాస్తులన్నియు స్వార్జితము లేక స్వంతయాస్తులగును. (Self-acquired or separate property.) గాన యట్టియాస్తికి వారసత్వపుక్రమము వేరుగానుండును. అనగా పైన మొదటలో నుదహరించిన సమిష్టికుటుంబాస్తి యొకవిధమయిన వార

సులకును యటుపిమ్మట నుదహరించిన స్వార్జితము లేక స్వంతయాస్తి లెట్టిదైనను యవియన్నియు నొకవిధమైన వారసులకును సంక్రమించునని యభిప్రాయము.

గనుక యిపుడు యీరెండువారసత్వపుక్రమములయందలి భేద మెట్టిదనగా పైనుదహరించిన వారసత్వపుక్రమమునుబట్టి గ్రహింపవలెను.

విభాగింపగూడని యెస్టేటుయొక్క వారసత్వపుక్రమము విషయమై ముఖ్యముగా గమనింపవలసిన సూత్రములు.

Rules regarding the Law of Primogeniture

1. విభాగింపగూడని యస్టేటు (Impartible Estate) యొక్క హక్కుదారుడు పురుషసంతానముగలిగి చనిపోయినయెడల యది సాధారణముగా మితాక్షరన్యాయముప్రకారము వానిజ్యేష్ఠపుత్రునికి సంక్రమించును. అనగా వానికుమారులలో ముందుజన్మించినవానికి సంక్రమించును.

అయితే చనిపోయినవానికి యిద్దరు లేక యెక్కువమంది భార్యలుండి వారియందరకును పురుషసంతానముయున్నపుడు యతనికందులో ముందువివాహముకాబడిన భార్యయొక్క జ్యేష్ఠకుమారుడు వారసగునా? లేక యతనికి యందరిభార్యలవలన కలిగిన కుమారులందరిలోను వయస్సునకు పెద్దవాడగు జ్యేష్ఠుడు వారసుడగునా? యను యంశము పరిష్కరించవలసియున్నపుడు ముందు యాకుటుంబమున కీవిషయములో నాచారమేదైన యున్నయెడల దానిప్రకారము పరిష్కరింపనగును. అనగా ముందువివాహమయిన భార్యయొక్క జేష్ఠపుత్రుడు మిగిలిన భార్యలపుత్రులకంటె వయస్సునకు చిన్నవాడైనను యతడే దరిమిలాను వివాహమయిన భార్యలయొక్క పుత్రులకంటే ముఖ్యవారసగునని యాచారమాప్రదేశమందుగాని యాకుటుంబ



ములోగాని యున్నయెడల యట్టియాచారముప్రకారము వారసుని నిర్ణయింపనగును. 17 మ 422; 22 మ 515 ప్రి. కౌ.

అట్టి యాచారమేదియును లేనియెడల చనిపోయినవానికి యందరిభార్యలవలన గలిగిన పుత్రులందరిలోను వయసునకు పెద్దవాడు ముఖ్యవారసగును. 14 ము. ఇ. అ 570 (519) ప్రి కౌ; 2 మ 286 ప్రి కౌ; 23 అ 369 ప్రి కౌ.

చనిపోయినవాని పెండ్లిభార్యకుగాక యుంచుకొనిన మనిషివలన గలిగినదాశీపుత్రునికంటే సమిష్టిసోదరుడును భార్యయును క్రమముగా ముఖ్యవారసులని మదరాసుహైకోర్టువారు తీర్మానించిరి. 10 మ 334 346.

పైనయుదహరించిన రీతిని చనిపోయినవాని యావదాస్తియు వాని జేష్టపుత్రునికి సంక్రమించినతరువాత యాజేష్టపుత్రుడు చనిపోయినయెడల యట్టియాస్తి యతనిజ్యేష్ఠపుత్రుడు మొదలగు యతనివారసులకు సంక్రమించునుగాని తిరిగియతనితండ్రి వారసులకు సంక్రమించనేరదు. అనగా మామూలుగా విభాగింపగూడినయాస్తి (Partible Property) విషయములో మితాక్షరము న్యాయముప్రకారము చనిపోయినవానికి వారసులెవరో వారికిసంక్రమించును. కాని విభాగింపగూడని యాస్తివిషయములో మాత్రము యట్టివారసులనేకులుయున్నయెడల వారిలో జ్యేష్ఠుడగువానికి మాత్రమే సంక్రమించుచుండును. 19 మ 451 ప్రి కౌ

విభాగింపగూడని యెస్టేటుయొక్క హక్కుదారుడు చనిపోవునరికి యతనికి యదివరలోనే గతించినజ్యేష్ఠపుత్రునియొక్క కుమారులును తనకుమారులును యుందురు. అపుడుగూడా కుటుంబప్రాతినిధ్యత్వమను న్యాయముప్రకారము (Doctrine of Representation)

కుమారులు మనుమలు మునిమనుమలును చనిపోయినవానికి సమానులే గనుక విభాగింపగూడని యెస్టేటునకు సంబంధించినంతవరకు జ్యేష్టకుటుంబములోని మనుమలు మునిమనుమలును కనిష్టులగు (చిన్నవారగు) కుమారులకంటే ముఖ్యవారసులగుదురని మెయినుదొరగారి యభిప్రాయమైయున్నది (మెయినుదొరగారిహిందూన్యాయశాస్త్రము)

2. జ్యేష్టకుటుంబప్రాధాన్యమగు జ్యేష్టత్వమునననుసరించిన సంక్రమణన్యాయము.

Law of Lineal primogeniture

చనిపోయినవానికి పురుషసంతానములేనపుడును యతనియనుభవములోనుండిన విభాగింపగూడనియెస్టేటు (Impartible Estate) సమిష్టికుటుంబాస్తిగానున్నపుడును యదియతని సమిష్టిదాయాదులలో జ్యేష్టకుటుంబములోనివారిలో జ్యేష్టునకు (వయసునందు పెద్దవాడగు) సంక్రమించునుగాని రక్తసంబంధసామీప్యమునుబట్టి వానిదగ్గిర వారసులకు సంక్రమించనేరదు.

అనగాహిందూన్యాయశాస్త్రముయొక్క మితాక్షరన్యాయము ప్రకారము మామూలుగా విభాగింపగూడిన (Partible) సమిష్టికుటుంబాస్తియందు చనిపోయినవానికిగలహక్కులు సమిష్టికుటుంబాస్తి సంక్రమణన్యాయముప్రకారము (Low of Survivorship) యెట్టి సమిష్టిదాయాదులకు సంక్రమించగలవో యట్టివారిని ముందునిర్ణయించి వారుచనిపోయినవానికి యనేకశాఖాకుటుంబములలోనివారగునపుడు యట్టిశాఖాకుటుంబములలో జ్యేష్టకుటుంబమువారిని (వయస్సునకు పెద్దదైన మూలపురుషుడుగల శాఖాకుటుంబమువారిని) నెంచితిరిగి యందులో చనిపోయినవానికి దగ్గరదాయాదులగువారిలో జ్యేష్టుని (వయస్సునకు పెద్దవానిని) వారసునిగానిర్ణయించవలయునని భావము. 24 మ 562; 28 మ 508 (512) ప్రి. కౌ.



ఈకేసులో చనిపోయినవానిసోదరులలో చిన్నవానికుమారుని కంటే పెద్దవానిమనుమడు (కుమారుని కుమారుడు) ముఖ్యవారసుడని తీర్మానింపబడెను. దీనినిబట్టి విభాగింపగూడనియెస్టేటు సమిష్టికుటుంబాస్తి యగునపుడది చనిపోయినవానికి రక్తసంబంధసామీప్యమునుబట్టి వారసులగువారికి సంక్రమించక జ్యేష్టకుటుంబములోనిదగ్గిర దాయాదులలో జ్యేష్టునకు సంక్రమించునని స్పష్టమగుచున్నది. అందువలననే చనిపోయినవానికి వయసునకు పెద్దవాడగు భిన్నోదరసోదరుడు చిన్నవాడగు ఏకోదరసోదరునికంటే ముఖ్యవారసుడగును. 17 మ. 316 (330)

ఇట్టిరీతిని విభాగింపగూడని యెస్టేటుసంక్రమించు వారసత్వపు క్రమమునకు జ్యేష్టకుటుంబప్రాధాన్యమగు జ్యేష్టత్వమునననుసరించిన సంక్రమణన్యాయమనిపేరు (Law of Lineal primogeniture)

(3) రక్తసంబంధసామీప్యము ప్రాధాన్యమగు జ్యేష్టత్వమునననుసరించిన సంక్రమణన్యాయము (Law of Primogeniture by Proximity or ordinary Primogeniture) అట్టియాస్తి సంతానములేక చనిపోయినవాని స్వార్జితము లేక స్వంతయాస్తిగానుండినపుడును యతడు తనదాయాదులనుండి ప్రత్యేకమై వానికుటుంబమునుండి విడిపోయియుండినపుడును సదరాస్తి విభాగింపగూడిన యాస్తియైనయెడల మామూలు వారసత్వపుక్రమముప్రకారము (Ordinary Law of in. heritence) యతనికి వారసెవరైయుందురో యట్టివానికి సంక్రమించును. అనగా యొకనిస్వార్జితము లేక స్వంతయాస్తికి వారసుని నిర్ణయించటలో రక్తసంబంధసామీప్యము ప్రాధానమై యుండును. చనిపోయినవానికట్టి వారసులు యొకనికంటే యనేకమంది యున్నపుడు అనగా వానికి సమానమైన దగ్గరరక్తసంబంధముగలవారసులు యున్న

పుడు వారందరు నొకశాఖాకుటుంబములోనివారై యున్నయెడల వారిలో వయసునకు పెద్దవాడగువానికి విభాగింపగూడనియాస్తి సంక్రమించును. అటులగాక వారందరు యనేకశాఖాకుటుంబములలోనివారై యున్నయెడల వానిలో జ్యేష్ఠకుటుంబమువారిలో జ్యేష్ఠునకు అనగా వయసునకు పెద్దవాడైన మూలపురుషుడుగల శాఖాకుటుంబములోని వారిలో వయస్సునకు పెద్దవానికి సదరాస్తి సంక్రమించునని భావము ఇట్టిరీతిని విభాగింపగూడని యస్టేటు సంక్రమించు వారసత్వపుక్రమమునకు రక్తసంబంధసామీప్యప్రాధాన్యముగు జ్యేష్ఠత్వమునననుసరించిన సంక్రమణన్యాయమని పేరు. (Law of Primogeniture by Proximity or ordinary Primogeniture) ఈపద్ధతిప్రకారము పురుషసంతతిలేక చనిపోయినవానియొక్క విభాగింపగూడని యస్టేటు రక్తసంబంధసామీప్యమునుబట్టి ముందు వానిభార్య, కుమార్తె, కుమార్తెకుమారుడు, తల్లి, తండ్రి, సోదరుడు, మొదలుగాగల వానిస్వంతవారసులకు క్రమముగా సంక్రమించును. అనగా ముందుభార్య (1 మ 312) అనేకమంది భార్యలున్నపుడు పెద్దభార్య లేక పట్టపురాణి (మెయిను దొరగారి హిందూన్యాయశాస్త్రము) భార్యలేనియెడల కుమార్తెలలో జ్యేష్ఠురాలు (6 మ హై కో 310) కుమార్తెలెవరును లేనపుడు కుమార్తెలకుమారులలో (దౌహిత్రులలో) వయసునకు పెద్దవాడు [6 మ హై కో 310; 3 మ 290 ప్రి కౌ] దౌహిత్రులెవరును లేనియెడల తల్లి (44 మ 1 = 39 మ ల జ 529) మొదలగువారిటువలెనె క్రమముగా వారసులగుదురు.

ఒకకుమార్తెకుమారులు సమిష్టిగానున్నను యందులో జ్యేష్ఠునకు చనిపోయినవాని విభాగింపగూడనియాస్తి సంక్రమించునపుడు మామూలుయాస్తి సంక్రమించునపుడువలె యది వారికి సమిష్టియా



స్తి కానేరదు గనుక యట్టి జ్యేష్ఠదౌహిత్రుడు దఖలులాను కాలము చేసినయెడల యట్టియాస్తి యతనిస్వంతవారసులకే సంక్రమించును గాని యాతని సమిష్టిదాయాదుల కెవరికి సంక్రమించనేరదు. 44 మ 1 = 39 మ ల జ 529 అనగా నిచట జగ్గంపేటకేసులోని తీర్పు (25 మ 678 ప్రి కౌ) వర్తించనేరదు, అనగా మాతామహునియొక్క విభాగింపగూడని యస్టేటు యొకకుమార్తెకుబుట్టిన సమిష్టికుమారులలో (సమిష్టిదౌహిత్రులలో) నొకరికి చెందినపుడు సమిష్టియాస్తి కానేరదు. విభాగింపగూడనియస్టేటు (Impartible Estate) వారసత్వమురీత్యా సంక్రమించువిధమును సంగ్రహముగా చెప్పవలెననిన యట్టి యస్టేటుహక్కుదారుడు యవిభక్తకుటుంబములోనివాడై యుండి యట్టియాస్తి సమిష్టికుటుంబాస్తియని పేరునకయినను యనదగియుండిన పుడతడు చనిపోయినయెడల సమిష్టికుటుంబాస్తి సంక్రమణన్యాయము (Law of survivorship) ప్రకారమట్టియాస్తి జేష్ఠకుటుంబప్రాధాన్యముగు జ్యేష్ఠత్వమునననుసరించిన సంక్రమణన్యాయమునుబట్టి (By the Law of lineal primogeniture) యతనిసమిష్టిదాయాదికుటుంబశాఖలలో జ్యేష్ఠకుటుంబశాఖలో చనిపోయినవానికి దగ్గరదాయాదులగు వారిలో జ్యేష్ఠునికి సంక్రమించును. అటులగాక యట్టియాస్తి చనిపోయినవానికి స్వార్జితములేక స్వంతయాస్తియగునపుడును యతడు విభక్తకుటుంబములోని వాడైనపుడును యట్టియాస్తి మామూలువారసత్వపుక్రమముప్రకారం (By ordinary Law of inheritence) రక్తసంబంధసామీప్యముప్రధానముగు జ్యేష్ఠత్వమునననుసరించిన సంక్రమణన్యాయముప్రకారము (By the law of primogeniture by oroximy or ordinary primogeniture) చనిపోయినవానికి సమానమయిన రక్తసంబంధముగలవారనేకులున్నపుడు వారందరునొకశాఖాకుటుం

బములోనివారై యున్న మొదలవారిలో వయస్సునకు పెద్దవానికిని, యటులగాక వారందరు యనేకశాఖాకుటుంబములోనివారై యున్న మొదలవారిలో జ్యేష్ఠకుటుంబములోని జ్యేష్ఠునకును సంక్రమించునని యభిప్రాయము.

ఒకయస్టేటు విభాగింపగూడినదా ? విభాగింపగూడనిదా యను యంశమును యాకేసులోని సంగతిసందర్భములనుబట్టియు యాదేశములోగాని కులములోగాని కుటుంబములోగాని గలయాచారములనుబట్టియు సాక్ష్యమునుబట్టియు నిర్ణయించవలసియుండును 13 మ 403 (423) పి. కౌ. 28 మ 508 (515) ప్రి. కౌ 37 మ 199 (209)

1904 వ సంవత్సరపు 2 వ నంబరు ఆక్టు (The Madras Impartible Estates Act 1904) ప్రకారము ప్రస్తుతము యాంధ్రదేశములో విభాగింపగూడని యస్టేటులెవ్వియనగా:—

—* గంజాము జిల్లా. *—

| | |
|---|---|
| 1 పర్లాకిమిడి | 2 దారకోట |
| 3 కల్లికోట | 4 పెద్దకిమిడి |
| 5 చీకటి | 6 మందస |
| 7 చిన్నకిమిడి | 8 శేరుగడ |
| 9 హుమ్మా | 10 బొడగొగడ |
| 11 సురంగి | 12 జరడ |
| 13 బుదరశింగి | 14 ధర్లా |
| 15 బిరిడి | 16 పా |



—‡ విశాఖపట్టం జిల్లా. ‡—

| | |
|---|---|
| 1 విజయనగరము | 2 బొబ్బిలి |
| 3 సాలూరు | 4 మాడుగుల |
| 5 జయపురము | 6 కురుపాము |
| 7 సంగముపలస | 8 కాశీపురము |
| 9 పాచిపెంట | 10 ఆండ్రి |
| 11 సరిపల్లి భీమవరము | |

—§ గోదావరి జిల్లా. §—

| | |
|---|---|
| 1 పిఠాపురము | 2 నిడదవోలు బహుజల్లిఅంబరుపేట |
| 3 వేగాయమ్మపేట | 4 తంగేళ్ళమూడి |
| 5 భద్రాచలము | 6 కోటిపల్లి— (విజయనగరము జమీందారీలోనిది) |
| 7 తెలికిచర్ల | 8 విలస |
| 9 జానుపల్లి | 10 జాలిమూడి |

పరా:— ప్రస్తుతమింటులో కొన్నియస్టేటులు కృష్ణాజిల్లాకు ండియున్నవి.

—♦ కృష్ణా జిల్లా. ♦—

| | |
|---|---|
| వరకోట | 2 మునగాలపరగణా |
| ంతలపాటివంతు | |

—§ నెల్లూరు జిల్లా. §—

2 చూండి

4 కాళహస్తి

## —† చెంగల్పట్టు జిల్లా. †—

1 కాళహస్తి

## —‡ ఉత్తరార్కాడు లేక చిత్తూరు జిల్లా. ‡—

1 కాళహస్తి

2 కార్వేటినగరము

3 పుంగనూరు

4 కనగుండి

5 బంగారిపాలెము

6 నారగంటిపాలెయము

7 పులిచెర్లపాలెయములో వల్లివేడు కామవరము డివిజనులు

8 గుడిపాటిపాలెయము

9 తుంబపాలెయము

10 కల్లూరుపాలెయము



సంపూర్ణము

Printed by D. V. Ramana Rao, at the ...
Rajahmu...

